# ఈ సంచికలో



ముఖచిత్రం : శాంతి ప్రియ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


Member of Audit Bureau of Circulation Ltd

# *లక్స్

## నా చర్మ సౌందర్యంకోసం దివ్యమైన సబ్బు*

## అన్నది కాంచన




కాంచనకున్నట్లే మీకున్న చర్మసౌందర్యం
అమూల్యం... ఆ సాధనమే దానికి తగినది!

**లక్స్ టాయ్‌లెట్ సబ్బు** సినీమాతారలకు సౌందర్యమునిచ్చే శుద్ధమైన, సౌమ్యమగు సబ్బు
తెలుపులోను, నాలుగు వానవెల్లి రంగుల్లోను వున్నది

లింటాస్-LTS. 190-77 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి




మీరు ప్రచురించిన 'కుంటోడికథ' అనే కథ నాకు చాలా నచ్చినది. అది చదువుతూవుంటే నాయొక్క కంటినీటి నాపుకోలేకపోయాను.

రావకొండ రంగనాథశర్మగారికి నా యొక్క హృదయపూర్వక నమస్కారములు.

పి. యమ్. రావ్,
యిల్లెందు.

జూలై నెల 'యువ'లో వాసిరెడ్డి సీతాదేవిగారు రచించిన "కథ పూర్తి కాలేదు" నన్ను నిజంగా కదిలించి వేసింది. మొదట కొంచెము విసుగనిపించినా చివరన చాలా బావుంది. రచయిత్రికి నా అభినందనలు.

కె. సుభాషిణి, కడప.

జూలై సంచికలో గొల్లపల్లి పట్టాభి రామశర్మగారి 'అనాధ' కథను 'యువ'లో ప్రచురించిన ఎడిటర్‌గార్ని ఎలా అభినందించాలో తెలియటంలేదు. కథే కాకుండా కార్టూనులు ఈ సంచికలో ప్రత్యేకాకర్షణీయంగా వున్నవి.

మద్దాల శ్రీరామమూర్తి,
వీరవాసరం.

జూలై "యువ" సర్వాంగ సుందరంగా తయారుచేసి, పాఠకుల కందించినందుకు నా ధన్యవాదాలు. కీర్తిశేషులు శ్రీ ఆలపాటి వెంకట్రామయ్యగారి చిత్రపటాలు, పాఠకుల నెక్కువగా ఆకర్షించి, వారి హృదయాలలో "యువ" ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకుంది.

కూచి గోపాలకృష్ణరావు,
అంబాజీపేట.

మీ జూలై మాసపత్రికలో ప్రచురించిన 'అనాధ' కథ చాలా బాగునావున్నది. శాంతి హృదయం లాంటి హృదయాలు ప్రపంచములో కనిపించటం చాలా అరుదు. ఇంత దూరములో వున్న మాకు మీ 'యువ' తప్ప మరో స్నేహితుడు లేడు. ఇలాంటి మంచి మంచి కథలు ప్రచురించి తెలుగు స్నేహితులు లేని కొరత తీరుస్తారని ఆశించుచున్నాను.

బి. వి. నారాయణ,
దిమాపూర్ (నాగాలాండ్).

---


వేసవి
నిట్టూర్పులతో
వేడెక్కిన
హృదయాలను
ఝల్లుమనిపించే
చల్లటి పన్నీటిజల్లు..
గుండె గుండెలో
మారుమోగే
సరికొత్త
ప్రేమగీతం ..
పద్మశ్రీ వారి
సమ్మోహనాస్త్రం
ప్రేమించి చూడు
నిర్మాత వి. వెంకటేశ్వర్లు · దర్శకుడు పి. పుల్లయ్య
మూడు
గంటలసేపు
నిజమయే
వలపుల కల....
NVKR



ఆగస్టు
విడుదల!

రాజలక్ష్మి ప్రొడక్షన్స్

# వీరాభిమన్యు

దర్శకత్వం వి.మధుసూదనరావు

సంగీతం కె.వి.మహదేవన్

నిర్మాతలు సుందరలాల్‌నహతా-డూండి



ప్రభాత్
హైదరాబాద్



ప్యారడైజ్
సికింద్రాబాద్

డబ్బు కూడబెట్టాలన్న తలంపు మీకు కలిగిందా! అయితే అందుకు చక్కని పథకం మార్గదర్శి చిట్ ఫండ్ లోని పాత చీటీల్లో మీరు సభ్యులుగా చేరడం. ఇప్పటివరకు యెంతో మంది స్వానుభవంవల్ల తెలుసుకున్న సత్యమిది. ఎందుకంటే మీరు కూడబెట్టిన డబ్బు మరికొంత అదనపు ధనాన్ని చేకూర్చుతుంది. గనుక ఆ మొత్తముతో మీరు కలలు కంటున్న వాటిని పొందగలిగామన్న సంతృప్తి మీకు కలుగుతుంది.

ఏ యే పాతచీటీలో యెంత లాభం వచ్చిందీ, అన్నింటిలోనూ లాభదాయకమైన దేదీ — ఆ యా లాభాలకు సంబంధించిన లెక్కలు వివరంగా మీ సౌలభ్యం కొరకు మా వద్ద పొందుపరచబడినాయి.

---

## లాభసాటి యైన పెట్టుబడికి

# ఒక సదవకాశం!

---

మా కార్యాలయానికి విచ్చేసి మీ మీ ఆర్థిక పరిస్థితులు, లక్ష్యాలను గురించి అతి స్వేచ్ఛగా మాతో చర్చించండి, నెలకు రు 20/- మొదలు రు. 200/- వరకూ పెట్టుబడి పెట్టటానికి అవకాశ ముండే నెలసరి పెట్టుబడి పథకము గురించి అడగండి.

తమ పెట్టుబడులకు భద్రత గలదీ, లాభదాయకమైనదిగా అసంఖ్యాకమైన వ్యక్తులు, కుటుంబాలు, వ్యాపారస్తులచే భావించబడుతున్న మార్గదర్శి చిట్ ఫండ్ లో మీరు కూడా ఎందుకు చేరరాదు? మా చిరునామా.

అబిడ్ సెంటర్, హైదరాబాదు-1

ఫోన్ : 46225

KIRON

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 12 | ఆగస్టు, 1965 | సంచిక 2

దేశంలో ప్రభుత్వం నెలకొల్పబోయే అయిదవ ఉక్కు-ఫ్యాక్టరీకి అనుకూలమైన స్థలం విశాఖపట్టణం, అని ఆంగ్లో-అమెరికన్ కన్సార్టియం సలహా యిచ్చింది. ఇది ఆంధ్రులు సంతోషించవలసిన విషయం. కాని. అంతటితో అన్ని విధాలా ఇది సంతోషకరంగా పరిణమిస్తుందని ఊరుకోవలసిన విషయంకాదు ఈ ఉక్కు-ఫ్యాక్టరీని ఆంధ్రదేశంలో పెట్టకుండా చెయ్యడానికి, ఒకవేళ పెట్టేటట్టయితే. దాని సైజును తగ్గించి, ఒక చిన్న ఫ్యాక్టరీని విశాఖపట్టణంలో పెట్టించి, సేలం హాస్పేటలలోకూడా ఉక్కు-ఫ్యాక్టరీలను పెట్టించడానికి ప్రబలప్రయత్నాలు జరుగుతున్నాయి. సేలం, హాస్పేటలలో ఉక్కు-ఫ్యాక్టరీలను స్థాపించడానికి ఆంధ్రులెవరూ అడ్డురారు. కాని, అక్కడ ఫ్యాక్టరీలను పెట్టడంకోసం విశాఖపట్టణం ఫ్యాక్టరీసైజును తగ్గించి, అక్కడ చిన్న ఫ్యాక్టరీని స్థాపించి, ఆంధ్రుల కళ్ళు తుడవడానికి ప్రయత్నం జరిగితేమాత్రం. ఆంధ్రులు ఆందోళనపడకమానరు.

ఇలాటి ప్రయత్నాలు జరగడం, ఆ ప్రయత్నాలు ఫలించడం ఇది మొదటిసారి కాదు హైదరాబాదు సమీపంలో రామచంద్రపురంవద్ద బాయిలర్స్ ఫ్యాక్టరీ స్థాపించడానికి ఏర్పాట్లన్నీ జరిగి, యంత్రసామగ్రి అంతా అక్కడకు చేర్చిన తరువాత ఆ ఫ్యాక్టరీని తిరుచిరాపల్లికి మార్చడానికి ప్రయత్నాలు జరగడం; ఆంధ్రులు తీవ్రమైన ఆందోళన చెయ్యగా, ఆ ఫ్యాక్టరీని రెండుగా విభజించి సగం యంత్ర

సామగ్రిని తిరుచిరాపల్లికి తీసుకొనిపోయి, అక్కడకూడా ఒక ఫాక్టరీని స్థాపించడం — ఇదివరకు జరిగిన సంగతే. ఇలాటి అనుభవం తరువాత, ఆంధ్రదేశంలో కేంద్రప్రభుత్వపు పరిశ్రమలను స్థాపించడం విషయంలో సంపూర్ణమైన న్యాయం జరుగుతుందని ఆంధ్రు లెవరూ గట్టిగా నమ్మజాలరు.

మన అవసరాల్ని గురించి గట్టిగా దేశమంతటికీ తెలిసేటట్టు అరవడానికి మనకు ఇంగ్లీషుపత్రిక లేదు. ఆంధ్రులు ఎక్కువగా చదివే ఇంగ్లీషుపత్రికలు, ఆంధ్రుల అవసరాలను గురించి ఇతర రాష్ట్రాలవారు తెలుసుకోడానికి మార్గాలైన ఇంగ్లీషుపత్రికలు—మదరాసునుంచి వెలువడుతున్నాయి. విజయవాడనుంచి ఒక ఇంగ్లీషుపత్రిక వెలువడినా. అదికూడా మదరాసులో వున్న యజమానులచే ఈ పత్రికలు ఉక్కుఫాక్టరీని గురించి వ్రాసిన సంపాదకీయాలు చాలా భద్రంగా వున్నాయి. నాల్గవ పంచవర్ష ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వం స్థాపించబోయేది, ఒకే ఒక ఉక్కుఫాక్టరీ. ఈ ఫాక్టరీని విశాఖపట్టణంలో పెట్టడం మంచిదని, నిష్పాక్షికమైన ఒక కమిటీ సిఫార్సుచేసింది. అలా చెయ్యడం మంచిదని వ్రాయడానికి బదులుగా, మదరాసు పత్రికలన్నీ విశాఖపట్టణంలోనూ పెట్టవచ్చు, హోస్పేటలోనూ పెట్టవచ్చు. సేలంలోనూ పెట్టవచ్చు నంటూ, చిన్న చిన్న ఫాక్టరీలను పెడితే మంచిదంటూ, శ్రీరంగనీతులు చెప్పాయి. మదరాసులోనూ, మైసూరులోనూ కేంద్ర పరిశ్రమలను పెద్దపెద్దవాటిని ఎన్నిటినో స్థాపించినప్పుడల్లా, వాటిని చిన్నచిన్నవిగా విభజించి, ఆంధ్రలోకూడా కొన్ని భాగాలను స్థాపించవచ్చునని చెప్పడానికి, మనస్సూ, నోరూ రాని యీ పత్రికలు, ఆంధ్రలో పెట్టవలసిన ఫాక్టరీ సైజును తగ్గించవచ్చుననీ, సేలం హోస్పేటలలోకూడా చిన్నచిన్న సైజులలో ఉక్కుఫాక్టరీలను స్థాపించవచ్చుననీ చెప్పడానికి ఎలా సాహసించాయో తెలియడం లేదు. ఉక్కుఫాక్టరీల స్థాపన పూర్తిగా కేంద్రప్రభుత్వం ఆధ్వర్యంలో జరగవలసిన పని. ప్రస్తుతం పెట్టవలసినది ఒక ఫాక్టరీ మాత్రమే. ఆ ఫాక్టరీని విశాఖపట్టణంలో పెట్టడం మంచిదని, నిష్పాక్షికంగా ఒక కమిటీ సిఫారసు చేసింది. ఆ సిఫారసుకు, కేంద్రప్రభుత్వమూ, తక్కిన రాష్ట్ర ప్రభుత్వాలూ కట్టుబడి, ప్రస్తుతం దేశంలో వున్న నాలుగు ఉక్కుఫాక్టరీలలాగానే పెద్ద ఫాక్టరీని విశాఖపట్టణంలో పెట్టడానికి అడ్డురాకుండా వుండటం న్యాయము. అలా కాకుండా, తమ రాష్ట్రాలలో

కూడా చిన్నచిన్న ఫాక్టరీలను పెట్టమంటూ ఆంధ్రదేశంలో పెట్టబోయే ఫాక్టరీని చిన్నదానిక్రింద మార్పించడానికి ప్రయత్నం చెయ్యడం. ఇప్పటికే విస్తారంగా పరిశ్రమలను పెంచుకొని, కేంద్రప్రభుత్వ పరిశ్రమలను ఎన్నిటినో తమ రాష్ట్రాల చేజిక్కించుకొని బాగా ముందుకు వచ్చిన రాష్ట్రాలు చెయ్యవలసిన పనికాదు. అలా జరగకుండా చెయ్యడానికి ఆంధ్ర ప్రభుత్వమూ, ఆంధ్ర ప్రజలూ, ఆంధ్ర శాసన సభ్యులూ - అందరూ ఒక్కుమ్మడిగా కృషి చెయ్యాలి. ఈ విషయంలో ఆంధ్ర రాష్ట్రానికి న్యాయం చేసితీరాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడి చెయ్యాలి. అలా ఇప్పటినుంచీ చెయ్యకపోతే, మనకు పూర్తిగా అన్యాయం జరగకపోయినా, ఎంతో కొంత అన్యాయం జరగక మానదు.

ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారి ఎన్నిక చెల్లదంటూ వచ్చిన పిటీషనును కోర్టు కొట్టివేసింది. ఇలాటి నిర్ణయం వచ్చినందుకు, బ్రహ్మానందరెడ్డిగారిని అభినందిస్తున్నాము. బ్రహ్మానందరెడ్డిగారి పరిపాలనాదక్షతను రాష్ట్రంలోని అన్ని పార్టీలవారు మెచ్చుకున్నారు. రాష్ట్రాభివృద్ధికి వారు చేస్తున్న కృషిని అందరూ శ్లాఘించారు. వారు ముఖ్యమంత్రి పదవినుంచి విరమించ నక్కరలేకుండా కోర్టు తీర్పు రావడం హర్షించవలసిన విషయమే.

కేంద్ర ప్రభుత్వంలో సంజీవరెడ్డిగారి సహకారంతో, రాష్ట్రాభివృద్ధికి బ్రహ్మానందరెడ్డిగారు ఇంకా ఎక్కువగా కృషిచేస్తారనే విషయంలో సందేహం ఏమీ లేదు. ప్రస్తుతం, ఈ ఇద్దరు నాయకులనూ ఎదుర్కొన్న పెద్దసమస్య – ఉక్కు ఫాక్టరీ. సంజీవరెడ్డిగారే ఉక్కుశాఖామంత్రి కావడంవల్ల, యీ ఫాక్టరీ స్థాపన విశాఖపట్టణంలో జరిగితే, తమ రాష్ట్రంపట్ల ఆయన పక్షపాతం చూపారనే అసందర్భప్రలాపాలు కొంతమంది చెయ్యవచ్చును. అంతమాత్రంచేత మనం భయపడ నక్కరలేదు. మన హక్కులను ఒదులుకోవలసిన అవసరమూ లేదు

కేంద్ర ప్రభుత్వంలో వున్న సంజీవరెడ్డిగారికీ, రాష్ట్రముఖ్యమంత్రి బ్రహ్మానంద రెడ్డిగారికీ, రాష్ట్ర ప్రజల సంపూర్ణ సహకారమూ, మద్దతూ వున్నదని కేంద్ర ప్రభుత్వం గ్రహించేటట్టు మనం చెయ్యాలి.

అయిదవ ఉక్కుఫాక్టరీ స్కేలులో ఏమాత్రమూ కొరత లేకుండా విశాఖ పట్టణంలో స్థాపింపబడివలసిందే.

# చిత్ర వార్తలు



ఆరోగ్యమంత్రి శ్రీ శివరామప్రసాద్ ను ముఖ్యమంత్రి
మన అధ్యక్షునకు పరిచయము చేస్తున్న దృశ్యం



ఆంధ్రప్రదేశ్ గవర్నరు జూబిలీహాలులో టూరిస్టు డెవలప్మెంటు
కౌన్సిల్ సమావేశమును జూన్ 29 వ తేదీన ప్రారంభించారు



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి కడప సెంట్రల్ బ్యాంకులో కీ॥ శే॥ శంభురెడ్డి చిత్ర పటాన్ని ఆవిష్కరించారు.



ప్రణాళికాసంఘం ఉపాధ్యక్షుడు శ్రీ అశోక మెహతా పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తున్న దృశ్యం.

# తిమింగిలం వేట

(గోపాలానికి పెళ్ళివిషయమై వున్న అభిప్రాయాలు ఇందిర తల్లిదండ్రులకు నచ్చటంవల్ల ఇందిరను గోపాలానికి అంటకట్టాలనుకోవటం ఇందిర కొక సమస్య అయింది. తనపెళ్ళి తనే చేసుకోగలననే ధైర్యం ఆమె కున్నది. బీచ్‌లో ఇందిర అభిప్రాయం గ్రహించిన గోపాలం పెళ్ళికి విముఖతచూపి వెళ్ళిపోయాడు. రఘురామయ్య భార్య చనిపోయిందని తెలిసిన ఇందిరకు రఘురామయ్యను చేసుకుంటే తన ఆశలు నెరవేరుతయ్యని తోచుతున్నది.

చలపతి ఆహ్వానించగా అతనికొడుకు ఒడుగుకు ఇందిరకు ఇష్టంలేకపోయినా, నాగభూషణం కుటుంబం అంతా ఎగువతిరుపతికి చేరారు. చలపతికొడుకు ఒడుగుతోపాటు నాగభూషణం కొడుకుల ఒడుగులుకూడా అయినై. ఆ సందర్భంలో రఘురామయ్య వచ్చి చేతులోవున్న పూలదండ ఇందిర మెడలో వెయ్యడంతో ఇందిరకు అనేక యోచనలు పోయినయి. కాని తిరిగి ఇంటికివచ్చిన తరువాత మామూలుజీవితం — పూర్వపు సమస్యలే తయారైనయి.)

— ఇక చదవండి.

"గుర్తుపట్టకేం? అంతా బాగున్నారా నాయనా? మీ నాయనమ్మ కులాసాగా తిరుగుతోందా! మి చెల్లెలికి మళ్ళీ ఏమన్నా పిల్లలా?" అంటూ సుభద్ర సాంప్రదాయికంగా కుశలప్రశ్నలు చేసి, "ఎప్పుడొచ్చావ్? ఒక్కడివే వచ్చావా?" అని అడిగింది.

"లా కాలేజీలో చేరా నత్తా" అన్నాడు రామనాథం.

"అత్తా" అన్న సంబోధన వినగానే ఇందిర ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయింది. కొంపతీసి వాడు తనకోసం తండ్రి తెచ్చిన సంబంధం కాదుగదా.

అయితే ఇందిరకు అతనిమీద ఏర్పడిన దురభిప్రాయం త్వరలోనే పోయింది రామనాథం సాముజాతికి చెందినవాడే అనుకున్నా, నీళ్ళకట్టె. చాలా అమాయకుడు. బడబడా మాట్లాడేస్తాడు. ఏ విషయమూ లోతుగా ఆలోచించలేడు. సినిమాలు చూసీ, సినిమాపత్రికలు చదివీ అలవరుచుకున్న సంస్కారం అతనిది.

నాగభూషణం అతన్ని ఆ రాత్రికి ఉండిపొమ్మన్నాడు, కట్టుకొనటానికి తన పంచకూడా ఒకటి ఇచ్చాడు.

గోడపక్కగా చిన్న నవారుమంచం మీద కూర్చుని, ఎంతకీ అయిపోని స్క్రూరీల్‌గా, రామనాథం వాగుతూంటే, సుభద్రా, నాగభూషణమూ, శేషూ, సుబ్బూ ఒకరితరవాత ఒకరు శ్రోతల

కొడవటిగంటి కుటుంబరావు



పాత్ర ధరిస్తూ. మధ్య మధ్య తమ పనులు చూసుకుంటూవచ్చారు.

రామనాథం లాకాలేజీతో మొదలు పెట్టి. సినిమాలను గురించీ. పత్రికలను గురించీ తన స్నేహితులను గురించీ. తాను వెళ్ళిన ఎక్స్‌కర్షన్లు గురించీ. బంధువులను గురించీ. ఫుట్‌నోట్స్ కూడా ఇవ్వకుండా మాట్లాడాడు. ఈ చాంద్రాయణంలో రఘురామయ్య వస్తాడని ఇందిర కలలోకూడా అనుకోలేదు—కాని వచ్చాడు.

"మొన్నటి జూన్ మొదటివారంలో హైదరాబాదు వెళ్ళినప్పుడు రఘురామయ్య కట్టిన కొత్తఇల్లు చూశా నత్తా. ఎట్లా ఉందనీ! అంతా లే-టేస్ట్ కన్‌స్ట్రక్షన్! లే-టెస్ట్ ఫిటింగ్స్! పాస్టెల్ కలర్ పెయింట్ వేయించాడు. గదుల్లో లైటింగ్ చూసితీరాలి. ఏం ఫర్నిచర్! అబ్బ! కింద కార్పెట్స్! పైన మేడ అంతా ఏర్‌కండిషన్ చేయించాడు. ఓహ్ అద్భుతం! రెండు లక్షలు ఖర్చయిందన్నారు. అయుంటుంది కూడాను!"

సుభద్ర ముక్కుమీద వేలేసుకుని, "రెండులక్షలు పెట్టి ఇల్లేమిటీ?" అన్నది.

"ఇన్వెస్ట్‌మెంట్ లే, అత్తా. రెండు లక్షలతో వ్యాపారం చేస్తే అది పదేళ్ళకు తిరిగివచ్చినా గొప్పే. ఈయన ఏడాదికల్లా మొత్తం రాబడతాడుగా! అమ్మో. తిమింగళం! అంత ఇల్లూ తనకోసం కట్టాడనుకున్నావా? మంత్రులకు పార్టీలివ్వటానికీ, పై దేశాలనుంచి గొప్పవాళ్ళు వస్తే—

"అవునూ, ఈనగా రెప్పుడూ మంత్రులవెంటే తిరుగుతాడా ఏం? కిందటి నెల పిల్లల వడుగులకి వచ్చాళ్ళే. అప్పుడూ ఎవరో మంత్రివెంటే ఉన్నా

డన్నారు. ఎంత పెద్ద కారులో వచ్చా డనుకున్నావ్ ?"

"జాతకంలే, అత్తా ! నలభై ఏడులో కూడా మనవంటివాడే. అప్పు డీయన స్నేహితులు రజాకార్లు. వాళ్ళే పోషించారు. తరవాత, హైదరాబాదు పోలీసాక్షన్ జరిగిన మీదట గాంధీటోపీ వేసేశాడు. ఢిల్లీ వెళ్ళి వచేటలకు రజాకార్ల సమాచారాలన్నీ చెప్పాడంటారు. మనిషి మాత్రం సాహసి. ఆయన మేనల్లుణ్ణి పోలీసులు కాల్చిచంపారు; కమ్యూనిస్టులే. ఈయనే పోలీసులకి వాణ్ణి పట్టి ఇచ్చాడంటారు. ఇంకా చాలాచాలా చెబుతారు. కాని దేనికీ రికార్డుగాని, సాక్ష్యంగాని లేదు. బెజవాడ పెళ్ళికొచ్చేటప్పుడు వాళ్ళ కారుకింద పడి ఎవడో చచ్చాడు; కేసుకూడా లేదు."

"కాలో ఏదో విరిగిందన్నారు ?"

"కాలు విరగట మేమిటి? శవాన్ని పోల్చటానిక్కూడా లేకుండాపోతే. చచ్చినవాడి తండ్రికి వెయ్యిరూపాయలిచ్చాట్ట."

సంభాషణ రుచించకనో ఏమో నాగభూషణం అర్జంటు పనున్నవాడిలాగా బయటికి వెళ్ళిపోయాడు.

"హైదరాబాదులో వాళ్ళిల్లెక్కడా?" అని అడిగింది ఇందిర

"హిమాయత్‌నగర్‌లో."

ఇందిర కొంచెంసేపాగి, "ఆయన పెళ్ళాం పోయిందిటగా ." అన్నది.

"అవును. పోతే ఆయన కేం తక్కువలే? వెయ్యిగుళ్ళ పూజారి. అసలు ఆయన పైకి వచ్చిందె ఆడవాళ్ళతో. ఆయన కో బాబున్నది; చాలా పెద్ద కుటుంబానికి చెందినదట. లక్షల కొద్దీ ఆస్తి ఉందిట. మొగుడు లేడు. ఈయన వాళ్ళ వ్యవహారాలు చూడటానికి కుదిరి మెల్లిగా ఆవిణ్ణి బుట్టలో వేసుకున్నాడు. లేక ఆవిడే ఈయన్ని బుట్టలో వేసుకున్నదో. ఈయనకంటె అంతోఇంతో పెద్దదిట తెల్లగా, లావుగా నాయెత్తుంటుంది ఇదిగాక ఆశ్రయించే ఆడవాళ్ళు కొల్లలు. వాళ్ళ కాయన ఉద్యోగాలూ అవీ ఇప్పిస్తాడు..."

ఇటువంటి విషయాలు వినటం ఇందిరకు రుచించలేదు అయినా వాటినిబట్టి ఆమె తన లక్ష్యాన్ని మార్చుకోవలచలేదు. రఘురామయ్య ఎటువంటివాడైతే నేం? ఆయన డబ్బుకూ, పలుకుబడికీ. ఇందిర ఆరాధించే సాంఘికశక్తు లన్నిటికీ అపరావతారం

ఒకనాడు నాగభూషణం సకుటుంబంగా సినిమాకు వెళ్ళాడు. అక్కడ వాళ్ళకి గోపాలం కనిపించాడు అతని వెంట ఎవరో అమ్మాయి ఉన్నది ఆ అమ్మాయి చాలా అందంగా ఉన్నదనటాని కేమీ సందేహం లేదు ఇందిర అసూయపడలేదు.

గోపాలం నాగభూషణాన్ని చూడగానే ఆ అమ్మాయితోసహా దగ్గిరికి వచ్చి,

"మా ఆవిడండీ. వీరే నాగభూషణం గారు, వా రమ్మాయి – నే చెప్పానే – ఇందిర; వాళ్ళమ్మగారు. వీ ళ్ళిద్దరూ ఇందిర తమ్ముళ్ళు." అన్నాడు తన భార్యతో.

ఆ అమ్మాయి పెద్దవా ళ్ళిద్దరికీ నమస్కారాలు చేసి, మిగిలినవాళ్ళకు నాజూకుగా "హో" చేసింది నవ్వుతూ.

ఇందిరకు మండిపోయింది అతను తనను గురించి తన భార్య కేం చెప్పాడు ? తనవంటి అందమైనవాణ్ణి చేసుకోనన్నదని చెప్పాడా ? ఇందిరపాటి అందగత్తెను తానే చేసుకోనన్నానని చెప్పాడా?

ఎన్నోసార్లు గమనించింది కాని అర్థం చేసుకోలేకపోయింది – గోపాలం గురించి ప్రస్తావన వచ్చినా, అతను అయిదునిమిషాలు ఎదురుగా ఉన్నా ఇందిరకు ఏదో ఒక కోపకారణం తటస్థపడుతుంది; ఎందుచేత ? ప్రభాకరాన్ని చూస్తే ఆమెకు చాలా అసహ్యం, కాని అతని పైన ఇలా ఎన్నడూ కోపంలాంటిది రాలేదు. ప్రభాకరం అసహ్యంగా కనిపిస్తాడు. అసహ్యంగా ప్రవర్తిస్తాడు. అసహ్యం పుట్టిస్తాడు. ఈ గోపాలం అట్లాకాదు ఇతను పైకి సంతోషం కలిగించేవాడిలాగా కనిపిస్తాడు. కోపం తెప్పిస్తాడు.

ఇటువంటివి గమనించటం తేలిక, అర్థం చేసుకోవటం కష్టం

"మీ రే క్లాసు కొంటున్నారు ?... మేమూ అదే కొంటాం. అందరమూ సరదాగా ఒకచోటే కూర్చోవచ్చు." అన్నాడు గోపాలం.

సీట్లలో కూర్చునేటప్పుడు గోపాలం ఒకచివరా. అతని పక్కన అతని భార్యా, ఆమె పక్కన ఇందిరా సద్దారు. గోపాలం పెళ్ళిశుభలేఖ వచ్చినప్పు డందులో పెళ్ళి కూతురిపేరు చూసిందిగాని, ఇందిర కిప్పు డాపేరు జ్ఞాపకంరాలేదు.

ఆమె అకస్మాత్తుగా ఇందిర కేసి తిరిగి, "మీ రెవరూ మా పెళ్ళికి రానేలేదు. తప్పక వస్తా రనుకున్నాం !" అన్నది

ఇందిర నిర్ఘాంతపోయింది. పెళ్ళినాటికె ఈ మనిషి తను తప్పకుండా వస్తుందని ఎట్లా అనుకున్నదీ ? తను ఎవరో, ఆమె కేంతెలుసూ ?

"నాకు పరీక్షలో ఏవో అడ్డొచ్చాయి," అన్నది ఇందిర మెకానికల్‌గా

సాధారణంగా కొత్తగా పెళ్ళయిన వాళ్ళు పదిమందిమధ్య – ముఖ్యంగా పదిమందిమధ్యనే – ఒకరికోసం ఒకరు చచ్చిపోతున్నట్టుగా ప్రవర్తిస్తారని ఇందిర గమనించింది. కాని ఈ జంటలో అటువంటిధోరణి కనిపించలేదు. వాళ్ళు భార్యాభర్తలు కానట్టుగానో. కొత్తమోజు తీరిపోయినట్టుగానో ప్రవర్తించారు

ఇంటర్వెల్లో గోపాలం, "ఇది హిట్ పిక్చర్ ! అరవ్వాళ్ళను ఒక సంప్రదా

యాన్ని ఆదరించటమూ పోషించటమూ అలవా టున్నవాళ్ళు. ఈ పిక్చరు తెలుగులో తీస్తే రెండురోజు లాడదు." అన్నాడు

"వాళ్ళు అందాన్ని ఖాతరు చెయ్యరు. అభిమానమే వాళ్ళ కెక్కువ. ఇటువంటి హీరోలను పరే(ప్రాంతంవాళ్ళు సహించరు." అన్నది అతనిభార్య.

"మన తెలుగువాళ్ళకు అందం చూసి అభిమానించటమైనా తెలిసిందా ? అదీ లేదు." అన్నాడు గోపాలం.

అతను తనను ఎద్దేవా చేస్తున్నా డా అనుకున్నది ఇందిర.

"ఎవరి అభిమానాలు వాళ్ళ కుంటాయి. అరవవాళ్ళు మంచి నటులను అభిమానిస్తారు. కొందరు అందాన్ని అభిమానించవచ్చు. మరికొందరు మరొక దాన్ని అభిమానించవచ్చు. అభిమాన మన్నదానికికూడా చట్టాలు ఏర్పరుస్తారేమిటి ?" అన్నది ఇందిర.

"నాకు తెలిసినంతవరకు తెలుగు వాళ్ళు డబ్బును అభిమానిస్తారు అరవ పిక్చర్లలో కథలు చూస్తే వాటిలో సంఘనీతి అంటూ కనిపిస్తుంది. మన కథల్లో ధనాశతప్ప ఇంకేమీ కనిపించదు."

అతను తననే చెప్తున్నా డని ఇందిర రూఢి చేసుకున్నది. ఆమె కతనిమీద మరింత మంటపుట్టుకొచ్చింది.

సినిమా అయి బయటికి వచ్చి, ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయేటప్పుడు సుభద్ర గోపాలం భార్యతో, "ఏమమ్మాయ్, రుక్మిణీ, మీ రిద్దరూ మాయింటి కోసారి రారాదూ ?" అన్నది.

అవును. ఆ అమ్మాయిపేరు రుక్మిణీ. పేర్లు కుదిర్చినట్టుగా ఉతికాయని అప్పుడే సుభద్ర అన్నది. ఎందుకో ఇందిర కామాటైనా జ్ఞాపకం రాలేదు

ఇల్లు చేరవస్తూ సుభద్ర, "నిక్షేపమంటి కుర్రాడు. అల్లుడు కావలసిన వాడు. ఈ పెద్దమ్మ పడగొట్టేసింది." అన్నది.

"చాల్లే ఊరుకుందూ ? అయిపోయిందానికెందుకూ?" అన్నాడు నాగభూషణం. ఆయన లోపల అనుకుంటున్నమాటే తల్లి పైకి అనేసిందని ఇందిర గ్రహించింది.

"ఈ పిల్లయినా బాగానేఉంది."

"మనపిల్లకన్న నయమే," అన్నాడు నాగభూషణం.

ఇందిరకు కోపం రాలేదు.

రిజల్ట్సు వచ్చాయి; ఇందిర పాసయింది. క్లాసు రాలేదు. అయినా — ఇందిరా బియ్యే ! నాగభూషణం ఇందిరకోసం సీరియస్‌గా సంబంధాలు విచారించసాగాడు. ఇందిర తన కేమీ సంబంధించనట్టుగా చూస్తూ ఊరుకుంది.

ఒక సంబంధం వచ్చింది. పెళ్ళికొడుక్కు పాతికేళ్ళు; లాయరు. తండ్రీ లాయరే తిండికి లోటులేని ఆస్తి ఉంది.



ఇల్లుంది. ఇద్దరే కొడుకులు. పిల్లవాడికి తల్లిలేదు, అప్పచెల్లెళ్ళు లేరు.

"అది బాగుందర్రా! ఈ సంబంధం చేస్తే పిల్లకు అత్తపోరూ, బిడ్డపోరూ ఉండదు," అన్నది సుభద్ర.

"కట్నాలకిందా, లాంఛనాలకిందా నాలుగువేలు, పెళ్ళి దర్పంగా చెయ్యాలి. ఏదో చేశామనిపిస్తే చాలదు. డాన్సు, పాట కచ్చేరీలు పెట్టాలి. ఏ డెనిమిదివేలు ఖర్చనుకో."

"పిల్లవాడు అందంగా ఉంటాడా?"

"కట్నం అడుగుతున్నది అందానికి కాదు. పిల్లవాడు నచ్చకపోతే పిల్ల నివ్వరు. కావలిస్తే పెళ్ళిచూపులకు వస్తారు. రానూ పోనూ ఫస్టుక్లాసివ్వాలి. లేదా మనం వెళ్ళి చూసుకురావచ్చు"

"వాళ్ళు పిల్లను చూడరా ఏమిటి?"

"వాళ్ళ కక్కర్లేదు. ఆ కట్నం పారేస్తే ఎవరినన్నా చేసుకుంటారు."

"ఇదేం సంబంధమండీ? ఎక్కడా చూళ్లేదూ?"

"కొత్త రోజులూ, కొత్త పద్ధతులూనూ"

"వేళాకోళాని కంటున్నారా? లేక ఈ సంబంధం గురించి నిజంగానే ఆలోచిస్తున్నారా?" అన్నది సుభద్ర. ఆమెకు లోతునీళ్ళల్లో దిగినట్టయింది.

"నిజంగానే ఆలోచిస్తున్నా. ఎవరి నడిగినా మంచిసంబంధ మంటున్నారు!"

"డబ్బు? ఏ డెనిమిదివేలు పుట్టించొద్దూ?"

"ఇది అందరికీ ఉన్నదేగా? ఇంకా మనం నయంకాదూ? ఒక్కత్తే పిల్ల. ముగ్గురు నలుగురు ఆడపిల్లల తండ్రుల

కూడా ఇదే సమస్యగా ? ఎక్కడో తల తాకట్టుపెట్టి తెస్తాం."

సుభద్ర ఆలోచించింది. ఆవిడ అశ్లీలం అనదలుచుకున్నదాని లాగా గొంతు తగ్గించి. "ఆ గోపాలంలా కట్నం వద్దనేవా ళ్ళుండరుటండీ ?" అన్నది.

"ఉంటే వాళ్ళు ఖంతలు. వాళ్ళకి పిల్లల్నిచ్చేవాళ్ళకు తమ పిల్లలపైన ప్రేమ లేనట్టే లెక్క !" అన్నాడు నాగభూషణం.

గోపాలం కట్నం లేకుండానూ, ఖర్చు లేకుండానూ తనను చేసుకుంటా నన్నప్పుడు తను అభ్యంతరం చెప్పి ఉండకపోతే తన తల్లి దండ్రుల కిప్పు డీ సమస్య రాకపోను. తన తండ్రి స్థితిలో ఉన్నవాడు కూతురుకోసం ఏడు ఎనిమిదివేలు ఖర్చు చెయ్యట మంటే మాటలుకాదు. ఒకవేళ అప్పుగా పుట్టినా అది తీరేమాట కల్ల. కాని ఇందిర తన తండ్రికి సమస్య కలిగించినందు కేమాత్రమూ పశ్చాత్తాపపడలేదు. అంత ఖర్చుచేసి పెళ్ళి చేసే ఆలోచన తలపెట్ట టమే తప్పు; అవాస్తవికం. హైకోర్టు బిల్డింగు కొనాలని ఆలోచించటం లాటిది వెర్రి ఆలోచన. తన పెళ్ళి గురించి ఆలోచించవద్దని ఇందిర తండ్రికి ఏనాడో చెప్పింది. గోపాలాన్ని చేసుకో నన్న నాటి నుంచీ తన పెళ్ళి బరువు తల్లి దండ్రులపైన లేకుండా చూసే భారం నిజానికి ఇందిరపైనే ఉన్నది. ఎందుకంటే, అంతకన్న మంచి సంబంధం తీసుకురావటం తనవల్ల కాదని తండ్రి అనేశాడు. అంతకన్న చచ్చు సంబంధాలు తెచ్చి తాను దివాలా తీసే ఆలోచనలు ఆయన ఇప్పు డెందుకు చెయ్యాలి ?

తల్లి దండ్రులు మధనపడుతుంటే ఇందిర చూస్తూ ఊరుకున్నది.

ఇది జరిగిన ఒక వారానికి కాబోలు పెళ్ళిచూపులకు వస్తున్నా రన్నారు: తల్లీ తండ్రీ హడావుడి పడ్డారు. మగ పిల్లలు నిజంగా పెళ్ళే జరుగుతున్నట్టుగా ఉత్సాహంతో కేకలు పెట్టి ఇల్లంతా నృత్యాలు చేశారు.

మిట్టమధ్యాన్నంవేళ ఒక తల్లీ, ఒక కొడుకూ వచ్చారు. తల్లికి యాభై ఏ ళ్ళుంటాయి. తలంతా నెరిసింది, నడకా, మాటవైఖరీ చూస్తే పెద్ద వ్యవహర్త లాగా ఉన్నది. కొడుకు కొంచెం కురచ రకం. మనిషి రోతగా ఉన్నా డనటా నికి లేదు గాని, నుదురు అంగుళం కన్న వెడల్పు లేదు. గడ్డం కూడా చిన్నది, అదికూడా లోపలికి తోసుకుపోయింది. ఏదో యోగశక్తిచేత తన ముఖాన్ని అలా ముడిచిపెట్టుకున్న వాడిలాగా కని పించాడు. అతని వయస్సు పదిహేడు పైనా, ముప్పైకి లోపూ ఉండవచ్చు మంగోలియను మొహంలాగా గడ్డాలూ, మీసాలు బహుకొద్దిగా ఉన్నట్టు కనిపిం చాడు. అటువంటి మొహం వయస్సు

చెప్పటం కష్టం. ఆ మొహం ముడతలు పడిసదాకా పిల్లవాడి మొహంలా ఉండి ఆ తరువాత ముసలిముఖ మైపోతుంది.

తల్లి వైఖరిని బట్టి ఆమె అభిప్రాయాలను అరచిన్నం అటూ ఇటూగా తూచగలదు ఇందిర. ఆమెకు తల్లిగాని, కొడుకుగాని నచ్చినట్లు లేదు.

పెళ్ళికొడుకును నాగభూషణం ఎంగేజి చేశాడు. అతని పేరు నిత్యానందంట. పాపం. ఇంట్లోకి అడుగు పెట్టినప్పటి నుంచీ ఇందిరనే చూస్తున్నాడు.

ఆడవాళ్ళలో నూటికి తొంభై తొమ్మిది మంది తమచేత ఆకర్షించబడవాళ్ళను, ఇష్టంతో కాకపోయినా, సానుభూతితో చూస్తారు. ఇందిర నూరో ఆడది.

పెళ్ళికొడుకు తల్లి ఒక్క నిమిషం పాటు ఇందిరను కళ్ళు పదునెక్కించి, షాపులో వస్తువును పరీక్షించినట్లు పరీక్షించింది. ఆ తరవాత ఆవిడ ఇందిర కేసి చూసిన పాపాన పోలేదు. కాని ఆవిడ తన కొడుకును అడపా దడపా చూసుకొంటూనే ఉన్నది.

వాళ్లు పావుగంటో, ఇరవై నిమిషాలో కూర్చుని లేచారు.

"మీ అభిప్రాయం రాయండి; తరవాత అన్ని సంగతులూ మాట్లాడు కుందాం," అన్నది పెళ్ళికొడుకు తల్లి.

వాళ్ళను నాగభూషణం లోకల్ స్టేషను దాకా దిగబెట్టి వచ్చాడు. ఆయన తిరిగివచ్చే మధ్యలో ఇందిర తల్లితో,

"ఇదంతా ఏమిటమ్మా? నేనేదో ఉద్యోగము చేసుకుంటాను. నా కెందు కిప్పుడీ పెళ్ళి?" అన్నది.

"పెళ్ళి మానేసి ఉద్యోగాలు చేసుకుంటారుటే? ఉద్యోగాలు చేసేవాళ్లంతా పెళ్ళీ పెటాకులూ లేకుండా ఉండిపోతున్నారా?" అన్నది సుభద్ర.

"ఇదేనా పదివేల పెళ్లిసంబంధం?" అని ఇందిర అడిగింది.

"కాదు; అది అప్పుడే మానుకున్నాంగా? వాళ్ళు కట్నా లడగటంలేదు. మనం ఇష్టమై పెడితే ఏమిచ్చినా తీసుకుంటారాట, పెళ్ళికూడా ఆర్భాటంగా చెయ్యక్కర్లేదనీ, పెద్ద బలగంతో రామనీ అన్నారు. ఆ అబ్బాయెట్లా వున్నాడు?"

"ఏడిచి మొత్తుకున్నట్టున్నాడు."

సుభద్ర కళ్ళు పెద్దవి చేసి, ఈ సంబంధంకూడా పడగొట్టేస్తా వేమిటి?" అన్నది. ఆమె గొంతులో భయమూ, బాధా కనిపించాయి.

ఇందిర చిన్నషాక్ తిన్నది. "ఇంత కన్న మంచి సంబంధం మనం తీసుకురాలేం" అన్న శీర్షికకింద ఇది రెండో సంబంధ మన్నమాట. మొదటిదాని కిది తీసికట్టే. ఇంకో రెండు మూడేళ్ళు పోయాక ఈ శీర్షికలో మూడోసంబంధం వస్తే అది ఇంకెట్లా ఉండబోతుందో!

ఇంక తాను తాత్సారం చేసి లాభం లేదు. ఈ సమస్యను తానే పరిష్కరించు

కోవాలి తనకీ ప్రపంచంలో సహాయ పడేవా రెవరూ లేరు.

నాగభూషణం ఇంటికి తిరిగి వచ్చి తనభార్యతో రహస్యంగా ఏదో మాట్లాడి, కూతురు దగ్గిరికి వచ్చి. "ఆకుఱ్ఱాడు నీకు నచ్చలేదన్నావుటే?" అని అడిగాడు.

"అమ్మ అడిగితే చెప్పాను. అయినా నాకు నచ్చటం దేముంది? మీ వీలు చూసుకుని మీ ఇష్టం వచ్చినట్లు చేసు కోండి." అన్నది ఇందిర.

"ఈ మాట రెండున్నర ఏళ్ళ క్రితమే అంటే ఎంత బాగుండేది?" అన్నాడు నాగభూషణం.

## 7

"మహారాజశ్రీ రఘురామయ్యగారికి.

పరిస్థితుల ప్రోద్బలంకొద్దీ నే నీ ఉత్తరం వ్రాయవలసి వచ్చినది నన్ను క్షమించవలెను మా తమ్ముళ్ళ ఒడుగు తిరుపతిలో జరిగినప్పుడు మీరుకూడా వచ్చినారు. అప్పుడు నా మెడలో మీరు మాల వేసితిరి. ఆ రోజు మొదలుకొని నేను మీ మెడలో యెప్పుడు మాల వేయుదునా యని చూస్తూ యుంటిని. కాని మీరు నాకు అటువంటి అవకాశము కలిగించలేదు. త్వరలో కలిగించ వల సినదని మిమ్ము ప్రార్థిస్తూ యున్నాను. నాకు నా తల్లిదండ్రులు ఏదో సంబంధము చూచినారు నాకు బుద్ధి తెలిసినప్పటి నుంచియు ఈ నాటి యువకులన్న అసహ్యము. వారికి ఘనమైన ఆలోచన ఉన్నట్లు కనపడవు. వారి ఆలోచన లన్నీ నాకు పరమ అసహ్యము నేను మొదటి నుంచియు మనస్సు పరిపాకము చె దిన వారికే భార్య కావలెనని తలచియుంటిని. మిమ్ములను వివాహమాడే అవకాశ మివ్వమని నేను ఇందుమూలముగా వేడుకుంటున్నాను. వ్యవధిలేదు గనుక త్వరలో నా కోరిక తీర్చవలెను

ఇట్లు,

ఇందిర."

ఈ ఉత్తరాన్ని ఇందిర ఒక రాత్రంతా రిహార్సుచేసి తయారుచేసి, రహస్యంగా రాసి, కవరులోపెట్టి, కవరుపైన "శ్రీ సి. హెచ్ రఘురామయ్యగారు, హిమాయత్ నగర్, హైదరాబాదు." అని ఎడ్రసురాసి, మిగిలిన భాగమంతా దేవుడిపైన వేసి పోష్టు చేసింది ఆ ఉత్తరం రాస్తుంటే ఇందిరకు ముచ్చెమ టలు పోశాయి చెయ్యి వణికి, దస్తూరీ గుర్తించటం అసంభవంగా తయా రయింది. కాని ఆమె ఉద్రేకానికి కారణం తాను తప్పుచేస్తున్నానన్నభావం కాదు, తల్లిదండ్రులకూ లోకానికీ తెలిసి పోతుం దన్న భయమూకాదు — తాను వేటాడుతున్న జంతువు యొక్క ప్రమాణం తిమింగలాన్ని వేటాడే వాడికి అదను చూసి హార్పూను వేసే టప్పుడు చెమటలు పట్టి, ఎయ్యి . క కుంతా ఉంటుందా — వాడు చిన్న



చేపలనుకూడా వేటాడనివాడూ, తిమింగలమే మరీ పెద్దదీ అయినప్పుడు ?

నిత్యానందం వాళ్ళ దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. వాళ్ళకు పిల్ల నచ్చింది. పిల్లవాడు మీకు నచ్చిన పక్షంలో వచ్చి తాంబూలాలు పుచ్చుకుని ముహూర్తం ఏర్పాటు చేసుకోవచ్చు.

"మనకుమరి పిల్లవాడు నచ్చినట్టేనా" అన్నాడు నాగభూషణం, తన భార్య ఉద్దేశం తెలిసికూడా.

"ఏమండీ ! మీరు మళ్ళీ అడ్డుపుల్లలు వెయ్యక, పెళ్ళి ముహూర్తం పెట్టుకు రండీ ! ఈ సంబంధం చెయ్యిజారి పోతే ఇంక మనని లోకం క్షమించదు." అన్నది సుభద్ర.

"పిల్ల టెక్నికల్‌గా సమ్మతి చెబితే తప్ప సంబంధం ఖాయమైనట్టు నా సంస్కారం ఒప్పదుగా ?" అన్నాడు నాగభూషణం ఇందిర వీపుకేసి చూస్తూ.

"నా దేమీ లేదనీ, మీ యిష్టం వచ్చినట్టు చెయ్యమనీ ఆనాడే చెప్పాగా ?" అన్నది ఇందిర వెనక్కి తిరిగి చూడకుండానే.

"చెప్పా వనుకో. నేను కొంచెం చాదస్తుణ్ణి; అడుగడుగునా నీ సంతకం అడుగుతూనే ఉంటాను." అన్నాడు నాగభూషణం

ఇందిర ఏమీ అనలేదు. అనటానికేమీ లేదు. తాను ప్రయోగించిన హార్పూను తిమింగిలానికి తగిలిన జాడలేమీ ఇంకా లేవు. ఇప్పుడామెలో ఏ సంతోషమూ లేదు. ఒక్క సంకోచం—ఆ ప్రశ్న వాలా ? దానితోబాటు మళ్ళీ ధైర్యం—ఆ ప్రశ్నతో ఆయనకు

ఉత్తరం అందకపోతే ఇంక ఆయన కీర్తిప్రతిష్ఠ లన్నీ దేనికీ? ఇంకో చిన్న సందేహం – ఆ ఉత్తరాన్ని మరెవరన్నా చూస్తే. దానితోబాటు నమ్మకం – 'కాన్ఫిడెన్షల్' అని రాసిన ఉత్తరాన్ని సాహసించి ఎవరు చూస్తారు?

"సరే ఇవాళే బయలుదేరిపోనా ఏం?" అన్నాడు నాగభూషణం భార్యతో.

"ఇవాళ నవమి మిగులుంది. రేపు వెళ్ళండి. వస్తున్నట్టు ఇవాళ కావలిస్తే ఒక కార్డుముక్క రాసిపడెయ్యండి." అన్నది సుభద్ర

తలుచుకుంటే ఇందిరకు ఆశ్చర్యమైంది – తనకు ఊహ తెలిసినప్పటి నుంచీ ప్రతి చిన్న విషయం గురించీ కొట్లకుక్కలల్లే పోట్లాడుకునే తన తల్లిదండ్రులు తన కిష్టంలేని సంబంధం విషయంలో ఏకాభిప్రాయాని కొచ్చేసి. అభిప్రాయభేదమన్నది ఏనాడూ లేనంత అన్యోన్యంగా మసులుకుంటున్నారు.

ఆ సాయంకాలమే గోపాలం తన భార్య రుక్మిణితోసహా వచ్చాడు.

"ఆ రోజు మనం సినిమాధియేటర్లో కలుసుకున్నాక మూడుసార్లు ప్రయత్నించాము రావాలని. ప్రతిసారీ ఏదో ఒక అడ్డు తగులుతూనే వచ్చింది." అన్నాడు. గోపాలం.

"ఇందిరకు సంబంధం సెటిలయింది, గోపాలం." అన్నాడు నాగభూషణం.

"ఎవరా లకీమాన్?" అని అడిగాడు గోపాలం సంతోషంగా – కనీసం సంతోషం అభినయిస్తూ.

"ఇది ఇందరకు వచ్చిన బెస్టు సంబంధము అనను. కాని ప్రాప్తంకూడా ఉంటా, లేగా?" అన్నాడు నాగభూషణం.

తండ్రినుంచి ఇటువంటి సూటీ పోటీ మాటలు దాదాపు ప్రతిరోజూ వింటూనే ఉన్నది ఇందిర. అయితే వాటిని పట్టించుకోదలచలేదు. చాపకింద నీరులాగ తాను చేసుకోవలిసిందేదో చేసుకుపోతున్నదిగద! ఇంకా కొంచెం ఓపిక పట్టితే తనకు విమోచనం కలుగుతుంది. ఈ లోపల తను తొందరపడటం దేనికీ?

"అలా అనకండి. ఇందిర సంగతి నాకు బాగా తెలుసు. తనకు నచ్చనివాణ్ణి చేసుకోదు సంబంధానికి ఒప్పుకున్నదంటే వచ్చిన సంబంధా లన్నిటిలోకీ బెస్టన్నమాటే." అన్నాడు గోపాలం.

నాగభూషణం నవ్వి. "అట్లా తన యిష్టం చలామణీ చేసుకునే దక్షత కోటి మందిలో ఒక్కడికైనా ఉంటుందా అని మనను గురించి మనం ఎంత ఘనంగా అన్నా అనుకోవచ్చుగాక; అందరమూ పరిస్థితులకు బానిసలమే – క్రీచర్స్ ఆఫ్ సర్కమ్‌స్టెన్సెస్!" అన్నాడు.

"అమ్మో, అలా అనకండి. ఈకాలపు ఆడపిల్లలు టెరిబిల్ క్రీచర్స్! మా రుక్మిణిని చూడండి, నోట్లో వేలుపెడితే




కొరకలేనిదానిలా ఎలా ఉంటుందో. వాళ్ళ బంధువు లందరితోనూ హోరా హోరీ పోట్లాడి నన్ను పెళ్లి చేసుకున్నది వాళ్ళనాన్న బాగా డబ్బున్నవాడు. ధన మదం చాలా వుందిలెండి. అవసరమైతే పాతికవేలు కట్నం పోసిఅయినాసరే బ్రహ్మాండమైన అల్లుణ్ణి తెస్తా నన్నాడు. కూతురిమీద ఆపేక్షకాదు — తన పరువు ప్రఖ్యాతులు నిలబెట్టుకునేందుకు. నన్ను గురించి ఎవరో చెప్పేసరికి, 'ఛీ ! ఛీ!' అనేశాట్ట. అన కేంచేస్తాడూ? మా బంధు వర్గంలో ఒక్కమంత్రి లేడు. సెక్రటరీ లేడు, కంట్రాక్టరు లేడు, ఆఖరు కో పిల్లజమీందారైనా లేడు! తండ్రి ఛీఛీ అనటమే తరవాయి, ఈవిడగారికి నన్నే చేసుకోవాలన్న పట్టుదల జాస్తి. అయి పోయింది. ఎంత చెడ్డా ఆ తండ్రి కూతురుగదా !...."

"ఏమండీ, కాస్త మీ గొప్పలు కట్టిపెడతారా?" అన్నది రుక్మిణి.

"నన్నుగురించి గొప్పలు చెప్పుకోవటము లేదోయ్, నిన్ను గురించే చెబుతున్నాను."

"మీ కోతలు అందరికీ తెలుస్తూనే ఉన్నాయి."

అంతా వింటున్న ఇందిరకు రుక్మిణిని గురించి ఏమనుకోవాలో తెలియలేదు. ఆమె తాను తోసిపుచ్చినవాణ్ణి పెళ్ళాడింది: మంచి ధనికుణ్ణి చేసుకునే అవకాశం ఉండీన్నీ మామూలువాణ్ణి చేసుకున్నది. ఈ రెండు కారణాలవల్లా ఇందిర ఆమెను చాలా తేలిక దృష్టితో చూడవచ్చు. కాని ఆ పని చెయ్యటం ఆమెకు సాధ్యం కాలేదు. రుక్మిణిని చూసి ఇందిర అసూయపడవలసి వచ్చింది. రుక్మిణి తనవాళ్ళతో బహిరంగంగా

పొట్లాడి తనకు కావలసినవాణ్ణి చేసుకున్నది. తను ? "నాకు ఆ రఘురామయ్యగారిని చేసుకోవాలని ఉన్నది," అని కనీసం తన తల్లితో మాటవరసగా నన్నా అనలేకపోయిందే ! అది తన దౌర్బల్యం కాదా ? తనకు తన తల్లిదండ్రులను ఎదిరించి పోరాడే ధైర్యం ఉన్నదా ? ఉండే ఉండాలి. ఎందుకంటే తాను వాళ్ళకు ఎదురుతిరిగిన సందర్భాలు బోలెడున్నాయి అయితే ఈ విషయంలో తాను పిరికిపందలాగా ఎందుకు ప్రవర్తించిందీ ?

ఈ ప్రశ్నకు సమాధానం ఇందిరకు తెలియలేదు. కాని మనం సులువుగా తెలుసుకోవచ్చు. ఇందిర భయపడింది తల్లిదండ్రులకు కాదు; లోకానికి. ఎవతె గాని డబ్బుకోసం ముసలివాణ్ణి చేసుకోవటానికి సిద్ధపడితే, ఆ మనిషిని లోకమంతా నీచంగా చూస్తుంది. ఆ సంగతి ఇందిరకు అంతరాత్మలో తెలుసును. అదే ఆమె పిరికితనానికి అసలుకారణం.

మర్నాడు ఉదయం నాగభూషణం ఆఫీసుకు బయలుదేరి గేటుదగ్గిరికి వచ్చేసరికి పోస్టువాడు కవరొకటి ఇచ్చాడు. ఆ రాత్రి బండికే ఆయన తాంబూలాలు పుచ్చుకోవటానికి ప్రయాణమై పోతున్నాడు. కాబోయే వియ్యాలవారినుంచి వచ్చిందేమో నని కవరు పరీక్షిస్తే దాని పైన "సి. హెచ్ రఘురామయ్య, హైదరాబాదు" అని ఒకమూల అచ్చుకొట్టివున్నది. రఘురామయ్యంటే నాగభూషణాని కేమాత్రమూ సదభిప్రాయం లేదు. ఆయన ఏనాడూ తనకు ఉత్తరం రాసిన పాపాన పోలేదు. సింహానికి చిట్టెలుకతో పని పడ్డట్టుగా తనతో ఇన్నాళ్ళకి ఆయన కేదో పని పడింది !

వచ్చిన కవరు వచ్చినట్టుగానే జేబులో పెట్టుకుని నాగభూషణం ముందుకు సాగాడు ఆయన జేబులో పెట్టుకుందొకటుంబన్నది మధ్యాహ్నందాకా తెలియలేదు. ఆయనపని చూసుకుంటూ ఎందుకో జేబులో చెయ్యి పెట్టేసరికి ఉత్తరం తగిలింది. దాన్ని తీసి, కవరు చించి, ఇంగ్లీషులో టైపు చేసిఉన్న ఉత్తరం చదివాడు. తల తిరిగిపోయింది. శరీరంలోని రక్తమంతా సముద్రంలో ఆటు వచ్చినట్టుగా ఏమూలకో పోయి దాక్కున్నది. కళ్ళు బైర్లుకమ్మాయి. బుర్ర మీద రెండు కిలోమీటర్ల మందాన మంచు పేరుకున్నట్టయింది.

ఆ క్షణంలో తన స్థితి తలుచుకుని నాగభూషణం. "చచ్చిపోయే ముందు అందరికీ అలాటి లక్షణాలే కలుగుతాయి తప్పకుండా !" అనుకునేవాడు.

ఒక్కముక్కలో చెప్పాలంటే, రఘురామయ్య నాగభూషణాన్ని, "నీ కూతు రేమౌతున్నదో చూసుకోవటము తండ్రిగా నీ విధి," అని రాశాడు. ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే,

ఇందిర తనను పెళ్ళాడతా నని "ఆఫర్" చేస్తూరాసిన ఉత్తరం గురించి చెప్పాడు; అయినాడుది తనయీడువాణ్ణి ప్రేమించట మన్నది అనూహ్యం గనక, ఎ దురుద్దేశంతో ఆమె తనను పెళ్ళాడతా నన్నదీ ఊహించటం తేలికే నన్నాడు; తల్లి దండ్రులు పిల్లలతలలో అలాటి దురాశలు పెడితే తప్ప వాటంతట అవి పుట్ట వన్నాడు; నాగభూషణమే తన కూతురి మనస్సు మెలితిప్పి అలా ఉత్తరం రాయించినా తనకు ఆశ్చర్యం ఉండ దన్నాడు।

ఆ చివరిమాటలు నాగభూషణానికి మర్మభేద్యంగా తగిలాయి. అవి ఒతికుంటగా మానే గాయాలు కావు.

రఘురామయ్య విషప్పురుగు. కుట్టటము దానికి సహజం. బధువర్గంలో రఘు రామయ్య డబ్బుకు హారతి పట్టనివాడు నాగభూషణం ఒక్కడే. ఆ సంగతి రఘురామయ్యకు తెలిసిఉండకపోదు. అందుచేత, తన డబ్బుకు నాగభూషణం కూతుర్ని ఎర చేశాడని ఆపాదించటంలో ఆయనకు కొంతతృప్తి కూడా ఉండవచ్చు. కాని ఇందిర? ఇందిర ఆయనకు ఉత్తరము రాయటమేమిటి? ఏమిటనుకుని రాసి ఉంటుంది? తనతో ఎందుకు చెప్పలేదు? చివాట్లు తగులుతా యనేనా? తనసంగతి ఇందిరకు తెలుసు. కాని ఇందిరసంగతి తనకు తెలీదు। తనకు పుట్టి తన ఎదటే పెరిగిన కూతురు మనస్సూ, అభిప్రాయాలూ ఏ విధంగా పరిణామం చెందుతున్నదీ తనకు ఊహించటానికైనా సాధ్యం కాకుండా ఉంది।

ఆ రఘురామయ్య ఉత్తరం గోప్యమైనది కాదు. దాన్నాయన ఏ దౌర్భాగ్యుడికో డిక్టేటు చేశాడు. ఆదౌర్భాగ్యుడు దాన్ని టైపు చేసి ఒకకాపీ రఘురామయ్య పర్సనల్ ఫైల్లో ఉంచి, మరొక కాపీ సర్క్యులేషన్ కోసమని తనజేబులో పెట్టుకుని, ఇప్పటికే ఎంతమంది స్నేహితులకు చదివి వినిపించి ఉంటాడో. తనకూతురు తనను రచ్చ కెక్కించింది మొత్తానికి।

జరిగింది జరగగా, ముందుసంగతి. ఏమిటి? అటువంటి కూతురుపట్ల తనకు బాధ్యత లేమిటి? దాని పెళ్ళి ప్రయత్నాలు చెయ్యటమేమిటి? ఏమీ జరగనట్టు తాను సాయంకాలం పాసెంజరుకు వెళ్ళి, పెళ్ళితాంబూలాలు పుచ్చుకురాగలడా?" "మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి," అని ఇందిర అన్నది నిజంగా తన భారాన్ని తల్లిదండ్రులకు వదిలికాదు. ఈ లోపల శ్రీమహావిష్ణువల్లే ఆ రఘురామయ్య తనను కాపాడి తీసుకుపోవాలని దని। ఈ సంబంధం దాని కిష్టంలేదు. తాను తెచ్చే ఏ సంబంధమూ దాని కిష్టం. ఉండదు. అసలు దాని పెళ్ళికోసం తను ఏమాత్రమూ శ్రమపడ నవసరం లేదు. ఇందిర ఆ అర్హత పోగొట్టుకున్నది.

పైగా థాంక్‌లెస్‌జాబ్ ! — శుష్క ప్రయాస !

ఈ సంగతి సుభద్రతో చెప్పటమా? చెప్పటం మొదలుపెడితే తన మనసులో రేగే తుపానంతా బయట పడుతుంది. దాన్ని సుభద్ర శత్రువుకన్న నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తుంది అసలు విషయం అవతలికిపోయి తమమధ్య రామరావణ యుద్ధమైపోతుంది.

నాగభూషణానికి జీవితంపైన ఊహించరానంత రోత పుట్టింది. ఆ రోతవెంట ఒకవేదాంతం పుట్టుకొచ్చింది పట్టించుకున్నవాడికే బాధలు; తోసేసుకు తిరిగేవాడికే అన్ని క్లేశాలూనూ. ఇందిర గాలికి పెరిగిఉంటే ఇంతకన్న అన్యాయంగా తయారవుతుందా! దానిపైన తనప్రభావం ఉండాలని తను పడ్డ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరేగదా! ఇందిరబుద్ధులు తనవాటికి పూర్తిగా విరుద్ధంగా తయారయాయంటే ప్రతి విషయంలోనూ తన వైఖరి దానికెంత హాస్యాస్పదంగా తోస్తూ ఉండిఉండాలి! ఏమైనా ఇకమీద దానిపట్ల తనకు తండ్రి బాధ్యత లేమీలేవు! దానిగతి ఎట్లాకావలసి వుంటే అట్లా అవుతుంది.

ఆయన ఇంటికి వస్తూనే ఇందిరను చూసి, "ఆయన ఉత్తరం రాశాడు. నేనే నీచేత రాయించా నంటున్నాడు. నాగతి అంటకు తెచ్చావు!" అన్నాడు.

ఇందిర వెలవెల పోయింది. కేక వెయ్యబోయే దానిలా నోరు తెరిచి, నోటికి చెయ్యి అడ్డం పెట్టుకున్నది.

భర్త గొంతుమాత్రమే విన్న సుభద్ర. "ఏమిటండీ అదీ?" అంటూ వచ్చింది.

"ఏమీలేదు."

"ఏవో అంటున్నారే?"

"నీవిషయం కాదు."

సుభద్ర ఆ విషయం వదిలేసి అంతకన్న ముఖ్యవిషయం ఎత్తింది.

"వంటకూడా చేసేశాను. మీ రా ప్రయాణం కండీ!" అన్న దామె

"ప్రయాణమా?" అన్నాడు నాగ భూషణం వెర్రిమొహం వేసి.

"వెళ్ళి తాంబూలాలు పుచ్చుకుని, ముహూర్తమూ అదీ అనుకనిరారూ?"

"అదా? ఇంకో గొడవలో పడి పోయి దానిమాటే మరిచాను ఆఫీసులో శలవుకూడా చెప్పలేదు. తరవాత చూస్తాం."

"తరవాత చూడట మేమిటండీ? నిక్షేపమంటి సంబంధం. ఈసారి మీరే పోగొట్టేటట్టున్నారే! ఎందుకు వెళ్ళరుటా?" అని సుభద్ర నిలవదీసి అడిగింది.

"నన్ను విసిగించకు. నా మనస్సేమీ బాగాలేదు," అన్నాడు నాగభూషణం

సుభద్రకు భయంకరమైన అనుమానం తగిలింది.

"ఉద్యోగానికి మళ్ళీ ఎసరేమన్నా వచ్చిందా? ... బతికాం? ఆఫీసులో



ఎవరితోనన్నా పోట్లాడారా ? బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడ రేమిటీ ?"

మాట్లాట్టాని కేమీలేదు నువు వెళ్ళి నీ పని చూసుకో !"

మొగు డా మాట అనటంతో ఆయన దగ్గిర ఏదో పెద్ద విషయమే దాస్తున్నట్టు సుభద్ర అర్థం చేసుకుని, పనిమానుకుని ప్రశ్నలు సాగించింది నాగభూషణం రాయల్లే అయిపోయి, కాలుగాలిన పిల్లి లాగా అటూ ఇటూ తిరిగాడు. సుభద్ర వెంట వెంట తిరిగింది. ఆ బాధ పడలేక నాగభూషణం ఏకంగా బయటికే వెళ్ళిపోయాడు.

మొగుడు ఉప్పించుకు పోయినా సుభద్ర తన దృష్టిని ఇందిర మీద ఫోకస్ చేసి, ఇందిరకూడా తండ్రిలాగే ఏదో అంతస్సంఘర్షణలోపడి కొట్టు కుంటున్నట్టు గ్రహించి, ఆమె చుట్టూ తవ్వసాగింది

"నాన్న ఎందుకే అట్లా ఉన్నారూ ?"

'ఏమో నా కేం తెలుసూ ?"

"పోనీ నువ్వెందు కిట్లా ఉన్నావూ ?"

"నా కేమొచ్చిందీ ?'

"నన్నే మోసం చేస్తావుటే ? నే నంతా చూట్టంలే దనుకున్నావా ? ఆయన వస్తూనే నీతో ఏమిటో అన్నారే ."

"ఏమీ అనలేదు "

'నే వింటేనే ."

"ఏదో అన్నాడు గామాలు. నేను మరచిపోయాను "

ఇందిర పైకి చెప్పే సమాధానాలకూ, ఆమె బాహ్యా వైఖరికీ ఏమీ సంబంధం లేదు. తల్లి ఒక్కొక్క ప్రశ్నే వేస్తుంటే ఇందిరకు ఊపిరి తీసుకోవటం కష్ట మవుతున్నది.

తన పిల్లలూ, కొంతవరకూ తన మొగుడూ రహస్యంగా ఉంచటానికి ప్రయత్నించే విషయాలను బయట పెట్టించటంలో సుభద్రకు పోలీసువాళ్ళు ఎందునా చాలరు. ఆమెబాధ పడలేక ఇందిర తాను ఏ విధంగా తిమంగిలాన్ని వేటాడిందీ, ఏవిధంగా తనను తోకితో కొట్టిందీ, తల్లికి చెప్పేసింది

ఇందిర నాగభూషణానికెంత ఆశ్చర్యం కలిగించిందో సుభద్రకు అంత ఆశ్చర్యమూ కలిగించింది. అయితే సుభద్రకు ఏవగింపు మాత్రం కలగలేదు. తన కూతురు ఐశ్వర్యం మీద కన్నేసినందుకు మెచ్చుకున్నది కూడా. అంతా విని ఆవిడ ఆశ్చర్యంతో కూడిన ఆనందంతో, "ఓసి పిడుగా! కొండకి వెంట్రుక కట్టి లాగితే ఎన్నదన్నా కొంత వస్తుందిటే? నాతో మాటమాత్రం చెబితే నిన్నా ఉత్తరం రాయనిచ్చేదాన్నా నేనేవో దును. అయిందేదో అయింది. ఈ సంబంధానికి ఒప్పుకో. లేకపోతే మీ నాన్న నిన్ను గాలికి వదిలేసి ఊరుకుంటారు; ఏమనుకున్నావో! ఇతను పెద్ద తెలివిగలవాడు కాదు. కుక్కల్లేనీ చెప్పుచేతల్లో ఉంటాడు. ఇంకా గోపాలం గడుసుపిండం! అంచేత ఇతన్ని చేసేసుకో, నీ కేలోపమూ ఉండదు," అని హితవు చెప్పింది.

ఒక అరగంటలో నాగభూషణం నాలుగు రోడ్లూ వెర్రివాడిలాగా తిరిగి ఇల్లు చేరుకున్నాడు.

"ఏమండీ, చిన్నపిల్ల తెలీక ఏదో చేస్తే అంత ఇదై పోవాలా? తెలిస్తే మీకన్న పెద్దవాణ్ణి పెళ్ళాడదా మనుకుంటుందా? ఈ భాగ్యానికి మీ మనస్సంతా పాడుచేసుకోవాలా? నాలుగు మెతుకులు తిని బయలుదేరండి. రైలు వేళ అవుతున్నట్టున్నది. అది ఈ సంబంధం చేసుకుంటుందిట," అన్నది.

"బలవంతాన చేస్తే చేసుకో కేం చేస్తుందీ? నా చేతిమీదుగా దాని కిష్టం లేని సంబంధం ఎట్లా చెయ్యను? ఎందుకు చెయ్యటం?"

"మీ దో చాదస్తం. అది ఏనాడో ఈ సంబంధం రాకమునుపే ఉత్తరం రాసి ఉంటుంది. దానికీ సంబంధం ఇష్టమేనని నే చెబుతున్నానుగా. నా మాట నమ్మకం లేదూ? మగాళ్ళకీ విషయాలేం తెలుస్తాయి?"

"అదీ వెళ్ళమంటే వెళతాను వయసులో పెద్దవాణ్ణయితే నేం? మిగిలిన విషయాల్లో అదీ నా అంతదే!" అన్నాడు నాగభూషణం

అది ఆయన కూతురికి విధించిన శిక్ష.

ఇందిర కాస్సేపటికి తండ్రి ఎదటికి వచ్చి, తలవంచుకుని, "ఊరికి వెళ్ళిరా నాన్నా!" అన్నది.

నాగభూషణం లేచి, గబగబా నాలుగు చెంబులు నీళ్ళు పోసుకుని, వచ్చి అన్నం ముందు కూర్చున్నాడు.

(అయిపోయింది)



# కుంకుమ భరిణ

ప్రభాత కుమార ముఖర్జీ

## మొదటిభాగం

### 1

దసరాకు హైకోర్టు మూసినప్పుడు వకీలు విజయకుమారబోసు పడమటకు ప్రయాణం పెట్టుకున్నాడు. అతను ప్రాక్టీసు చేస్తున్నది డబ్బుకోసం కాదు. తాత తండ్రుల ఆస్తి పుష్కలంగా ఉన్నది. లోయర్ సర్క్యులర్ రోడ్డులో అతని తండ్రి పెద్ద మేడ కట్టించాడు. అందులో మంచి ఫర్నీచరూ, విద్యుద్దీపాలూ, టెలిఫోనూ, నౌకర్లూ, చాకర్లూ, కారు షెడ్డులో మూడుకార్లూ — అన్నిహంగులూ ఉన్నాయి. విజయ కుమారుడు తరుచు స్నేహితులనూ, బంధువులనూ ఆహ్వానించి పార్టీలిస్తూఉంటాడు.

విజయకుమారబాబు వయసు ఇరవైఏడేళ్ళు, పాశ్చాత్యదుస్తులు ధరిస్తాడు. చదువుకునే రోజుల్లో క్రికెట్, ఫుట్‌బాల్, హాకీ మొదలైనవాటిల్లో పరిశ్రమ ఉండటంచేత అతని శరీరం బలిష్ఠమైనది. సిగిరెట్లు జాస్తిగా కాల్చటం తప్పిస్తే

అతనికి మరేవ్యసనమూ లేదు. ఎప్పుడైనా నలుగురితో చేరినప్పుడు పెగ్గో అర పెగ్గో తాగుతాడు.

విజయకుమారబాబు భార్య అందచందాలలోనూ, స్వభావంలోనూ భర్తను పోలినదే. వారి కుటుంబాల మధ్య బాంధవ్యం ఉండేది. పెళ్ళికిముందు పరస్పరం పరిచయం ఉండే పెళ్ళాడారు. అతను కాలేజీలో ఉండగానే తన కాబోయే భార్య మీద పద్యాలు రాశాడు, ఆమెను తప్ప పెళ్ళాడనని తన స్నేహితులతో రహస్యంగా చెప్పేవాడు.

విజయుడి భార్యపేరు బకూ, లేక బకురాణీ. ఆమె తండ్రి పండితుడు కావటం చేత తన కుమార్తెకు వకుళావళిక అన్న పేరు పెట్టాడు. అందరూ వకుళబాలిక అని పిలిచేవారు. పెద్దదైతే ఏమని పిలవాలని ప్రశ్న వచ్చింది. ఆమె తల్లి ఆమె పేరును వకుళమాలగా మార్చేసింది. అందుచేతనే ఆమె అప్తులకు "బకూ", "బకురాణీ" అయింది.

వకుళమాల వయస్సిప్పుడు పంధొమ్మిదేళ్ళు. పెళ్ళిఅయి అయిదారు సంవత్సరాలయింది. మొదటి కాన్పుకు మగపిల్లవాడు పుట్టి, ఎనిమిదినెలలు పెరిగిపోయాడు. ఇప్పుడు ఏడాది వయసుగల ఆడపిల్ల ఉన్నది. దానికి పేరు పెట్టలేదు. అందరూ "చిట్టి" అని పిలుస్తారు.

వకుళమాల చాలాకాలం పడమటనే ఉన్నది. ఆమె తండ్రి పాట్నా కాలేజీలో ప్రొఫెసరుగా ఉండేవాడు. అందుచేత ఆమె మాటలలో చాలా హిందీమాటలు ఉంటాయి. పెళ్ళి అయినకొత్తలో ఆమెతో ఆకబిద్ద పావురాలసంగతి చెబుతూంటే ఆమెకు ఆ పేపక్షిలో అర్థం కాలేదు; కబూతర్ అన్న హిందీమాట చెప్పాక ఆమెకు ఆ పక్షి లేవో తెలిశాయి. ఇప్పు డామె బెంగాలీభాష అంత అన్యాయం కాదుగాని, ఇప్పటికీ అప్పుడప్పుడూ హిందీమాటలు వస్తూనే ఉంటాయి.

విజయకుమారబాబు చెల్లెలొకామె వితంతువు. ఆమె అతనిపద్దనే ఉంటున్నది. అతని అన్న చనిపోయాడు; అతని కిద్దరు పిల్లలు. అందరూ కలిసే ఉంటున్నారు.

హైకోర్టు మూసిన మర్నాడు వదినెగారు విజయుడితో, "పడమట పోతున్నావటగా?" అన్నది.

"అవును, వదినా." అన్నా డతను.

ఆ రాత్రి వకుళమాల తన భర్త ప్రయాణం వివరాలన్నీ తెలుసుకుని, "మరీ ఆలస్యం చెయ్యక నవమినాటి కి ఇంటికి తిరిగిరండి పండక్కుముందే మీ రింట్లో ఉండాలి. దశమినాడు నేను మీ పక్కన ఉండాలి." అన్నది.



"నవమినాటికి వస్తే చాలుగా ? ఇంకా ముందే వస్తాను," అన్నాడు విజయ కుమారబాబు.

మర్నాడతను బయలుదేరేటప్పుడు వకుళమాల ముఖాన సంతోషచిహ్నం ఏ మాత్రమూ లేదు. "ఎక్కడ ఉన్నాసరే నాకు మీరు రోజూ టెలిగ్రాం ఇవ్వాలి; కనీనం ఉత్తరం రాయాలి," అన్నదామె.

## 2

సూర్యాస్తమయంవేళకు మెయిలు జబల్పూరు స్టేషనులో ఆగింది. ఫస్టుక్లాసు పెట్టెలోనుంచి విజయకుమారుడూ, పక్కపెట్టెలోనుంచి బేహరా దిగారు. బేహరా సామాన్లు దింపేస్తూంటే విజయకుమారుడు తంతి ఆఫీసు కేసివెళ్ళి, తాను క్షేమంగా జబల్పూరు చేరినట్టు భార్యకు తంతిఇచ్చి వచ్చాడు. తరవాత అతను కిరాయి బండిలో సామానుతోసహా ఎక్కి, దగ్గరలోనే ఉన్న డాక్‌బంగళాకు వెళ్ళాడు.

విజయకుమారుడు బంగళాలోకి వస్తూ, వరండాలో పేముపడకకుర్చీలో పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటున్న ఒక యువతిని చూశాడు. ఆమె లోపలికి వచ్చే బండికేసి చూస్తూ, అది వరండాపక్కన ఆగగానే లేచి లోపలికి వెళ్ళిపోయింది.

ఖాన్‌సామా వచ్చి విజయకుమారుడికి సలాం చేసి, గది తెరిచి, టీ పట్టుకురాబోయాడు. బేహరాసామాన్లు తెచ్చి, గదిలో పెట్టి, పరుపుచుట్టవిప్పి మంచంమీద పరిచాడు.

ఖాన్‌సామా టీ తెచ్చినప్పుడు విజయకుమారుడతన్ని హిందీలో, "బంగళాలో ఇంకెవరైనా ఉంటున్నారా ?" అని అడిగాడు.

"అవును, హుజూర్. పాల్‌సాబ్, ఆయనభార్యా ఉంటున్నారు." అన్నాడు ఖాన్‌సామా.

"పాల్ సాబా ? విదేశీయుడా ?"

"కాదు, హుజూర్. ఈ దేశస్థుడే. ఆయన వచ్చి అయిదురోజు లయింది."

"ఆయన ఏం చేస్తారు ?"

"ఉదయం ఛోటాహజ్రీ తీసుకుని, బాగ్‌తోసహా బయలుదేరి పదకొండింటికి తిరిగొస్తారు. మళ్ళీ మూడింటికి పోయి ఏడెనిమిదిగంటలకు తిరిగొస్తారు."

"ఆయన భార్యకూడా వెళతారా ?"

"వెళ్ళరు ఇక్కడే ఉంటారు. హుజూర్ పోలీసాఫీసరా ?" అన్నాడు ఖాన్‌సామా ఈ ప్రశ్నలన్నీ చూసి.

"కాదు, హైకోర్టు వకీలును."

ప్రయాణపు బడలికమీద ఉండటంచేత విజయకుమారుడు స్నానం చేసి ఏకంగా నైట్ డ్రెస్ వేసుకుని, భోజనంకూడా గదికే తెప్పించుకుని, భోజనం చేసి, పెందలాడే పడుకున్నాడు.

మర్నాడు ఉదయం అతను ఛోటాహజ్రీ ముగించి, చుట్ట కాల్చుకుంటూండగా బేహరా వచ్చి ఒక విజిటింగు కార్డిచ్చాడు. దానిమీద "మిష్టర్ సి. కె. పాల్, కలకత్తా లైఫ్ ఎస్యూరెన్స్ కంపెనీ" అని ఉన్నది.

యజమాని చెప్పినమీదట బేహరా వెళ్ళి పాల్‌ను తీసుకొచ్చాడు. పాల్ నల్లగా, పొట్టిగా, పాశ్చాత్యుల వేషంలో ఉన్నాడు అసలే చిన్నకళ్ళు, అందులో ఒకటి మెల్ల. ముఖం గుర్రం ముఖంలాగా పొడుగుగా ఉంది. లావాటి పెదవులు.

విజయకుమారు డతనికి షేక్‌హాం డిచ్చి కూర్చోమని, "అవతలవైపు గదిలో ఉంటున్నది మీరేనా ?" అని అడిగాడు.

విజయుడు బెంగాలీలో మాట్లాడుతూంటే పాల్ ఇంగ్లీషులో సమాధానం చెబుతూ తనకు బెంగాలీభాష కొంచెం కొంచెం తెలుస్తుందిగాని మాట్లాడటానికి రాదని చెప్పాడు.

"మీరు బెంగాలీ కారా ?"

"కాను మహాశయా. మదరాసీని, నా భార్య బెంగాలీ."

"క్షమించండి. నేను బెంగాలీవా రనుకున్నాను. మీరు క్రైస్తవులా ?" అని విజయుడు ఇంగ్లీషులో అడిగాడు

పాల్ అవునని చెప్పి, తాము ఆరుమాసాలక్రితం కలకత్తాలో బయలుదేరి,




దారిలో చాలాచోట్ల మజిలీలు చేస్తూ ఆరురోజుల క్రితం ఇక్కడికి వచ్చామనీ, తన వృత్తి బాగా సాగటంలేదనీ. హిందూదేశస్థులు తమ జీవితాలను భీమా చేసుకోవటానికి ఒకంతట ఒప్పుకోరనీ తాము అరవైఏళ్ళు బతుకుతామంటారనీ అన్నాడు. చివర కతను, "మీరు భీమా చేశారా?" అని అడిగాడు.

"ఏనాడో చేశాను, మిష్టర్ పాల్," అన్నాడు విజయకుమారుడు.

రైలు స్టేషనుకు వెళ్ళవలసిన పని ఉన్నదని విజయకుమారుడు లేవడంతో మళ్ళీ దర్శనం చేసుకుంటా నని చెప్పి పాల్ వెళ్ళిపోయాడు.

రైల్లో కారూ, డ్రైవరూ దిగారు. విజయుడా కారులో జబల్పూరు వీధులు నాలుగూ చుట్టబెట్టి, పదిగంటలకు బంగళాకు తిరిగి వచ్చాడు. కారు చప్పుడు విని పాల్ భార్య వరండాలోకి వచ్చింది. ఆమె అప్పుడే స్నానం చేసి, బంగారు రంగుచీరె కట్టుకునిఉన్నది. ఆమె వెంట్రుకలు పిరుదులదాకా వేళ్ళాడుతున్నాయి. కాళ్ళకు మఖ్మల్ జూతా ఉన్నాయి. ఈసారి విజయుడి కామె ముఖం బాగా కనబడింది. ఆమెది మంచి శరీరచ్ఛాయ, కళ్లు విశాలమైనవి, తీర్చిన ట్టున్న ముఖం. విజయుడి చూపులు తన చూపులతో కలవగానే ఆమె గదిలోకి వెళ్ళిపోయింది.

విజయుడు గడ్డం చేసుకుని, స్నానం చేసి, పదకొండింటికి భోజనం చెయ్యటానికి డైనింగు రూముకే వెళ్ళాడు. అక్కడ పాల్ ఒక కుర్చీలో కూర్చుని సిగరెట్టు కాలుస్తున్నాడు. అతని భార్య కిటికీవద్ద నిలబడి, బయటి తోటలోకి చూస్తూ, విజ

యుడి పాదధ్వని విని వెనక్కు తిరిగిచూసింది. పాల్ ఆమెను విజయుడికి పరిచయం చేస్తూ, "బోస్ మహాశయా, ఈమె నా భార్య. సుశీ, వీరు బోస్‌మహాశయులు. పేరుమోసిన హైకోర్టు వకీలు. వీరి పేరు నువు తప్పక వినిఉంటావు," అన్నాడు.

భోజనాలదగ్గిర సంభాషణ ఇంగ్లీషులోనే సాగింది. సుశీకి ఇంగ్లీషు అంత బాగారాదు. హిందీకూడా అంత బాగారాదు. భర్త ఆమెతో మధ్య మధ్య సగం బెంగాలీలోనూ, సగం హిందీలోనూ మాట్లాడాడు.

భాద్రపద మాసం. ఉక్క జాస్తిగా ఉంది. సుశీ తువాలుతో విసురుకుంటూ, చప్పున బెంగాలీలో, "అబ్బ, ఎంత ఉక్క! ఇప్పుడు కలకత్తాలో కూడా ఇంత ఉక్కగానూ ఉందా?" అని విజయుడికేసి చూసి అడిగింది.

భర్తకు రాని భాషలో భార్యతో సంభాషించటం భావ్యం కాదని, విజయుడామెతో ఇంగ్లీషులోనే, "నేను కలకత్తా వదిలి రెండువారాలు కావస్తున్నది. మిసెస్ పాల్, ఇక్కడంతవేడి అక్కడ ఉండదేమో!" అన్నాడు.

అతను తలఎత్తి చూసి, "పైన పంఖా ఉందే! లాగేవాడు లేడా?" అని అడిగాడు.

"రోజు కొక అర్ధరూపాయి స్తే ఖాన్‌సామా లాగేటందుకు మనిషిని పెడతాడు." అన్నది సుశీ బెంగాలీలోనే.

"సరే, మనిషిని ఏర్పాటు చేయిస్తాను," అన్నాడు విజయుడు ఇంగ్లీషులో,

విజయుడు ఖాన్‌సామాతో పంఖాలాగేవాణ్ణి పెట్టమనిచెప్పి, కాస్సేపు వరండాలో కుర్చీలు వేయించుకుని, పాల్‌దంపతులతో కబుర్లాడి, పన్నెండుగంటలకు లేచి గదిలోకి వెళ్ళి, తన భార్యకు ఉత్తరం రాసుకున్నాడు. అందులో తాను జబల్పూరు వచ్చినాక జరిగిన విషయాలు రాశాడు. పాల్‌దంపతులను గురించి తెలిపాడు, తన భార్యకోసం బంగారపు బ్రూచ్ కొంటున్నా నన్నాడు.

అతనా ఉత్తరాన్ని పోస్టుకు పంపి, కాస్సేపు నిద్రపోయిలేచి, డ్రస్ చేసుకుని బయటివరండాలోకి వచ్చేసరికి, అక్కడ పాల్‌దంపతులు టీ తాగుతున్నారు. వారి పక్కనే అతనికోసం ఒక కుర్చీ ఖాళీగా ఉన్నది.

పాల్‌భార్య సుశీ విజయుడికి టీ కలుపుతూ చక్కెర ఎంత వెయ్యమన్నారని అడిగింది. రెండు చంచాలు వెయ్యమని విజయుడంటూఉండగా, పాల్, "వద్దు వద్దు, నువు తియ్యటిదానివి—

When lovely Susi sits by me,
I want no sugar in my tea-
Tra - la - la ia - ia - la,"

అని పాడుతూ అతను నృత్యం చెయ్యబోయాడు.

సుశీ అసహ్యంతోనూ, సిగ్గుతోనూ ముఖం తిప్పేసుకుంటూ "పాటట!" అన్నది

"ఎస్, డియర్! ఇది కామిక్‌సాంగ్! భాలూసాంగ్!" అన్నాడు పాల్.

"భాలూపాటా, భాలూనృత్యమూ." అన్నది సుశీ.

తన భార్య తనతో అన్నది కేవలం హాస్యం కాదనిపించి, "ఏమన్నావు, సుశీ?" అని అడిగాడు.

"మీ నృత్యం చూసి మిమ్మల్ని ఎలుగొడ్డంటున్నారు." అన్నాడు విజయుడు.

పాల్ తన భార్య భుజాలు తాకి తన రొమ్మును తాక్కుంటూ, "Beauty and the Beast" అని గట్టిగా నవ్వాడు.

అతను జేబుగడియారం తీసి చూసి నాలుగయిందని తెలుసుకుని, తాను మళ్ళీ ఎనిమిదింటికి వస్తానని చెప్పి విజయుడివద్దా, తనభార్యవద్దా సెలవు పుచ్చుకుని, గది లోకి వెళ్ళి హాటూ, బూటూ తీసుకుని, తనకోసం వేపచెట్టుకింద వేచిఉన్న కిరాయి బండిలో ఎక్కి వెళ్ళిపోయాడు.

విజయుడు వద్దంటున్నా వినకుండా సుశీ అతనికి మరొకకప్పు టీ కలిపింది. అతను టీ తాగుతుండగా సుందర్‌సింగు కారు తెచ్చాడు.

సుశీ ఆ కారుగురించి అడిగితే, అది కలకత్తానుంచి వచ్చిందనీ, రాజస్థానానికి అందులోనే వెళతాననీ విజయుడు చెప్పి లేచాడు.

"మళ్ళీ ఎప్పుడు వస్తారు?" అన్నది సుశీ.

"చీకటిపడి వస్తాను. మీ రెప్పైనా షికారు వెళతారా?" అని విజయు డడిగాడు.

"ఎక్కడికి వెళతాను? ఇక్కడే ఉంటాను." అంటూ సుశీ నిట్టూర్చింది.

"ఒంటరిగా ఎలా పొద్దుపోతుంది?"

"ఏంచెయ్యాలి? ఆరునెల్లనుంచీ ఇలాగే జరుగుతున్నది."

"ఆరునెల్లుగా ఇలా బంగళాలవెంబడి తిరుగుతున్నారా?"

"మా వివాహమై ఆరుమాసా లయింది. అప్పటినుంచీ ఇదేవరస. ఒక్కొక్కసారి గుబులుపుడుతుంది. ఏడుపొస్తుంది. ఎక్కడికీ వెళ్ళటానికి లేదు; ఏమీ చూట్టానికి లేదు. జబల్పూరు వచ్చి ఆరురోజు లయింది. చూడదగినవి పీన్నో ఉన్నాయి.

ఒక్కటీ చూశ్చేదు. మనిషితో మాట్లాడ్డానికూడా లేదు. ఇవాళ మీతో రెండు ముక్కలు బెంగాలీలో మాట్లాడితే ప్రాణం లేచివచ్చింది "

ఆమె బెంగాలీ పుస్తకాలు చదువుతానంటే విజయుడు తన గదిలోనుంచి కొన్ని బెంగాలీ పత్రికలు తెచ్చి, ఆమెముందు బల్లమీద పెట్టాడు. తరువాత అతను కార్లో ఎక్కి బయల్దేరివెళ్ళాడు

కార్లో తిరుగుతున్నంతసేపూ అతను సుశీని గురించి బాధపడ్డాడు. ఆమె చాలా కష్టంలోనే ఉంది. ఇంత విశాల ప్రపంచంలో ఆమెకు ఈ పాల్ ఎక్కడ దొరికాడు? చదువుకున్న బెంగాలీ క్రైస్తవుణ్ణి చూసి పెళ్ళాడి ఉండవలసింది. నిజంగా Beauty and the Beast లాగే ఉన్నారు వాళ్ళిద్దరూ. కాకిముక్కుకు దొండపండు.

అతను తిరిగి ఎనిమిదింటికి తన గదికి తిరిగివచ్చి బల్లమీద వున్న ఉత్తరాలకేసి చూడగానే, తన భార్యకోసం బ్రూచ్ కొనలేదన్నది జ్ఞాపకం వచ్చింది.

## 3

ఆరాత్రి విజయుడు తన గదికే భోజనం తెప్పించుకున్నాడు. ఆ దంపతులు భోజనం చేశారా అని అడిగితే ఖాన్‌సామా, 'మేమ్‌సాబ్' భోజనం చేశారనీ, 'ఆయన' నిద్రపోతూండటంచేత భోజనం గదిలో పెట్టాననీ అన్నాడు, సాభిప్రాయంగా నవ్వి.

తరవాత బేహరా వచ్చి తన యజమానితో రహస్యంగా, పాల్ తాగివచ్చాడనీ, ఆయన బండిలోనుంచి దిగుతూ తూలి పడపోతే బండివాడూ తనూ పట్టుకుని గదిలోకి తీసుకుపోయామనీ, ఆయన్ని మంచంమీద పడుకోబెటుతూంటే మేమ్ సాబ్ వద్దని బల్లమీద పడుకోబెట్టించిందనీ, చెప్పాడు.

"మేమ్‌సాబ్ ఏమన్నది ?" అని విజయు డడిగాడు.

"ఏమీ అనలేదు. భోజనానికి కూర్చుని ఏడ్చింది మనం రాకముందుకూడా రెండురోజు లాయన పూటుగా తాగి వచ్చాట్ట. ఒకరోజు మేమ్‌సాబ్‌ను కొట్టి కింద పడేసినంతపని చేశాట్ట !"

ఈ సంగతి వింటూంటే విజయుడికి మండుకొచ్చింది. 'బీస్ట్, బీస్ట్,' అని పాల్‌ను తిట్టుకున్నాడు.

అతను సుశీని గురించే ఆలోచిస్తున్నాడు ఆమె చాలా చిన్నది. పద్దెనిమిది పంథొమ్మిదేళ్లు మించి ఉండదు ఎందుకు తొందరపడి ఈ జంతువును పెళ్ళాడినట్టు. పెళ్ళి కాకపోతే కులం పోవటానికి హిందువైనా కాదు. ఏ మాయచేత వీ డీమెను

వంచించిఉంటాడు ? ఇలా అనుకుంటూ అతను కాలుస్తున్న సిగరెట్టును పూర్తి చేసి వెళ్ళి తనగదిలో పడుకున్నాడు.

మర్నాడు పదకొండుగంటలకు అతను డైనింగ్ రూముకు వెళ్ళేసరికి పాల్ దంపతు లింకా రాలేదు. వాళ్లు అతని వెనకగా వచ్చారు. విజయుడు కుర్చీలో నుంచి లేచి. సుశీకి దేశపద్ధతిలో నమస్కారం చేశాడు.

భోజనా లయాక విజయుడు తన భార్యకు రోజువారీ ఉత్తరం రాశాడు. నాలు గింటికి ఖాన్‌సామా వరండలో టీ ఏర్పాటు చేశాడు. అతని టీ బల్లదగ్గరికి వెళ్లే సరికి పాల్‌దంపతులు బల్లవద్ద కూర్చునిఉన్నారు. తలనొప్పి ఎలా ఉన్నదని విజయు డడిగితే తగ్గిపోయిం దన్నది సుశీ. విజయుడికికూడా ఆమె టీ కలిపింది. వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ టీ తాగుతుండగా కారు వచ్చి వరండా మెట్లదగ్గిర నిలిచింది.

"మీ కారు చాలా బాగుంది. అందులో మమ్మల్ని ఒకపూట షికారు తిప్ప వలిసిఉంటుంది, మిస్టర్ బోస్," అన్నాడు పాల్.

"తప్పకుండా, ఎప్పుడు వస్తారు?"

"ఆదివారంనాడు పోదాం ఆరోజు నాకు రెస్టు," అంటూ పాల్ గడియారం తీసి, నాలుగైందని చూసుకుని, "ఇక నేను వెళ్ళాలి. ఈపూట మీ రేవేపు వెళుతున్నారు, మిస్టర్‌బోస్?" అని అడిగాడు.

"పట్నం దాటి ఏదైనా రోడ్డువెంట కొంతదూరం వెళ్ళివస్తాను." అన్నాడు విజయుడు.

పాల్ తనభార్యకేసి తిరిగి, "సుశీ, నువు బోస్‌గారివెంట షికారు వెళ్ళిరా కూడదూ ? పొలాల గాలి వంటికి మంచిది...బోస్‌గారి కేమీ ఇబ్బంది లేకపోతే!" అన్నాడు విజయుడికేసి తిరుగుతూ

విజయుడు శాస్త్ర పస్తాయించాడు. ఈడు ఉన్నదాన్ని తనవెంట కారులో ఒంట రిగా తీసుకుపోవటం అంత భావ్యంకాదు. తీసుకుపోవవటం చాలా మోటు. చివర కతను తన కేమీ ఇబ్బంది లేదన్నాడు.

పాల్ వేపచెట్టుకింద నిలబడిఉన్న బండిలో ఎక్కి వెళ్ళిపోయాడు. బండి గేటు దాటివెళ్ళాక సుశీ విజయుడితో. "నేను వెంటరావటం మీకు కాస్త అభ్యంతర మే; కాదూ?" అన్నది.

"ఎందుకూ?"

"ఏమో ! కొంచెం విసుగుమొహం పెట్టారు. మీ కేవిధమైన సందేహం ఉన్నా నన్ను తీసుకుపోవద్దు. ఒక్కరోజు గాలిషికారు తిరిగినంతమాత్రాన ఏంలాభం ?"

"లేదు, మిసెస్‌పాల్. మిమ్మల్ని ఒక గంటసేపు గాలిలో తిప్పితే నా కేమిటి ఇబ్బంది ? ఇంకోకప్పు టీ ఇవ్వండి; తాగి బయలుదేరదాం."

సుశీ తన పాదరక్షలు మార్చుకువస్తా నన్నది. ఆడవాళ్ళు ఒకంతట తెమలరనీ, త్వరగా రమ్మనీ అని విజయుడు తన గదిలోకి వెళ్ళాడు. అతను తల దువ్వుకుని, నెక్‌టై మంచిది ఎన్నుకుంటూ, ఎవతెనో తాను కారులో షికారుకు తీసుకువెళ్ళినట్టు తెలి స్తే బకురాణి ఏమనుకుంటుందో ననుకున్నాడు. అతను ముస్తాబై బయటికి వచ్చే వరికి సుశీ అతనికోసం వేచిఉన్నది.

పట్టణం దాటినాక చల్లనిగాలి వీచసాగింది. అంతదాకా మౌనంగా ఉన్న సుశీ, "ఎంత మంచిగాలి ! ప్రాణానికి హాయిగా ఉంది," అన్నది.

ఒక అరగంట అనంతరం వా రొక గ్రామాన్ని చేరవచ్చారు. గ్రామానికి ఇవత లనే ఒక మామిడితోటా, దాన్ని దాటితే ఒక కొండా కనిపించాయి. మామిడి తోటలో పక్షులు చాలాగోలగా అరుస్తున్నాయి. అక్కడ కాస్సేపు ఆగి అటూఇటూ తిరుగుదామన్నది సుశీ.

విజయుడు కారు ఆపించి, కిందికి దిగి, సుశీని వెంటబెట్టుకుని మామిడితోటలోకి ప్రవేశించాడు. రాలిన ఆకులు నేలపై గుట్టలుగుట్టలుగా పడిఉన్నాయి. వారు వాటి మీదుగా నడుస్తూ కొండకేసి వెళ్ళారు.

సాయంకాలం అవుతూండటంచేత పశువులకాపరికుర్రాళ్ళు పశువులను గ్రామా నికి మళ్ళించుకుపోతూ వారికి ఎదురు వచ్చారు. వాళ్ళలో ఒకడు, "సలాం సాబ్, సలాం మేమ్‌సాబ్," అన్నాడు.

సుశీ చెక్కిళ్ళు ఎర్రబారాయి. ఆమె మరుక్షణమే తనను తాను నిగ్రహించుకుని "ఈ కొండమీద పులులూ, ఎలుగుబంట్లూ ఉంటాయా ?" అని ఆ కుర్రాణ్ణి అడిగింది.

"ఇంత చిన్న కొండమీద పులులూ, ఎలుగుబంట్లూ ఎలా ఉంటాయి ?" అన్నాడు వాడు.

ఇద్దరూ కొండను సమీపించాక విజయుడు కొండ ఎక్కుదామన్నాడు. "ఎక్క గలరా?" అని అడిగా డామెను.

"చిన్నతనంలో ఎప్పుడూ కొండ ఎక్కేదాన్ని. హజారీబాగ్‌లో మా అక్కయ్యా



వాళ్లు మిషనరీలుగా ఉండేవాళ్ళు. మిషన్‌హౌస్ పక్కనే కొండ ఉండేది. అందరమూ దానిమీది కెక్కి ఆడుకునేవాళ్ళం."

సన్నని కాలిబాటవెంబడి నూరడుగుల ఎత్తు ఎక్కేసరికి ఇద్దరూ అలిసిపోయారు. దారికి ఎడంపక్కగా ఒక చట్రాయి కనిపించింది. అది కూర్చోవటానికి అనుకూలంగా ఉన్నది. కాని దాని దగ్గరకి దారిలేదు. విజయుడు శశిని చెయ్యి పట్టుకుని నడిపించవలసివచ్చింది.

ఇద్దరూ ఆ రాతిమీద కూర్చొని కిందికి చూస్తే దృశ్యాలు చాలా అందంగా కనిపించాయి. చల్లనిగాలి వీస్తూండటంచేత ఇద్దరికీ క్షణంలో ఆయాసం తీరింది. ఒక అరగంట అక్కడే కూర్చుని, చీకటిపడితే కొండ దిగటం కష్ట మవుతుందని బయలుదేరారు.

## 4

ఆ రాత్రి విజయుడు భోజన మయాక బయట వాలుకుర్చీ వేయించుకు పడుకుని వెన్నెలను చూస్తూ ఆరోజు జరిగిన సంగతులు విమర్శించుకున్నాడు. ఆలోచించిన కొద్దీ జరిగినది అతనికి నచ్చలేదు. తాను పాల్ భార్యను షికారుకు తీసుకుపోయినట్టు తెలిస్తే బకురాణీ ఏమనుకుంటుంది. పాశ్చాత్య నాగరికత అలవడిన వారికి అది సాధారణమైన సంగతే, కాని కఠినమైన హిందూ సంస్కారపు కట్టుబాట్లలో జీవించేవారి కది బాగుండదు.

ఈ సంగతి బకురాణీకి రాయాలా, వద్దా అన్న ప్రశ్న ఒకటి అతన్ని వేధించింది. తన భార్య మరొకచోటికి వెళ్ళి, అక్కడ ఒక అందగాడైన యువకుడి వెంట ఒంటరిగా చాలాదూరం షికారు వెళ్ళి వచ్చినట్టు రాస్తే తన కెలా ఉంటుంది? బకురాణీ కోరినట్టు ఆమెనూ, పరివారాన్నీ వెంట తీసుకువస్తే, ఈ బంగళా మకాములూ, ఇతరులను షికారు తిప్పటాలూ జరిగే అవకాశం ఉండకపోను.

అతను గదిలోకి వెళ్ళి పడుకోవటం ఇష్టంలేక పంఖావాణ్ణి కాస్సేపు నిద్రపొమ్మని అవతలికి పంపేశాడు. బయటనే చాలా ఉక్కగా ఉంది. పాల్ దంపతులు తలుపులు మూసుకుని లోపల పడుకున్నారు. ఆ ఉక్కలో సుశీ ఎలా నిద్రపోతుంది? నిద్రలేక మళ్ళీ తలనొప్పితో బాధపడుతుం దేమో. పాల్ కూలీని ఏర్పాటు చేస్తా నన్నాడు, కాని కూలీ లేడు.

అతను తన కూలీని మళ్ళీ పిలిచి, పాల్‌సాబ్‌గారి గదిలో పంఖా లాగేవా డేడీ?" అని అడిగాడు.

"నాలుగ్గంటలకు వాడు వెళ్ళి పోతాడు," అన్నాడు కూలీ.

"అయితే నువే వెళ్ళి ఆ గది పంఖా లాగు"

"బహుతచ్ఛా? హుజూర్."

విజయుడు అంతగా అయితే తెల్లవార్లూ పడకకుర్చీలోనే బయట పడుకుందా మనుకుని ఈ పని చేశాడు.

మర్నాడు ఉదయం ఏడున్నరకు విజయుడు తన గదిలో టీ తాగుతుండగా పాల్ వచ్చి, గుడ్‌మార్నింగ్ చెప్పి, "రాత్రి మీకు, చాలా శ్రమ అయిం దను కుంటాను," అన్నాడు.

"మిసెస్ పాల్‌కు నిద్రపట్టకపోతే తలనొప్పి వస్తుందేమో ననుకున్నాను. మా పంఖా లాగేవాడు లేడు. రాత్రీ అమిత ఉక్కబోసింది."

తాను రాత్రి పంఖా లాగటానికి మనిషిని రమ్మంటే వాడు రాలేదనీ, పన్నెండు గంటలు దాటాక పంఖా ఆడటం ప్రారంభించేదాకా తనకు నిద్ర పట్టలేదని తన భార్య చెప్పిందనీ పాల్ అన్నాడు. కిందటి సాయంకాలం తన భార్యను విజయుడు షికారుకు తీసుకుపోయినందుకుకూడా అతను ధన్యవాదాలు చెప్పి వెళ్ళిపోయాడు.

తొమ్మిదిగంటలకు సుశీ స్నానంచేసి, సరిగంచు నల్లచీరె కట్టుకుని, జరీకమ్ముల ఊదా జాకెట్టు తొడుక్కుని, విజయుడి గదిలో ఒక గంటసేపు కూర్చుని ఆ కబుర్లూ ఈ కబుర్లూ ఆడింది. పంఖా లాగేవాణ్ణి తన గదిలో పంఖా లాగటానికి పంపి, విజయుడు తెల్లవార్లూ బయట కుర్చీలో పడుకున్నందుకు తనకు చాలా కోపం



వచ్చిందన్నది. విజయుడు రోజుకు పాతిక సిగరెట్లు కాలుస్తుంటే, అతని భార్య ఊరుకుంటుందా అన్నది. ఆమె పే రేమిటన్నది. బకూ అంటే అర్థ మేమిటన్నది. బకురాణి అనటంకంటె వకుళమాల అంటేనే బాగున్న దన్నది. తాము కలకత్తా వచ్చి బకురాణితో స్నేహం చేసుకుంటా నన్నది.

పదిగంటలప్పుడు విజయుడు గడియారం తీసి చూసి, "బజారుకు వెళ్ళిరావాలి. బకురాణికోసం బ్రూచ్ కొందా మనుకుని ఎప్పటికప్పుడు మరిచిపోతున్నాను." అంటూ బండి తీసుకురమ్మని లక్ష్మణబేహరాకు కేకపెట్టాడు.

"బ్రూచ్‌లో చాలా రకా లున్నాయి. ఒక రకమయినది చాలా బాగుంటుంది. అందులో —" అని సుశీ ప్రారంభించేసరికి, విజయుడు ఆమెనుకూడా తన వెంట బజారుకు రమ్మని కారులో తీసుకుపోయాడు.

వాళ్ళు పదకొండు లోపల తిరిగివచ్చి, ఎవరి గదికి వారు వెళ్ళారు. విజయుడు తాను కొనితెచ్చిన వస్తువులన్నీ బల్లమీద తెరిచిపెట్టి పరీక్షించాడు. అందులో రెండు సెట్ల షర్టు గుండీలూ, ఒక జత రాళ్ళు పొదిగిన బంగారు గాజులూ, రెండుజతల చెవి పోగులూ, రెండు బ్రూచ్‌లూ, ఉన్నాయి. గాజులు చాలా ఖరీదైనవి. అవి బకురాణీ కోసం కొన్నాడు. చెవి పోగులు తన కూతురు చిట్టికోసమూ, తన వదినెగారి కూతురు సరోజిని కోసమూ కొన్నాడు. బ్రూచ్‌లలో ఒకటి బకురాణీ కోసం — రెండోది సుశీకి ఇద్దామనుకుని కొన్నది. ఆ బ్రూచ్ ఉన్న పెట్టెను

విడిగా పెట్టి, ఒక కాగితముమీద "కృతజ్ఞతాపూర్వకంగా" అని రాసి, దస్కతు చేసి, తేదీవేసి ఆ పెట్టెలో పెట్టాడు. ఆ పెట్టెను తన కోటుజేబులో పెట్టుకున్నాడు.

భోజనం సిద్ధంగా ఉందని ఖాన్‌సామా పిలిచాడు. విజయుడు డైనింగ్‌రూమ్‌కు వెళ్ళేసరికి సుశీ ఇంకారాలేదు. పాల్ కూర్చుని సిగిరెట్టు కాల్చుకుంటున్నాడు. విజయు డతన్ని చూసి, "ఇవాళ మిసెస్‌పాల్‌కు చాలా శ్రమయిచ్చాను." అన్నాడు.

"విన్నాను ఏమీ బాగాలేదు మహాశయా." అన్నాడు పాల్.

"ఏం ?"

"మా కంపెనీలో ఓ బెంగాలీబా బున్నాడు. పిసినిగొట్టు. నేనూ మరికొందరమూకల్పి ఆయన భార్యకు పెద్ద నగలకేటలాగ్ పంపించాం!" అంటూ పాల్ పెద్దగానవ్వాడు.

"తరవాత ?"

"ఏముందీ ? ఆ బెంగాలీబాబుకు ఇల్లు నరకమయింది. ఇంతకూ మేం పంపింది కేటలాగే. మీరు సుశీని తిన్నగా నగలదుకాణానికే తీసుకువెళ్ళారు. నగలదుకాణానికి వెళ్ళిన ఆడది చేపల అంగడిలోకి వెళ్ళిన పిల్లిలాగా అయిపోతుంది," అంటూ పాల్ మళ్ళీ పెద్దగా నవ్వాడు.

సుశీ వచ్చి, "ఏమటి జోక్ ?" అని అడిగింది.

"మీ భర్త మిమ్మల్ని పిల్లి అంటున్నారు. సుశీకి 'పుశీ' ప్రాస బాగా కుదిరిందన్నారు." అన్నాడు విజయుడు.

"అన్యాయం, మిస్టర్ బోస్," అన్నాడు పాల్.

సుశీ ఆ ఇద్దరికేసీ చూసి, "మీ రేదో కల్పించారు. నా కేమీ అర్థం కావటం లేదు." అన్నది.

విజయుడు జేబులోనుంచి. పెట్టె తీసి ఆమె కిస్తూ, "పిల్లిగారూ, ఇందులో ఒక చిన్న చేప ఉన్నది. తీసుకోండి," అన్నాడు.

సుశీ పెట్టె తెరిచి చూసి, కొంచెం సిగ్గుపడి, ఆటే ఇష్టం లేనట్టుగా, "ఇది నా కెందు కిస్తున్నారు ? మీ వాళ్ళకోసం కొన్నారుగద !" అన్నది.

"లేదు, మిసెస్ పాల్, మీ కోసమే కొన్నాను."

భోజనం అయాక విజయుడు తన భార్యకు ఉత్తరం రాయటానికి కూర్చొని, నిన్నటి సాయంకాలం షికారూ, రాత్రి పంఖా విషయమూ, నగలు కొనటానికి సుశీ సహాయపడటమూ, కృతజ్ఞతాపూర్వకంగా తాను ఆమెకూ-డా ఒక బ్రూచ్ కొనటమూ, పిల్లిజోకూ—అన్నీ రాసేసి, మనసు తేలికపరచుకుని, రాత్రికూడా నిద్ర లేనందువల్ల హాయిగా నిద్రపోయాడు.



## 5

విజయుడు నిద్ర లేచేసరికి అయిదుగంటలయింది. అతను ముఖం కడుక్కొని, దుస్తులు వేసుకుని, వరండాలోకి వచ్చేసరికి టీ టేబిల్‌వద్ద సుశీ ఒంటరిగా కూర్చుని పుస్తకం చదువుకుంటున్నది. పాల్ బయటికి వెళ్లి చాలాసేపయిందనీ, ఆయన రాత్రికి ఎవరో స్నేహితుడింట భోజనం చేసి అక్కడే పడుకుంటాడనీ ఆమె విజయుడితో అన్నది.

ఖాన్‌సామా విజయుడికి టీ తెచ్చాడు. సుశీ అతని కో కప్పు టీ కలిపిఇచ్చి తానొక కప్పు కలుపుకుని, "ఇవాళ ఎటూ షికారు వెళ్ళరా?" అని అడిగింది.

ఆమెను ఇక ఎన్నడూ ఒంటరిగా షికారు తీసుకుపోరాదని నిర్ధారణ చేసుకున్న విజయుడు, "ఇవాళ ఎటూ వెళ్ళాలని లేదు," అన్నాడు.

విజయుడికి వెళ్లిపోవాలనే ఆలోచన వచ్చింది సుశీ తనకు మరీ దగ్గర అయిపోతున్నది. ఆమెనుచూసి తాను జాలిపడిన కారణంచేతనే వారి మధ్య స్నేహం ఇలా పెరిగిపోయింది.

"రేపీపాటికి నేను చాలాదూరాన ఉంటాను," అన్నాడతను.

"ఏమిటీ? వెళ్లిపోతున్నారా?" అన్నదామె ఉలికిపడి.

"అదే ఆలోచన. కలకత్తాకు వస్తే మమ్మల్ని తప్పక చూడవస్తారు గదూ?"

"కలకత్తా రావటమంటూ ఈ జన్మలో ఉంటేనా!"

"ఏం, పాల్‌గారి హెడ్డాఫీసు అక్కడేగా?"

"ఆయిన ఎందులోనూ స్థిరంగా ఉండరు. మధ్య మధ్య బొంబాయి పోతానంటారు...కలకత్తాకు వస్తేమాత్రం మీ ఇల్లెలా తెలుస్తుంది?"

"ఒక ఉత్తరంముక్క రాస్తే నేను వచ్చి తీసుకుపోతాను."

"మిస్టర్ బోస్, వకీల్, హైకోర్టు అని రాయమంటారా? మీ పూర్తి పేరేమిటి?"

విజయుడు చెప్పాడు.

సుశీ అతనికి తన పూర్వవృత్తాంతం చెప్పింది ఆమె తండ్రి కలకత్తాలో ఒక బాప్టిస్టు మిషనరీగా ఉండేవాడు ఆయన పోయేటప్పటికి సుశీ పదకొండేళ్ళది. ఆమెకు తోబుట్టువు లెవరూలేరు. హజారీబాగ్‌లో పినతండ్రి ఉండేవాడు. ఆయన సుశీతల్లికి పంతులమ్మపని ఇప్పించాడు. పినతండ్రికూడా పోయి, సుశీ తన తండ్రి స్నేహితుడింట ఉంది మిషన్‌పని నేర్చుకుంటూండగా పాల్ తటస్థపడ్డాడు. కొద్ది రోజులకే ఇద్దరూ పెళ్లాడారు. పెళ్లి అయాక కొద్దిమాసాలు కలకత్తాలో ఉండి, ఆ తరవాత సంచారం ప్రారంభించారు. పాల్ స్వగ్రామం మద్రాసుదగ్గిర వేలుపేట.

ఇలా వా రిద్దరూ మాట్లాడుకుంటూండగానే రాత్రి తొమ్మి దయింది. వారికి భోజనం వచ్చింది. భోంచేస్తూ సుశీ, "నా చరిత్ర విన్నారు. మీ చరిత్ర కూడా చెప్పండి." అన్నది.

"కలకత్తాలో పుట్టాను. అక్కడే చదువుకున్నాను. పెళ్ళి అయింది. హైకోర్టులో ప్రాక్టీసు చేస్తూంటాను. శెలవుల్లో సంచారం చేస్తాను," అన్నాడు విజయుడు.

"అంతేనా? మీ చరిత్ర అంతా చెప్పాలి. బయట కూర్చుందాం పదండి. నిద్ర పోయేదాకా మీ చరిత్ర వినాలి."

వారు భోజనం ముగించి మూతులు తుడుచుకుంటూ ఉండగా బంగాళా ఆవరణ లోకి ఒకబండి వచ్చింది. బేహరా వచ్చి: మేమ్‌సాబ్ గారికి కోచ్‌మన్ ఈ జాబు తెచ్చాడు. వాడికి బండి బాడుగ రావాలిట," అన్నాడు.

సుశీ ఉత్తరం చదువుతూంటే ఆమె ముఖం మారిపోయింది.

"ఏమిటి విశేషం?" అన్నాడు బోస్ ఆమె ముఖంకేసి చూస్తూ.

ఆమె ఉత్తరాన్ని అతనిముందు పడేసి, బల్లమీదికి వాలి, ముఖానికి చేతు లడ్డం పెట్టుకుని, వినపడీ వినపడకుండా ఏడవసాగింది.

విజయుడు ఉత్తరం తీసి చదువుకున్నాడు. ఇంగ్లీషులో రాసిన ఆ ఉత్తరం ఇలా ఉన్నది.

"డియర్ సుశీ, నేను బొంబాయి పోతున్నాను. నేను డబ్బు ఇబ్బందిలో ఉన్న

సంగతి నీకు తెలుసు. భవిష్యత్తు బాగుంటుం దనే ఆశతో నిన్ను పెళ్ళాడాను. నా ఉద్యోగంకాస్తా పోయింది. నన్ను డిస్మిస్ చేసినట్టు కలకత్తానుంచి ఉత్తరం వచ్చింది. ఆ మాట నీకు చెప్పలేదు. ఈ స్థితిలో నిన్ను పోషించలేను. నాతోబాటు నువు కష్టాలు పడటం నా కిష్టంలేదు. కలకత్తా వెళ్ళి హైకోర్టులో వివాహం రద్దు చేసుకో. నేను నీపట్ల క్రూరంగా ప్రవర్తించా ననీ, నిన్ను వదిలిపెట్టి పోయా ననీ రుజువు చేస్తే విడాకు లిచ్చేస్తారు మనం దిగిన డాక్‌బంగళా బట్లర్లు నీకు సాక్ష్యం ఇస్తారు. వకీలు బోసుగారు నీకు సహాయం చెయ్యగలరు. బొంబాయి టిక్కెట్టుకు సరిపోయే డబ్బే ఉంది. బండివాడికి, నీ దగ్గిర ఉంటే, మూడురూపాయ లిచ్చిపంపు.

— సి. పాల్."

ఉత్తరం చూసి విజయుడికి మండిపోయింది. పాల్‌ను తిట్టుకుని, "ఆయన ఏ బండిలో వెళ్ళారు ?" అని కోచ్‌మన్‌ని అడిగాడు.

"తొమ్మిదింబావు బండిలో."

"మెయిల్ బండా ?"

"బొంబాయి పాసింజరు. నా బాడుగ ఇప్పించండి."

విజయుడు మూడురూపాయలు తీసి వాడి కిచ్చి పంపించేశాడు.

అతను గదిలోకి వచ్చేసరికి సుశీ, "పోలీసులకు రిపోర్టు చేశారా ?" అన్నది.

"పోలీసు లేం చెయ్యగలరు ?" అన్నాడు విజయుడు.

"నన్ను పెళ్లిచేసుకుని నట్టేట ముంచి వెళ్లిపోయాడు. పోలీసు లేమీ చెయ్యలేక పోతే నాగతి ఏమిటి ? ఎక్కడికి పోతాను ? నా చేతిలో రూపాయికూడా లేదు. నా సంగతి ఏమిటి, విజయబాబూ ?"

విజయుడు తలవంచుకుని మాట్లాడలేదు

"టెలిగ్రాం ఇచ్చో, మరోవిధంగానో ఆయన్ను దారిలో ఆపేస్తే ?"

"అందువల్ల లాభం ?"

"ఎదటపడితే ఎలా నన్ను విడిచిపెడతాడో చూస్తాను !"

విజయుడు టైమ్‌టేబిల్ తెప్పించి చూసి, "మెయిలు సాయంకాలమే వెళ్లిపోయింది. ఇప్పట్లో బొంబాయికి వెళ్ళే మరోబండి కనబడదు." అన్నాడు

"ఉంటేమటుకు చేసే దేమిటి? నాదగ్గిర టిక్కెట్టుకూడా డబ్బులేదు!" అంటూ సుశీ నిట్టూర్చింది.

"ఆయన్ను పట్టుతుంటే మీకు నిజంగా లాభిస్తుందా ?" అని విజయు డడిగాడు.

"తప్పకుండా."

"అయితే ఒకపని చేద్దాం. పాసింజరు ప్రతి స్టేషనులోనూ ఆగుతూపోతుంది. ఇప్పుడు తొమ్మిదీయాభై ఆరైంది. రాత్రి రెండూ ఆరుకు పాసింజరు సోహాగ్‌పూర్ స్టేషను చేరుతుంది. 122 మైళ్ళదూరం. కారులో పోతే రెండులోపుగా సోహాగ్‌పూర్ చేరకుంటాం. భోపాల్‌దాకా మంచిరోడ్డున్నది. రైలుదారి నానుకునే వెళుతుంది."

సుశీ తన ముఖాన్ని చేతులతో తుడుచుకుని, "మీకు చాలా శ్రమ అవుతుంది విజయబాబూ," అన్నది

"ఏమీ శ్రమలేదు, పదండి. వెంటనే సిద్ధంకండి." అంటూ విజయుడు బేహారాతో సుందరసింగును పిలవమని చెప్పాడు

"మీరు లేకపోతే నాగతి ఏమైఉండేది?" అని కళ్ళు తుడుచుకుంటూ సుశీ తన గదిలోకి వెళ్ళింది.

సుందర్‌సింగ్ వచ్చాడు. విజయుడు పెట్రోలు సరిపోయినంత ఉన్నదని తెలుసుకుని వెంటనే పట్టుకురమ్మని, బెడ్డింగూ, సూట్‌కేసూ, టిఫిన్‌బాక్సూ సిద్ధం చెయ్యమని బేహరాతో చెప్పాడు.

బండి వచ్చి వరండా మెట్లదగ్గిర ఆగింది. బేహరా సామాన్లు అందులో పెట్టాడు. విజయుడు సుశీని చెయ్యిపట్టుకు తీసుకుపోయి వెనకసీట్లో కూర్చోబెట్టి, తాను ప్రక్కన కూర్చున్నాడు. అతను బేహరాతో రేపు మధ్యాన్నానికో సాయంకాలానికో తిరిగి వస్తానని చెప్పి, సుందర్‌సింగుతో బండిని పోనిమ్మన్నాడు.

పదినిమిషాలలో కారు పట్నం దాటి రైలుమార్గం పక్కనే ఉన్న రోడ్డుమీదగా పోసాగింది. రోడ్డు దాదాపు నిర్మానుష్యంగా ఉంది. పైన చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

త్వరలోనే మీర్‌గంజ్ స్టేషను వచ్చింది. అక్కడికి కొంతదూరంలో పాలరాళ్ళ గనులున్నాయి. ఒక్కొక్క స్టేషనే దాటుతూ కారు పోతున్నది. ఒక గంట గడిచింది. సుశీ తల నిద్రమత్తుతో వాలిపోతూ మధ్యమధ్య ఉలిక్కిపడి లేస్తున్నది.

సుశీకి నిద్ర వస్తున్న పక్షంలో తాను ముందుసీటులో డ్రైవరు ప్రక్కన కూచుంటాననీ, వెనక సీటులో ఆమె ముడుచుకుని పడుకోవచ్చుననీ విజయుడన్నాడు. సుశీ తనకు నిద్ర రావటంలేదనీ, రాదనీ అన్నది. కాని పదినిమిషాలన్నా తిరగకుండానే ఆమె తల విజయుడి భుజముపైన వాలిపోయింది. అతడామెను లేపలేదు. కారు నర్మదా వంతెనపైన పోతుండగా ఆమె లేచింది.

మరోగంట గడించింది. ఏదో స్టేషనుతాలూకు ఎర్రదీపాలూ, పచ్చదీపాలూ కనిపించాయి. విజయుడు స్టేషను బయట కారు ఆపించి, సుశీని వెంటబెట్టుకుని



ప్లాట్‌ఫాం మీదికి వెళ్ళాడు. అది బోహానీ స్టేషను. బొంబాయి పాసెంజరు 15 నిమిషాల క్రితం ఆ స్టేషను వదిలిపోయిందనీ, సోహాగ్‌పూర్ అక్కడికి యాభై మైళ్ళుంటుందనీ స్టేషనుమాస్టరు చెప్పాడు.

కారు రెండుగంటల పదిహేను నిమిషాల కాలంలో డెబ్భయిరెండు మైళ్ళు వచ్చింది; రెండుగంటల వేళకు మిగతా యాభైమైళ్ళూ వెళ్ళటం సాధ్యమే నని విజయుడు సుశీకి ధైర్యం చెప్పాడు.

ఇద్దరూ వెళ్ళి కారులో కూర్చున్నారు. కారు మళ్ళీ స్టార్టయింది. అరగంటలో మరిరెండు స్టేషన్లు వచ్చాయి కారు ఇంకొంచెం వేగంగా పోనిమ్మని విజయుడు సుందర్‌సింగును హెచ్చరించాడు.

ఇంకో స్టేషను కూడా దాటింది. ఒకటిన్నర కావస్తున్నది. రైలుపట్టాలమీద మూడు ఎర్రదీపాలు కనిపించాయి. బ్రేక్‌వాన్ దీపాలు.

"అదే మనం పట్టుకునే బండీ," అన్నాడు విజయుడు.

సుశీ బ్రేక్‌వాన్ దీపాలకేసి తదేకదృష్టితో చూసింది. అవి క్రమంగా దగ్గిర అవుతున్నాయి. కారు రైలుకన్న వేగంగా పోతున్నది. చూస్తుండగానే బ్రేక్‌వాన్ చేరుకుని, దాన్ని దాటి, ఆతరవాత ఒక్కొక్క బోగీనే దాటుతూ, చివరకు ఇంజన్నుసైతం దాటి ఇంకా ముందుకు వెళ్ళింది.

పాల్ ఆ బోగీలలో ఎందులోనో ఉన్నాడు.

"వచ్చేదేనా సోహాగ్‌పూర్ స్టేషను?" అని సుశీ అడిగింది.

"కాదు, పిసారియా స్టేషను. దీని తరవాతది సోహాగ్‌పూర్. పిసారియా స్టేషనులో బండి మూడు నిమిషాలే నిలుస్తుంది సోహాగ్‌పూర్‌లో పది నిమిషా లుంటుంది. వెతుక్కోవటానికి వ్యవధి ఉంటుంది." అన్నాడు విజయుడు

కారు పిసారియా స్టేషను చేరేసరికి రైలింకా రాలేదు. విజయుడు వెనక్కు తిరిగి చూస్తే ఇంజను దీపాలు కనిపించాయి. అతను సుందర్‌సింగుతో, వీలుంటే కారును మరింత వేగంగా పోనిమ్మన్నాడు

కారు పూర్తివేగంతో పోతున్నది. విజయుడు వెనక్కు తిరిగిచూస్తే రైలు దీపాలు కనబడటం లేదు రోడ్డు దొడ్డిగా పాడుగా ఉండటంవల్ల కుదుపు జాస్తిగా ఉన్నది సుశీ విజయులు ఒకరిమీద ఒకరు పడిపోతున్నారు

అంతలో తుపాకీ పేల్చిన చప్పుడులాటి దయింది. టైర్ బద్దలయింది. బండి ఒక మూలకు ఒరిగి నడుస్తున్నది. సుందర్‌సింగ్ ఇంజను స్విచాఫ్ చేసి, కొంచెం కొంచెంగా ఎమర్జెన్సీ బ్రేక్ వేశాడు

"విజయబాబూ, ఇప్పు డేం చేసేట్టు?" అన్నది సుశీ

"చక్రం మార్చాలి."

కారు డిస్టెంట్‌సిగ్నల్ ప్రాంతాల ఆగింది. డ్రైవరూ, విజయుడూ, సుశీ బయటికి దిగారు. సుందర్‌సింగ్ జాకీ తీసి ఆక్సిల్‌కింద పెట్టి చక్రం పైకెత్తుతూ, "అరనిమిషం, హుజూర్." అన్నాడు.

"అదుగో, రైలు వచ్చేస్తున్నది." అన్నది సుశీ.

దూరాన రైలుఇంజను దీపాలు కనపడ్డాయి.

"సుందర్‌సింగ్, జల్దీ! జల్దీ!" అన్నాడు విజయుడు

సుందర్‌సింగు చెడిపోయిన చక్రం తీసేసి స్టెప్నీ బిగించి, "ఎక్కండి, హుజూర్," అన్నాడు సుశీ విజయులు కారులో ఎక్కికూర్చున్నారు.

కాని ఎంత ప్రయత్నించినా కారుఇంజను స్టార్టుకాలేదు.

"ఇంజను కేదో అయింది. బానెట్ తీసి చూస్తాను హుజూర్," అన్నాడు, సుందర్‌సింగ్ కొద్దిగా భయపడుతూ

విజయుడు వెనక్కుతిరిగి చూశాడు. రైలింజను దీపాలు ధగధగా మెరుస్తూ కనబడుతున్నాయి మోతకూడా వినిపిస్తున్నది.

సుశీ కళ్ళనీళ్ళపర్యంతమై, "బండీ వచ్చేస్తున్నది విజయబాబూ!" అన్నది

"ఏమయింది సుందర్‌సింగ్?" అని విజయు డడిగాడు

"చూస్తున్నాను హుజూర్. అంతా సరిగానే ఉన్నట్టున్నది మా గ్నైటోకు ఏమైనా అయిందేమో !

రైలు రానేవచ్చింది. అది వాళ్ళపక్కగానే సోహాగ్‌పూరు స్టేషనుకు వెళ్ళింది.

## 6

"స్టేషను అరమైలుకంటె హెచ్చుదూరం ఉండదు. స్టేషను దీపాలు కనిపిస్తున్నాయి చూడండి నెమ్మదిగా నడవగలరా ?" అని విజయుడు సుశీ నడిగాడు.

"తల తిరిగిపోతున్నది. నిలబడలేను." అన్నది సుశీ కారును ఆనుకుంటూ.

"వెళ్ళితీరాలి. మేఘాలు కమ్ముకుంటున్నాయి. వర్షం రావచ్చు. తెల్లవారేదాకా బండి మరమత్తుకాదు. ఎక్కడో ఒకచోట తల దాచుకోవాలి. స్టేషన్‌దగ్గరలో డాక్ బంగళా ఉండవచ్చు. లేకపోయినా స్టేషన్ వెయిటింగ్‌రూమ్ ఉండనే ఉంటుంది. నా భుజంమీద బరువేసి నింపాదిగా నడవండి."

అతను సుశీని రెట్టపట్టుకుని నడిపిస్తూ బయలుదేరాడు. వాళ్లు అరమైలుదూరం నడవటానికి ఇరవై నిమిషాలు పట్టింది. చంద్రుడు పడమట అస్తమించుతున్నాడు. మబ్బులు అప్పుడప్పుడూ చంద్రుడికి అడ్డొస్తున్నాయి.

పోలీసుస్టేషను పక్కనే డాక్‌బంగళా ఉన్నది. విజయుడు బంగళా ఆవరణలోకి ప్రవేశించి ఖాన్‌సామాను కేకపెట్టాడు. జవాబులేదు. ఖాన్‌సామా ఉండే ఔట్‌హౌస్ దగ్గిర కేకపెట్టినా ఎవరూ పలకలేదు వంటఇల్లు తాళం పెట్టిఉన్నది.

విజయుడు ఒక రాయితెచ్చి, తలుపుఅద్దం పగలగొట్టి లోపలిగడియ తీసి, సుశీతో సహా లోపల ప్రవేశించాడు. లోపల బల్లా, రెండు కుర్చీలూ, డ్రెసింగ్‌టేబిలూ, ఇనపమంచమూ, దానిమీద పరుపూ ఉన్నాయి. గోడన లాంత రున్నది. విజయుడు దాన్ని వెలిగించాడు. మంచంపైన ఉన్న పరుపునిండా ధూళి. స్నానాలగదిలో ఖాళీ కడవ లున్నాయి. ఒక్కచుక్క నీరులేదు. అతను సుశీని అక్కడే ఉండమని రైలు స్టేషనుకు వెళ్ళి, కూలీలను మాట్లాడాడు. తినటానికి రొట్టె, వెన్నా, గుడ్లూ, టీ ఆర్డ రిచ్చాడు. కూలీలు వచ్చి గదులు శుభ్రంచేశారు.

ఇద్దరూ ఒళ్ళు కడుక్కొని టీ తాగటానికి కూర్చునేసరికి మూడున్నర అయింది ఇద్దరూ టీ పూర్తి చేశారు.

"ఇక మీరు వెళ్ళి పడుకోండి," అన్నాడు. మేఘాలు మెరుస్తూ గర్జిస్తూన్నాయి.

సుశీ చెయ్యి చాచి "గుడ్‌నైట్ !" అన్నది

విజయు డామె చేతిని పట్టుకుని, "గుడ్‌నైట్ ! గుడ్ మార్నింగ్ అంటేనే బాగుంటుందేమో !" అన్నాడు.

సుశీ ఆందోళనపడుతూ, "విజయబాబూ, ఉదయం లేచేసరికి మీరు కనిపిస్తారా ?"

"ఎందుకు కనపడనూ ?"

"ఎలైనా — వెళ్ళిపోరా ?"

"మిమ్మల్ని ఇక్కడ విడిచి వెళ్ళిపోతానా? వెళ్ళను. సుశీలా ! నన్ను నమ్మవచ్చు."

ఈలోకంలో నా కింకెవరూ లేరు. నన్ను విడిచిపెట్ట ననండి."

"విడిచిపెట్టను, సుశీలా ! విడిచిపెట్టను !"

హోరున వర్షం ప్రారంభ మయింది. కిటికీలోనుంచి చల్లని గాలి కొట్టింది. సుశీ నెమ్మదిగా వెనక ఉన్న పడకగదిలోకి వెళ్ళిపోయింది.

ఖాన్‌సామా నిజాముద్దీన్ తెల్లవారి వచ్చి, రాత్రిబండికి ఏ దొరో వచ్చినట్టు తెలుసుకుని భయపడ్డాడు.

వాడు మొదట విజయుడి గదిలోకి తొంగిచూశాడు. మేజోడుపాదాలు మాత్రమే కనుపించాయి. వచ్చినవాడు తెల్లదొరో, నల్లదొరో తెలియలేదు. వాడు సుశీ గది కిటికీవద్దకు వచ్చి రెక్కలతలుపు తెరిచేసరికి, లోపలనుంచి "ఎవరది ?" అని ఆడకంఠం కేక పెట్టింది.

"హజూర్, ఖాన్‌సామాను టీ ఎన్నిగంటలకు తెమ్మంటారో కనుక్కుందా మని —" అన్నాడు నిజాముద్దీన్.

"ఇప్పుడు కాదు."

నిజాముద్దీన్ కాస్త మంచి దుస్తులు వేసుకుని వచ్చేసరికి విజయుడు కిటికీ తలుపులు తెరిచి వాణ్ణి చూసి, "ఎవరు నువు ?" అని అడిగాడు.

"హుజూర్, ఈ బంగళాలో ఉండే ఖాన్‌సామాను," అన్నాడు నిజాముద్దీన్ వాడు రాత్రి బయటికి వెళ్ళినందుకు క్షమాపణ చెప్పుకున్నాడు.

"టీ తీసుకురా అవతలి గదిలో మేమ్‌సాబ్ బయటికి రాగానే ఛోటాహాజ్రీకి ఆర్డ రిస్తాను." అన్నాడు విజయుడు. అతను మొహం కడుక్కుంటూఉంటే ఖాన్‌సామా వరండాలో టీ ఏర్పాట్లు చేశాడు.

మరో అరగంటకు సుశీ లేచి, స్నానం చేసి, ఎనిమిదిగంటలు కావస్తుండగా వరండాలో కొచ్చింది. టీబల్లదగ్గి రున్న ఖాన్‌సామాను, "వా రేరీ ?" అన్నది.

"అరగంట క్రిందట స్టేషనుకు వెళ్ళారు," అన్నాడు ఖాన్‌సామా వాడు ఛోటా హాజ్రీ తెస్తానని వెళ్ళాడు

సుశీ బల్లదగ్గిర కూర్చుని, ఒకవేళ విజయుడు ఏ రైలైనా ఎక్కిఉంటాడా అనుకుని, అత నలా చెయ్యడని రూఢి చేసుకున్నది. ఆమె టాఛోహాజ్రీ తింటూం




డగా విజయుడు తిరిగి వచ్చి, "గుడ్‌మార్నింగ్, నిద్ర పట్టిందా? తలనొప్పి రాలేదు గదా?" అని అడిగాడు.

"నిద్ర పట్టింది. ఐదింటికే లేచారట, ఎక్కడికి కెళ్ళారు?" అన్న దామె.

"కారు ఎంతకీ రాకపోతే స్టేషనుకు వెళ్ళి కూలీలను పంపాను."

విజయుడి ఆలోచన మధ్యాహ్నంకల్లా మోటారు బాగుచేసి జబల్పూరుకు తిరిగి పోవచ్చునని. కాని మోటారుకు పెద్ద రిపేరు రావ్యాపకంలో చిక్కింది.

సుందర్‌సింగు కారును ఎద్దులబండికి కట్టి లాగించుకుంటూ వచ్చాడు వెంట స్టేషను కూలీలు కూడా ఉన్నారు. వాళ్ళు కారును గేటువద్ద ఎద్దులబండినుంచి విప్పి బంగళా ఆవరణలోకి తీసుకువచ్చారు. విజయుడు వాళ్ళకు డబ్బు లిచ్చి పంపాడు.

కారుకు పెద్ద మరమ్మతే ఉన్నదనీ, జబల్పూర్ ఫోర్డులో ఉండే పీటర్ అనే మెకానిక్‌ను పిలిపిస్తే బాగుంటుందనీ సుందర్‌సింగ్ అన్నాడు.

"కారును బంగళా గరాజ్‌లో ఉంచి, నీవు బజారుకు వెళ్ళి భోంచేసి, ఒంటి గంట బండిలో జబల్పూరు వెళ్ళి పీటర్‌ను వెంటబెట్టుకురా," అన్నాడు విజయుడు.

వాళ్ళిద్దరూ టీ తాగి ప్రశాంతంగా ఉన్న స్టేషన్ ప్లాట్‌ఫారంమీద కబుర్లు చెప్పుకుంటూ షికారు చేశారు.

రాత్రి భోజన మైన తరవాత విజయుడు తన గదిలోకి వెళ్ళి దుస్తులు మార్చి ధోవతి కట్టుకు వచ్చాడు.

ఇద్దరూ బయట కూర్చుందా మనుకుంటుండగా టెలిగ్రాం వచ్చింది. విజయుడికి సుందర్ సింగ్, పీటరుకు మూడురోజులదాకా తీరదనీ, బేహరా బయలుదేరి వస్తున్నాడనీ తంతి ఇచ్చాడు.

నిజాముద్దీన్ రెండు పడకకుర్చీలు తెచ్చి బయట వేస్తూ, రాత్రికి తనకు సెల వివ్వమని విజయుణ్ణి కోరాడు. విజయుడు సరేనన్నాడు. అతను సుశీతో. "ఏం చేస్తాం మూడు రోజు లిక్కడ ? కారును రైలెక్కించి మనం జబల్పూరు పోదామా?" అన్నాడు.

"వద్దు విజయబాబూ. మళ్ళీ అదేబంగళాలోనా ?" అన్నది సుశీ.

"సరే, అయితే ఇక్కడే ఉందాం."

ఒక పావుగంటసేపు ఎవరి ఆలోచనలో వా రుండిపోయారు. సుశీ ఏడుస్తున్నట్టు విజయుడు గ్రహించి, ఆమెకేసి చూసి, "ఏమి టది, సుశీలా ? ఏడవటం దేనికీ ? వెళ్ళిపోయినవాడికోసమా ? అత నందుకు తగడు, విశ్వాసఘాతకుడు !" అన్నాడు.

"అందు కేడుస్తానా ?"

"మరెందుకు, సుశీలా ? చెప్పవూ ?"

"రెండురోజులుగా మీ జీవితమంతా తల్లకిందులు చేశాను. మీ కెంతశ్రమ ఇచ్చాను! ఇంకెంత ఇస్తానో అని తలుచుకుంటే ఏడు పొచ్చేసింది."

"ఎందు కొచ్చిన ఆలోచన లివి! సమయానికి దగ్గర ఉండి, కాస్త ఆదుకున్నావు. నే నుండగా నీకేచిక్కూ రాదని నమ్ము సుశీలా !"

"ఇవాళ నన్ను ఒకేతీరున సుశీల అని పిలుస్తున్నా రేమిటి ?"

విజయుడు చకితుడై, "అన్నట్టు నీపేరు సుజన్నా కాదూ ?" అన్నాడు.

"ఇకనుంచీ నాపేరు సుశీలే — మీరు పెట్టినపేరు." అన్నది సుశీ.

## 7

మర్నాడు విజయుడు నిద్ర లేచి తలుపులు తెరిచేసరికి, వరండాలో సామాన్లు పేర్చిఉన్నాయి. లక్ష్మణబేహరా ఎర్రకంబళిమీద పడుకుని నిద్రపోతున్నాడు. విజయుడతన్ని పిలిచి లేపాడు.

తాను రాత్రి రెండుగంటల బండిలో వచ్చా ననీ, జబల్పూరు డాక్‌బంగళాలో బిల్లు చెల్లించిన రశీదు తెచ్చా ననీ బేహరా అన్నాడు. విజయుడు బంగళాలో మూడున్నరరోజు లున్నాడు, పాల్‌దంపతులు ఎనిమిదిరోజు లున్నారు. రెండు బిల్లులకూ రశీదు ముట్టింది. అందుకే బేహరా సుశీ సామాన్లుకూడా తీసుకురాగలిగాడు.

ఖాన్‌సామా విజయుడికోసం టీ పెట్టేసి వెళ్ళిపోగానే. సామాన్లు లోపల సర్దుతున్న బేహరా బయటికి వచ్చి, "హుజూర్, 'ఒక రహస్యం. పాల్‌సాబ్ ఎక్కడికీ వెళ్ళలేదు. జబల్పూరులోనే ఉన్నాడు," అన్నాడు.

"ఎవరు చెప్పారు ?" అని విజయు డాశ్చర్యంతో అడిగాడు

"నా కళ్ళతో నేనే చూశాను. నిన్న సుందరుసింగు అక్కడికి తిరిగివచ్చి, తొమ్మిదిగంటల బండిలో సామాన్లతోసహా బయలుదేరమని చెప్పాడు. నేను బజారుకు వెళ్ళి భోజనం చేసి తిరిగివస్తుంటే, ఎనిమిది గంటలప్పుడు, పాల్‌సాబ్ సారాదుకాణంనుంచి తూలుతూ బయటికి రావటం కనబడింది. నా కళ్ళను నేనే నమ్మలేక।ఆయనవెంట నడిచి వీధిదీపంవెలుతురులో స్పష్టంగా చూశాను: పాల్‌సాబే!"

"ఆయనకు నువు కనిపించావా ?"

"ఆయన తూలుతూ, పాడుకుంటూ పోతున్నాడు. నన్ను చూడలేదు. కోచ్ బళ్ళుండేచోటికి పోయి బండిని రమ్మంటే బండివాడు డబ్బున్నదా అని అడిగాడు. ఆయన కోటుజేబు ఆడిస్తే రూపాయలు గలగల్లాడాయి. బండి పోర్టు కేసి వెళ్ళింది. నేను బంగళాకు వచ్చాను."

"సరే. ఈమాట ఇప్పు డెవరికీ చెప్పకు," అన్నాడు విజయుడు.

అతను సిగిరెట్టుమీద సిగిరెట్టు వెలిగిస్తూ తీవ్రంగా ఆలోచించాడు. పాల్ జబల్పూరులోనే ఉన్నాడన్నమాట. సుశీ అతన్ని ముఖాముఖి చూడాలన్నది. ఆమెను జబల్పూరు తీసుకుపోతే? తీసుకుపోతే ఆమెకు మరో అవమానం జరుగుతుందేమో ?...

సుశీ స్నానం చేసి బయటికి వచ్చింది. విజయుడు కుర్చీలోనుంచి లేచి, చెయ్యి చాచి, 'గుడ్‌మార్నింగ్' అన్నాడు.

సుశీ అతని చెయ్యి అందుకుని, 'గుడ్‌మార్నింగ్' అన్నది. బేహరా తన సామానులుకూడా తీసుకుని వచ్చాడని తెలిసి ఆమె లోపలికి వెళ్ళి తన వస్తువులు చూడసాగింది. విజయుడు ఛోటాహాజ్రీ పట్టుకురమ్మని బేహరా ద్వారా ఖాన్ సామాకు కబురు చేశాడు.

ఛోటాహాజ్రీ వచ్చింది. భోజనం చేస్తూ వా రిద్దరూ ఎవరి ఆలోచనలో వా రున్నారు.

తాను ఒక్కడే వెళ్ళి పాల్‌తో మాట్లాడితే ఎలా ఉంటుంది? పాల్ తన భార్యను ఏలుకుంటా నంటేమాత్రం ఆమె ఏం సుఖపడుతుంది ? అన్న వస్త్రాల కోసం భర్తకింద పడిఉండటాని కామె హిందువుకాదు. చదువుకున్న మనిషి. ఏ ఆడపిల్లల బడిలోనో పంతులమ్మపని చేసుకోవచ్చు. పాల్‌వంటి నీచుడితో

కాపరంకన్న అదే మేలు. కాని పని దొరికేదాకా ఎక్కడ ఉంటుంది? తమ యింట్లో ఉంటే? బకురాణి ఒప్పుకుంటుందో ఒప్పుకోదో? ఇలా ఆలోచిస్తున్నాడు విజయుడు.

"విజయబాబూ, ఓసారి ఇలా వస్తారా?" అని సుశీ పిలిచేసరికి విజయుడామె కంఠస్వరానికి ఉలికిపడి లోపలికి వెళ్ళాడు, "ఏమయింది?" అంటూ.

బల్లమీద తెరిచివున్న పెట్టెవద్ద నిలబడి, "ఇందులో ఉండే నా నెక్‌లెస్ కనిపించటంలేదు. ఎవరో కాజేశారు?" అన్నది

"ఎవరు?" అన్నాడు విజయుడు.

"ఇంకెవరు?" ఆయనే! అది మా అమ్మది; చనిపోతూ నా కిచ్చింది. దాన్నికూడా ఎత్తుకుపోయాడు." అంటూ సుశీ ఏడవసాగింది. అది తనభర్త చేసినపనే ననటానికి ఆమెకు ఆధారం ఉన్నది పాల్ వెళ్ళిపోయేరోజు సాయంకాలం టీ తాగేటప్పుడు, చేతిరుమాలుకు సెంటు రాచుకుంటానని ఆమె తాళంచెవి అడిగి పుచ్చుకున్నాడు. అప్పుడే అతను నెక్‌లెస్ హరించిఉండాలి

"పోలీసులకు దొరికేపని చేశాడే!" అన్నాడు విజయుడు.

"పోలీసులకు చెబితే ఆయన్ను పట్టుకుని, జైల్లో పెడతారా విజయబాబూ?" అన్నది సుశీ.

"ఆయన దొరకాలి, నేరం రుజువుకావాలి."

"అయితే పోలీసులకు రిపోర్టియ్యండి. ఆ సైతాన్ను జైల్లో పడవియ్యండి నా జీవితమంతా ధ్వంసం చేసినవాడి కదే తగినశిక్ష"

"నిజమేకాని, ఇందులో ఇంకా తిరుగుళ్ళున్నాయి. నే చెప్పినదంతా విన్నముదట ఏం చెయ్యాలో ఆలోచింతాం. వరండాలో కూచుని మాట్లాడుకుందాం"

సుశీ రుమాలుతో కళ్ళు తుడుచుకుని, పెట్టె మూసేసింది.

ఇద్దరూ వరండాలో కుర్చీలలో కూర్చున్నారు

"చూడు, సుశీలా; పాల్ బొంబాయి వెళ్ళలేదు జబల్పూరులోనే ఉన్నాడు. నిన్నరాత్రికూడా అక్కడ కనిపించాడు.' అన్నాడు విజయుడు.

"ఉన్నాడా? ఎవరు చెప్పారు?"

"లక్ష్మణ బేహరా ఆయన్ని చూశాడు." అంటూ విజయుడు తనతో బేహారా చెప్పిన వివరాలన్నీ ఆమెకు చెప్పాడు

"ఇంకేం, నెక్‌లెస్ అమ్మేసి డబ్బు జేబులో వేసుకున్నాడు. ఆరునెల్ల ఈ మధ్య ఆయన జేబులో రూపాయలు గలగల్లాడిం దెప్పుడు?" అన్నది సుశీ ఆమె కళ్ళ

వెంట మళ్ళీ అశ్రుధార బయలుదేరింది. "నా నెక్‌లెస్ నాకు దొరికే ఉపాయం ఏమీ లేదా, విజయబాబూ?" అన్నదామె.

"పోలీసుల సహాయంతో దొరికితే దొరకవచ్చు. కాని పాల్ జైలుకు పోవలసి వస్తుంది."

"ఆయన కదే జరగాలి."

"అయినా ఆయన నీ భర్త నువే సాక్ష్యం ఇచ్చి ఆయనను జైలుకు పంపటమంటే —"

"చాలా తప్పా?" భర్త దేవుడనుకోవటానికీ, ఆయన చంపినా ఊరుకోవటానికీ నేను హిందూస్త్రీని కాను, విజయబాబూ!"

"నే నలా అనలేదు. ఆయన పశ్చాత్తాపపడి క్షమాపణ చెప్పుకుంటే మీ కిద్దరికీ రాజీ కుదరవచ్చు."

"క్షమించండి విజయబాబూ. ఇక రాజీ అన్నది లేదు; జరిగింది చాలు. ఒక సారి గోతిలో పడ్డాను. ఇంకోసారి పడను."

"ఆయన చెయ్యవలసిన అపకార మేదో చెయ్యనే చేశాడు. కేసు పెట్టిన మాత్రాన అది పోదు. పత్రికలలో రిపోర్టులూ, అపఖ్యాతీ, అపహాస్యంపాలు కావటమూ తప్ప ఇంకేమీ ఉండదు."

పత్రిక అనేసరికి సుశీ కొంచెం తగ్గి, "పోనీ, మి కిష్టంలేకపోతే మానేద్దాం. అయితే ఆయన ఇంకా జబల్పూరులోనే ఉన్నా డంటారా?" అన్నది

"వెళ్ళి చూద్దామా?"

"అందుకే బెంగపెట్టుకుని ఉన్నాను."

సుశీ కొంచెం ఆగి, "ఏమి టాలోచిస్తున్నారు?" అన్నది.

"పాల్ జబల్పూరులోనే ఉంటే నేను వెళ్ళి నెక్‌లెస్ సాధించుకు రాగలనా?" అని ఆలోచిస్తున్నాను.

సుశీ మనసు కృతజ్ఞతతో నిండిపోయింది. ఇద్దరూ ఆ విషయమే మాట్లాడుకున్నారు.

విజయుడు ఒంటిగంట బండిలో జబల్పూరు బయలుదేరాడు

"నెక్‌లెస్ దొరికినా, దొరక్కపోయినా మీరు త్వరగా తిరిగిరండి," అన్నది సుశీ.

"సాధ్యమైతే రేపే వస్తాను. ఏపరిస్థితిలోనూ ఎల్లుండి దాటదు," అన్నాడు విజయుడు.

మధ్యాహ్నం భోజనా లయ్యాక ఖాన్‌సామా నిజాముద్దీన్ సుశీకోసం ఒక ఆయాన

తెచ్చాడు ఆమె కొక ఆయాను ఏర్పాటుచేస్తే సౌకర్యంగా ఉంటుందనుకుని విజయుడు ఆరోజు ఉదయమే నిజాముద్దీన్‌ను హెచ్చరించాడు. నిజాముద్దీన్ తెచ్చిన ఆయా పేరు అమీనా. ఆమె హైదర్ అనే రైల్వే పనివాడి చెల్లెలు.

"మేమ్‌సాబ్‌కు పిల్లలెందరు ?" అని అమీనా అడిగింది.

"ఇంకా పెళ్ళి కాలేదు. ప్రస్తుతం మనిద్దరిలాగే వాళ్ళు ఉన్నారు. పెళ్ళిమాట నిశ్చయమయిందిట. కలకత్తా వెళ్ళి చేసుకుంటారుట. చాలాకాలంగా ఒకరినొకరు ప్రేమిస్తున్నారుట. వాళ్ళ పెళ్ళికి మేమ్‌సాబ్ తండ్రి మొదట అభ్యంతరం చెప్పాట్ట. మేమ్‌సాబ్ తల్లిదగ్గర ఏడిస్తే చివరకు తండ్రి సరేనన్నాట్ట. ఇద్దరూ దేశయాత్ర చేస్తున్నారు. ఇంకోనెలలో వాళ్ళు కలకత్తా వెళ్ళి పెళ్ళి చేసుకుంటారు," అన్నాడు నిజాముద్దీన్.

నిజానికి ఇది అతని కల్పనకాదు అతను గుచ్చి గుచ్చి అడిగితే లక్ష్మణబేహరా ఈ కట్టుకథ చెప్పి తృప్తి కలిగించాడు.

సుశీ స్టేషనుకు వెళ్ళి విజయుణ్ణి ఒంటిగంట బండి ఎక్కించి, తిరిగివచ్చి తన గదిలో పడకకుర్చీలో చేరగిలబడి, కళ్ళు మూసుకుని కంటతడి పెట్టుకోసాగింది. కొంతసేపయాక తన నెవరో తాకినట్టయి, సుశీ కళ్ళు తెరిచి ఆయాను చూసింది. ఆమె కాలిజోళ్ళు మారుస్తా నన్నది ఆయా. సుశీ సరే నన్నది.

"మేమ్‌సాబ్ !"

సుశీ కళ్ళు తెరిచింది.

"దిగులుపడకండి మేమ్‌సాబ్. భర్తలు ఎక్కడికీ వెళ్ళకుండా జరుగుతుందా," అన్నది ఆయా.

సుశీ కళ్ళు పెద్దవి చేసి, "భర్త ఎవరు ?" అన్నది.

"క్షమించండి. ఇంకా మీరు భార్యాభర్తలు కాలేదని నాకు తెలుసు ననుకోండి. ఇవాళ కాకపోతే రేపు కారా ? ముల్లా వచ్చి కల్మా చదవనంతమాత్రాన మీరు భార్యాభర్తలు కాకపోతారా, మేమ్‌సాబ్ ? అల్లా ఒకరిమీద ఒకరికి ప్రేమ ఎప్పుడైతే కలిగిస్తాడో అప్పుడే వారు భార్యభర్తలు," అన్నది ఆయా

## 8

జబల్పూరులోని పంజాబీల సత్రంలో సుందర్‌సింగు తన భోజనం తయారు చేసుకుంటూ, నీళ్ళకోసం వీధిపక్కన ఉన్న కుళాయి దగ్గిరికి వచ్చేసరికి, ఎవరో అతన్ని పేరుపెట్టి పిలిచారు. అతను తలఎత్తి చూసేసరికి పాల్, చేతిలో బాగూ, నోట్లో సిగిరెట్టూ పట్టుకుని, నవ్వుతూ ప్రత్యక్ష మయ్యాడు. బేహరా పాల్‌ను

చూసినాక తిరిగి సుందరుసింగును కలవలేదు. అందుచేత సుందరుసింగుకు పాల్ జబల్పూరులో ఉన్న సంగతి తెలియదు.

"సాబ్, మీరు బొంబాయి వెళ్ళలేదా ?" అన్నా డతను.

పాల్ సుందరుసింగుద్వారా అన్ని సంగతులూ తెలుసుకున్నాడు. తాను మెకానిక్ పీటరును సోహాగ్‌పూరు తీసికునిపోయి కారు మరమ్మతు చేయించాలనీ. కారు బాగయాక విజయుడు జబల్పూరు వస్తాడో, తిన్నగా కలకత్తాకే వెళతాడో తనకు తెలీదనీ సుందరసింగు పాల్‌తో అన్నాడు.

పాల్‌కు ఉండటానికి సరయిన చోటు దొరుకలేదు. తాను పారిపోయి దాక్కున్న మర్నాడు విజయుడూ, సుశీ కారులో వెళ్ళినట్టు విని అతను నవ్వుకున్నాడు. అతను డాక్‌బంగళాకు వెళదా మనుకున్నాడు గాని, వా ళ్ళిద్దరూ ఏ క్షణాన తిరిగివస్తారో అని భయపడ్డాడు. వాళ్ళు మరిమూడురోజులదాకా రారని ఇప్పుడు రూఢిగా తెలియటం చేత, అతనా సాయంకాలం నిశ్చింతగా తన సామానుతో డాక్‌బంగళాకు వెళ్లాడు.

"సాబ్ ఎన్నా ళ్ళుంటారు ?" అని ఖాన్‌సామా అడిగాడు.

"ఒక్కరోజు. రేపు సాయకాలం బండికి వెళ్ళిపోతాను "

"మీరు ఎనిమిది రోజుల ఎకౌంటు ——

"ఆ బిల్లుపైకం బోసుగారి కిచ్చానే ! ముట్టలేదా ?"

"ముట్టిందిలెండి. వారి జేబులోనుంచి ఇచ్చినట్టు విన్నాను."

"వారి జేబైతే నేం, నాదైతే నేం ? ఆయన నా మిత్రుడు."

"అదేమో. మీ రీసారి డబ్బు అడ్వాన్సుగా ఇవ్వవలిసిఉంటుంది "

పాల్ దర్పంగా పదిరూపాయల నోటు తీసి కింద పారేస్తూ, "మిగిలిన డబ్బుతో ఒక్క విస్కీబుడ్డీ, అరడజను సోడాలూ తెప్పించు." అన్నాడు.

అయిదుగంట లయింది. పాల్ విస్కీబుడ్డి తెరుస్తూండగా ఒకబండి బంగళా ఆవరణలోకి వచ్చింది అందులోనుంచి విజయుడు దిగాడు. ఖాన్‌సామా వచ్చి సలాం చేసి నిలబడ్డాడు

సుందర్‌సింగుకోసం అర్జంటుగా మనిషిని పంపమనీ, టీ తీసుకురమ్మనీ ఖాన్‌సామాకు చెప్పి, విజయుడు కోటు విప్పి గదిలో కొక్కానికి తగిలించి, పడక కుర్చీలో పడుకుని, పాల్‌ను పట్టుకుని, అతను నెక్‌లెస్ ఎవరి కమ్మాడో తెలుసుకోవడం గురించి ఆలోచించాడు.

ఖాన్‌సామా పళ్ళెంలో టీ, టోస్టూ, వెన్నా మొదలైనవి తెచ్చి అతని ముందు పెట్టి, సుందర్‌సింగును పిలుచుకురావటానికి మనిషిని పంపినట్టు చెప్పాడు.

విజయుడు టీ కలుపుకుని తాగుతూ, "పాల్‌సాబ్ బొంబాయి వెళ్ళలేదుట. ఇక్కడే ఉన్నాట్ట. ఎక్కడున్నదీ నీకు తెలుసా ?" అని ఖాన్‌సామా నడిగాడు.

"జీ హుజూర్ ! ఇక్కడే—ఈ బంగళాలోనే—ఉన్నారు !"

"ఈ బంగళాలోనే ? ఎప్పు డొచ్చాడు."

"మీరు వచ్చేముందే."

"ఏం చేస్తున్నాడు ?"

"వెనకటి గదిలోనే విస్కీ తాగుతున్నారు రేపు సాయంకాలం బండికి బొంబాయి వెళతారుట "

విజయుడు మొహం చిట్లించి, "ఖాన్‌సామా, నేను టీ తాగేదాకా వరండాలో నిలబడి, అతను వెళ్ళిపోకుండా చూడు," అన్నాడు. అతను టీ తాగటం పూర్తిచేసి వరండాలోకి వెళ్ళి, "ఆయన ఈ పూట బయటికి పోతాదేమో కనుక్కురా. నామాట మాత్రం చెప్పకు," అన్నాడు.

ఖాన్‌సామా పాల్ గదిలోకి వెళ్ళివచ్చి, పాల్ ఎక్కడికీ వెళ్ళటంలేదని విజయుడితో చెప్పి, ఖాళీ ట్రే తీసుకుని వెళ్ళిపోయాడు.

బంగళాలో దీపాలు వెలిగించారు. సుందర్‌సింగు వచ్చాడు. అతన్ని తన గదిముం దుండమని చెప్పి, విజయుడు పాల్ గదిలోకి వెళ్ళాడు. పాల్ పైప్ కాలుస్తూ, విస్కీ తాగుతూ, దీపందగ్గిర కూర్చుని ఏదో పుస్తకం చదువుతున్నాడు.

"హలో, పాల్ ! ఇక్కడున్నావేం ?" అన్నాడు విజయుడు

పాల్ విజయుణ్ణి చూసి ఉలికిపడి, "ఓ హల్లో, మిష్టర్ బోస్ !" అంటూ లేవబోయి తూలాడు. నోట్లోనుంచి పైపు జారి కిందపడింది.

"బొంబాయి వెళ్ళలేదేం ?" అని విజయు డడిగాడు.

"వెళ్ళటం పడలేదు, మహాశయా !" అన్నాడు పాల్ దీనంగా.

విజయుడు కుర్చీ లాగి కూర్చున్నాడు.

"మీరు సోహాగ్‌పూర్‌లో లేరా ?"

"వచ్చి అరగంట అయింది."

"సు — సు — సు — "

"మిసెస్ పాల్ సోహాగ్‌పూర్‌లోనే ఉన్నారు. నేను అర్జంటుపని ఉండి వచ్చాను. ముందు నీ విశేషాలు చెప్పు. బొంబాయి వెళుతున్నానని ఆమె కెందు కబద్ధ మాడావు ?"

"టైముండిగదా అని రిఫ్రెష్మెంట్ రూమ్‌కు వెళ్ళి బండి మిస్ చేశాను "




"తరవాత రెండురోజులూ కూడా వెళ్ళలేదే ?"

"డబ్బు లేకపోయింది."

"అదేమిటి? ఈ రెండురోజులూ నీ జేబులో రూపాయలు గలగల్లాడుతూనే ఉన్నాయే ?"

పాల్ తన జేబులోనుంచి పదిరూపాయల్ల నోటూ, కొంత చిల్లరా తీసి బల్లమీద పెట్టి "ఇదే నాకున్న సర్వస్వం. రూపాయ లెక్కడినుంచి వస్తాయి, మిస్టర్ బోస్!" అన్నాడు.

"నెక్ లెస్ అమ్మిన డబ్బంతా అప్పుడే అయిపోయిందా," అన్నాడు విజయుడు. అతనిమాటలు తన కేమీ అర్థం కానట్టు నటించాడు పాల్.

"నీ భార్య నెక్ లెస్ ఎత్తుకుపోయి అమ్మినసంగతి నాకు తెలీ దనుకున్నావా ?"

"నా భార్యకు నెక్ లెస్ ఎక్కడిది? మా స్థితి ఎలాటిది! ఒకజత చెవిపోగులు కొనిపెట్టలేకపోయాను. నెక్ లెస్ కొనగలనా ?"

"పాల్, నే నిక్కడికి వచ్చినపని చెబుతాను విను. నీమీద పోలీసు రిపోర్టివ్వటానికి వచ్చాను నువు నీ భార్యకు బండివాడి ద్వారా చీటీ పంపినప్పుడు నీ దగ్గిర బండికాడుగ డబ్బులుకూడా లేవని రాశావు. ఆ తరవాత నీ జేబులో డబ్బు గలగల్లాడింది. ఇంతకుముందు ఖాన్ సామాకు నోటిచ్చి విస్కీబుడ్డి తెప్పించావు. ఈ సంగతు లన్నీ ఇక్కడే రుజువు చేయించి నిన్ను పోలీసులకు హాండోవర్ చేస్తాను... సుందర్ సింగ్ !"

సుందర్ సింగ్ వచ్చాడు. విజయు డతన్ని తన రైటింగ్ పాడ్, కలమూ తెమ్మని

ఏదో రాయ నారంభించాడు. భయంతో పాల్ నిషా దిగిపోయింది. అలా వెళ్ళి అరగంటలో వస్తా నని పాల్ వెళ్ళబోయాడు.

"ఇన్‌స్పెక్టర్ వచ్చాక ఆయన అనుమతిస్తేనే నువ్వెక్కడికైనా వెళ్ళేది." అంటూ విజయు డతన్ని బలవంతాన కుర్చీలో కూర్చోబెట్టి, "లేచావంటే సుందర్ సింగుచేత నీ కాళ్ళూ, చేతుల్లూ అంటగట్టేయిస్తాను." అన్నాడు.

పాల్ నిట్టూర్చి విస్కీ గ్లాసులో పోసుకుని తాగుతూ, "బోస్, నామీద రిపోర్టివ్వకు. అందువల్ల నీకూ, సుశీకీ చాలా నష్టం" అన్నాడు.

"అదివరకు చేసిన నష్టంగాక కొత్తగా ఏం చెయ్యగలవు ?"

"సుశీకి ఎంత అపకీర్తి ! మీ ఇద్దరిని గురించీ పత్రికల్లో వేయిస్తాను. నువ్వు నా పడుచుభార్యతో రాత్రిల్లా కారు ప్రయాణం చేశావు ? దేనికీ ? సోహాన్‌పూర్‌లో మీ రిద్దరూ ఒంటరిగా డాక్ బంగళాలో ఎందుకు గడిపారూ ? నన్ను పోలీసులకు పట్టిచ్చావంటే మీ సంగతంతా బైట పెడతాను. మీ ఇద్దరి చర్యా చూసి సహించలేకనే నేను నా భార్యను వదిలేశాను — అని చెబుతాను."

విజయుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది.

"పాల్, నీలాటి రాస్కెల్స్ తరఫునా, వారికి విరుద్ధంగానూ ఎన్నో కేసులు పట్టాను. నువ్విలా పేలితే ఏంజరిగేదీ నాకు తెలుసు. నిన్ను పోలీసుల కప్పగిస్తాను. నీ దగ్గర నెక్‌లెస్ కొన్నవాణ్ణి పోలీసులు పట్టుకుంటారు. నేనే నీపైన కేసు నడిపిస్తాను." అని అతను సుందర్‌సింగును పిలిచి "ఈ ఉత్తరాన్ని ఠాణాకు తీసుకుపోయి, ఇన్‌స్పెక్టర్‌గారితో దొంగ దొరికే డని చెప్పాలి. వెంటనే కోటు వేసుకుని రా." అన్నాడు

పాల్ కుర్చీలో వెనక్కు చేరగిలబడి నిట్టూర్చి, "మీకు సుశీమీద ప్రేమ ఉన్న దనుకున్నాను. పొరపా టయింది. మిస్టర్ బోస్, మీకు లేకపోయినా నా భార్యమీద నాకు ప్రేమ ఉన్నది. ఆమె చాలా మంచిపిల్ల కావలిస్తే మీరు సుశీని తీసుకోండి నాకున్న హక్కులన్నీ వదిలేస్తూ మీకు పత్రం రాసిస్తాను." అన్నాడు.

"సుశీ నా కవసరంలేదు ఆమెక్కూడా నామీద మోహంలేదు. ఆవిడ నెక్‌లెస్ ఎవరి కమ్మావో చెప్పు. చెప్పకపోతే ఈ రిపోర్టు పోలీసులకు చేరుతుంది."

"చెబితే నన్ను పోలీసుల కప్పగించరుగద ? అయితే బండీ తెప్పించండి; కొన్న మనిషిని చూపిస్తాను."

"ఎంత కమ్మావా నెక్‌లేస్‌ను ?"

"నూటయాభైకి. యాభై ముట్టాయి. మిగతా వంపా రే పిస్తానన్నాడు."

విజయుడు సుందర్ సింగును పంపి బండి తెప్పించి, అందులో పాల్ నెక్కించు కుని బజారుకు వెళ్ళాడు. అదృష్టవశాత్తూ కంసాలి దుకాణం ఇంకా తెరిచేఉంది. కానీ కంసాలి కొన్న ధరకు నెక్‌లెస్ అమ్మననీ. అదనంగా మరో వంద ఇయ్యా మనీ అన్నాడు.

"అది దొంగసొమ్ము. మంచిగా ఇవ్వకపోయావో పోలీసులకు రిపోర్టిస్తాను." అని విజయుడు భయపెట్టినమీదట ఆ దుకాణంవాడు యాభై రూపాయలూ తీసుకుని నెక్‌లేస్ ఇచ్చేశాడు.

అతను తిరిగి బంగాళా చేరేసరికి ఎనిమిదింబా వయింది. ఖాన్‌సామాను పిలిచి, రాత్రి బండికి వెళుతున్నా ననీ, తొమ్మిది కొట్టేసరికల్లా భోజనం పెట్టాలనీ చెప్పి. పాల్‌ను తన గదిలోకి పిలిచి, "ఇక నువ్వూ, సుశీ కలిసిఉండటం అసంభవమేనా? ఆమె నెందుకు వదిలావు?" అని అడిగాడు.

నేను విస్కీ తాగినప్పుడల్లా చివాట్లు పెడుతుంది. ఇదేకాదు. నేను సుశీని వదిలి పెట్టటానికి మరో కారణంకూడా ఉంది. అది రహస్యం. చాలా రహస్యం. సుశీకి కూడా తెలీదు. మా దేశంలో నాకు భార్య ఉంది. నా ఉద్యోగం పోయిందిగదా. దమ్మిడీ లేకుండా ఇద్దరు భార్యల నెలా పోషిస్తాను చెప్పండి."

విజయు డాశ్చర్యంతో, "నీ కింకో భార్యా ఉందా? చెప్పవేం? అవిడ నెప్పుడు పెళ్ళాడావు?"

పాల్ ఇకిలించి, గుడ్లుమిటకరిస్తూ, "నేను పెళ్లాడలేదు. మా పెద్దవాళ్ళు చేశారు. నా కప్పుడు పంచొమ్మిదేళ్ళు." అన్నాడు.

"ఆ భార్య బాగుందా?"

"పిడిరాయిలా గుంది. అది భార్యకాదు. రాక్షసి. ఆవిడ రాసిని ఉత్తరం చూడండి." అంటూ పాల్ జేబులోనుంచి ఒక కవరు తీసి ఇచ్చాడు. కలకత్తాలో కంపెనీపేర వచ్చిన ఆ ఉత్తరంమీద జబల్పూరు పోస్టుమాస్టరు కేర్ అని ఎర్రసిరాతో రాసిఉంది.

ఆ ఉత్తరం రాసిన మనిషి పేరు సోఫీ పాల్. మద్రాసులో ఒక పేటనుంచి రాసింది. తానూ, తన బిడ్డలూ తిండిలేక మాడుతున్నా మన్నీ, డబ్బు పంపమని బతి మాలుతూనూ, నిష్ఠురంగానూ గూడా రాసింది.

"నీ భార్య బతికుండగానే మరో పెళ్ళి చేసుకున్నావేం?" అని విజయుడు పాల్ నడిగాడు.

"ఎందుకు చేసుకున్నానా? నా భార్య పరమగయ్యాళి. ఒకనాడు నన్ను కాలి జోడుతో కొట్టింది."

"తగాదా కారణం?"

"తాగొచ్చానని అది జరిగిన మర్నాడే రైలెక్కి కలకత్తా వెళ్ళి, ఉద్యోగం సంపాదించి, సుశీని చూశాను. బెంగాలీ స్త్రీలు భర్తలను భక్తిగా చూస్తారని తెలిసి, సుఖపడదామన్న ఆశతో సుశీని పెళ్లాడాను. కాని సుఖం లేకపోయింది. మహాశయా!"

పాల్‌ను చూస్తే విజయుడికి నవ్వొచ్చింది; జాలికూడా కలిగింది.

"క్రైస్తవులు పెళ్ళిమీద పెళ్ళి చేసుకుంటే చట్టం ఒప్పదు. నిన్ను సుశీ జైలుకు పంపిస్తే?" అన్నాడతను.

"అసలైన క్రైస్తవులు రెండు పెళ్ళిళ్ళు చేసుకోరాదన్నది నిజమే. కాని మేం హిందూక్రైస్తవులం. మా జాతివాళ్ళు గుడికి వెళ్ళి పూజ చేస్తారు. ఆదివారంనాడు చర్చికి వెళతారు. బొట్టు పెట్టుకుంటారు." అన్నాడు పాల్.

"మీకు జరిగింది క్రైస్తవ వివాహమేనా?"

"అవును"

"ఏ చర్చిలో?"

"మద్రాసు బాప్టిస్టు చాపెల్‌లో. 1907 నవంబరు 6న. అయినా మేం హిందూ క్రైస్తవులం కావటంచేత ఎన్ని పెళ్ళిళ్ళయినా చేసుకోవచ్చు."

"లాభంలేదు పాల్. మీరు బొట్లు పెట్టుకున్నా, గుళ్ళకు వెళ్ళినా చట్టం బాధించదుగాని, పెళ్ళిమీద పెళ్ళిమటుకు చెల్లదు."

పాల్ భయపడ్డాడు. అతను విజయుడి చెయ్యి పట్టుకుని, ఈసంగతి సుశీకి చెప్పవద్దనీ తనను జైలుకు పంపవద్దనీ బతిమాలుతూ, బావురుమన్నాడు. విజయుడతనికి అభయమిచ్చి, వెళ్ళిపడుకోమన్నాడు. పాల్ వెళ్ళిపోయాడు.

విజయుడు పాల్ మొదటిపెళ్ళి జరిగిన తేదీ వగైరాలు గుర్తుగా రాసుకుని, భోజనం చేసి, తొమ్మిదీయాభైఆరు బండికి సోహాగ్‌పూర్ బయలుదేరాడు.

## 9

రాత్రి రెండున్నరగంటలప్పుడు ఆయాఅమీనా సుశీని లేపి, "సాబ్ వచ్చారు!" అని చెప్పింది. సుశీ పక్కమీదనుంచి లేచి జుట్టూ, బట్టా సవరించుకుని విజయుడి గదికి వెళ్ళేసరికి, బేహరా టీ కాచటానికి స్టౌ వెలిగిస్తున్నాడు.

"నీకు నిద్రాభంగం కాకూడదని ఎంతో జాగ్రత్తపడ్డాను. లేవనేలేచావే?" అన్నాడతను.

"ఏమయింది విజయ్?" అన్నదామె

విజయుడు జేబులోనుంచి నెక్‌లేస్ తీసి సుశీమెడలో పెట్టాడు. సుశీ ఆనందానికి మేరలేదు "మొత్తానికి తెచ్చారే? ఎలా తెచ్చారో చెప్పరూ?" అన్నది. ఆమెను కూర్చోబెట్టి విజయుడు తాను చెప్పదలచుకున్నదంతా చెప్పాడు.

సుందర్‌సింగు పీటరును వెంటబెట్టుకుని జబల్పూరునుంచి రాగానే కారురిపేరీ ఆరంభమయింది.

విజయుడు సుశీ భవిష్యత్తు గురించి చాలా మాట్లాడాడు, కాని పాల్ మొదటిపెళ్ళి గురించి ఏమీ చెప్పలేదు. పాల్ అబద్ధమాడవలసిన కారణ మేమీలేదు. అయినా ఆపెళ్ళి అయినట్టు నమ్మకంగా తెలిసేదాకా సుశీకి చెప్పటం అంత మంచిదికాదనిపించింద

*　　　*　　　*　　　*

విజయుడు తన భార్యకు ఉత్తరం రాస్తుండగా ఆయా వచ్చి సుశీ రమ్మంటున్నదని చెప్పింది. ఉత్తరం రాయటం ఆపి, ఇల్లు కదిలి రావటం పొరపాటయిం దనుకుని క్షణంసేపు చింతించి, అతను లేచి సుశీవద్దకు వెళ్ళాడు

"నాకోలా అనిపిస్తున్నది." అన్నది సుశీ. ఇద్దరూ కూర్చున్నాక "ఈ స్థితిలో నేను వచ్చి మీ యింట ఉండటం బాగుంటుందా అని! నా మనస్సు అయోమయంగా ఉంది."

అతని మనస్సూ అయోమయంగానే ఉంది. ఆమె వచ్చి తనయింట ఉంటే తనవాళ్ళెవరైనా ఆమెను అవమానపరచవచ్చు. ఠకురాణీ అలా ఎన్నటికీ చెయ్యదు. కాని ఇంట్లో ఉన్న ఇతరులమాట? దిక్కులేక తమఇంట తలదాచుకున్న మనిషిని ఆడవాళ్ళు తమకన్న హీనంగా చూడటం సహజం.

"ఇంకెక్కడికి పోదా మనీ?"

"బర్మాలో మా చిన్నాన్న ఉన్నారు; వీలుంటే అక్కడికి పోదా మని. కలకత్తా చేరాక ఆయనకు ఉత్తరం రాస్తాను."

"సొంత దేశాన్నీ, సొంత మనుషులనూ విడిచి బర్మా పోవట మేమిటి? పెళ్ళికి ముందు మీ నాన్నగారి స్నేహితుడింట ఉన్నట్టు చెప్పావే? ఆయన పే రేమిటి? ఎక్కడుంటారు?"

"జోసెఫ్ చౌధరీ. జోడాగిర్జా దగ్గరలో ఉంటారు."

"అక్కడికి వెళ్ళి కొంతకాలం ఉంటే ?"

"వెళ్ళి వాళ్ళతో ఏం చెప్పను ?" అన్నది సుశీ వాడిపోయిన ముఖంతో.

"ఒకపని చేద్దాం కలకత్తా చేరగానే నువు గ్రేట్ ఈస్టర్న్ హోటల్లోనో, స్పెన్సర్ హోటల్లోనో దిగుదువుగాని. నేను జోసెఫ్ చౌధురీగారివద్దకు వెళ్ళి సంగతంతా చెబుతాను. తరవాత విషయం తరవాత ఆలోచింతాం."

సుశీకి ఈ ఆలోచన బాగా నచ్చింది.

వా రిద్దరూ టీ తాగుతూండగా గరాజ్‌నుంచి మోటారుఇంజను ఆడిన చప్పుడు వినిపించింది విజయుడికి చాలా ఉత్సాహం వచ్చింది. సుందర్‌సింగ్ కారును గరాజిలోనుంచి వరండా మెట్లదగ్గిరికి తీసుకువచ్చి, "బండి బాగయింది. హుజూర్," అన్నాడు.

*　　*　　*　　*

బొంబాయి మెయిలు హౌరా స్టేషను చేరింది. సుశీ, విజయుడూ అందులో నుంచి దిగారు.

"మీకోసం ఎవరూ స్టేషనుకు రాలేదేం ?" అన్నది సుశీ.

"నేను వస్తున్నట్టు ముందుగా ఇంటికి కబురు చెయ్యలేదు," అన్నాడు విజయుడు. అతను తన సామానంతా లక్ష్మణబేహరాతో బండిలో ఇంటికి పంపి, సుశీని గ్రేట్ ఈస్టర్న్ హోటలుకు తీసుకువెళ్ళాడు. అక్కడ ఆమెకు గదీ, ఆయా మొదలైన ఏర్పాట్లు చూసి అతను, "ఇక నేను ఇంటికి పోతాను మళ్ళీ సాయంకాలం వస్తాను. చౌధురీగారిని గురించి వాకబు చేస్తాను," అన్నాడు

హోటలు నౌకరు ఒక పెద్ద బౌండు పుస్తకం తెచ్చి అందులో సుశీని ఆమె పేరూ, చిరునామా రాయమన్నాడు. విజయుడా పుస్తకాన్ని తీసుకుని అందులో, "మిస్ సుశీలా దే," అని రాశాడు

నౌకరు వెళ్ళాక సుశీ, "అదా నా పేరు ?" అన్నది

"అవును. ఇకనుంచీ నీ పేరు మిస్ సుశీలా దే. నేను వెళ్ళొస్తాను. సాయంకాలం నాలుగూ, అయిదూ మధ్య వస్తాను." అన్నాడు విజయుడు.

"నేను బకురాణీని కలుసుకునే దెప్పుడు ?"

"ఇంటికి వెళ్ళి ఆలోచిస్తాను "

అతను టాక్సీ ఎక్కి, సుశీకి చెయ్యి ఊపి, వెళ్ళిపోయాడు ఆయా వచ్చి సుశీని స్నానానికి పిలిచింది

## రెండవ భాగం

## 1

రాత్రి పన్నెండు దాటింది వకుళమాల తన పడకగదిలో బల్లవద్ద కూర్చుని ఉత్తరం రాస్తుండగా ఆమె అడబిడ్డ సౌదామిని అక్కడికి వచ్చి, "ఏంతయిందో తెలుసా ? ఈవేళప్పుడీ రాత లేమిటి! పడుకో పదినా!" అన్నది.

"నన్ను పడుకోమంటున్నావు. నువ్వెందు కింతదాకా మేలుకునిఉన్నావు?" అని వకుళ ఆమె నడిగింది.

"నాకు నిద్రపట్టలేదు. డాబామీద కాస్త తిరుగుదామని పోతుంటే నీ గదిలో దీపం కనిపించింది." అన్నది సౌదామిని

"నాకూ నిద్ర పట్టకనే ఉత్తరం రాద్దామని కూర్చున్నాను."

"అయితే నువ్వుకూడా మేడమీదికి రా చల్లగాలిలో తిరుగుదాం."

పక్కనే ఉయ్యాలలో నిద్రపోతున్న చిట్టికి అటూ ఇటూ దిళ్ళు పెట్టి, ఫాన్ విసురు కాస్త తగ్గించి వకుళమాల సౌదామినివెంట మేడమీది డాబాకు వెళ్ళింది.

"ఇంత చీకట్లో ఏం కనపిస్తుందని డాబామీదికి వస్తావు?" అని వకుళ సౌదామిని నడిగింది.

"నాకు చీకట్లోనే వెలుతురు కనిపిస్తుంది; నీకు పట్టపగలు చీకటి కనపళ్ళేదూ?" అన్నది సౌదామిని.

"అదెప్పుడు?"

"జ్ఞాపకం చేసుకో అన్నయ్య సుశీలను వెంటబెట్టుకుని సోహాగ్‌పూర్ వెళ్ళావని రాసినప్పుడు ఏమైనా ఆ వ్యవహారం నాకంతగా నచ్చలేదు"

"నచ్చటానికి ఏమంత మంచిసంగతనీ!"

"నీ కెలా తోస్తున్నది. అన్నయ్య మనసు ఆవిడవేపు మొగ్గిఉంటుందా?"

"ఆవిడ మనసు ఆయనకేసి బాగా మొగ్గింది."

"ఎలా తెలుసు?"

"వాళ్ళు ఒకరినొకరు మీరు అనటం మానేసి నువు అనుకో నారంభించారు. మీ అన్నయ్య రాసిన ఉత్తరంలో వాళ్ళు అలా మాట్లాడుకున్నట్టే ఉన్నది."

ఇద్దరూ "విషవృక్షం"లోని పాత్రలను జ్ఞాపకం చేసుకున్నారు. ప్రస్తుతం సుశీ కుందనందిని. సౌదామిని కమలమణి, వకుళమాల సూర్యముఖి!

ఒంటిగంట కొట్టాక ఇద్దరూ మేడ దిగి కిందికి వెళ్ళి పడుకున్నారు

తెల్లవారాక లక్ష్మణబేహరా సామానుతోసహా ఇంటికి చేరాడు. నౌకర్లు కంగారు పడ్డారు. బాబుగారు వస్తారని వాళ్ళు తమ పనులను గురించి. అశ్రద్ధగా ఉన్నారు.

వకుళమాల నిద్ర లేచేసరికి ఏడున్నర అయింది ఆమె అద్దంముందు నిలబడి జుట్టు సవరించుకుంటూండగా సౌదామిని వచ్చి, "అన్నయ్య వచ్చాడు." అన్నది

వకుళమాల నమ్మలేక "వస్తే ఏరీ?" అన్నది.

"ఉదయంబండికి దిగి, సామాన్లు లక్ష్మణుడిద్వారా పంపి, అన్నయ్య దాన్ని తీసుకుని ఎక్కడికో వెళ్ళాట్ట. మేమ్‌సాబ్‌ను వాళ్ళింటిదగ్గిర దిగబెట్టి బాబుగారు అరగంటలో వస్తారని లక్ష్మణుడు చెప్పాడు."

"ఆవిడకి ఇల్లూ వాకిలీ లేదుటగా? ఎక్కడ దిగబెడతారూ? ఆవిడ వదలకపోతే?"

"అన్నయ్యకు మతిపోయిందాఏం? ఎక్కడోక్కడ దిగబెట్టివస్తాడు. నువు వెళ్ళి, నీళ్ళు పోసుకో."

వకుళమాల స్నానానికి వెళ్ళలేదు. చిట్టిని భుజాన వేసుకుని కాలుకాలిన పిల్లిలాగా ఒక గదిలోనుంచి మరొకగదిలోకి పచార్లు చేసింది. ఎనిమిదిన్నరకూడా అయింది. ఆమె తన ఆడబిడ్డదగ్గిరకు వెళ్ళి, "మీ అన్నయ్య ఇంకా రాలేదు. నాకేమీ బాగాలేదు. ఇలా ఎన్నడూ కాలేదు. ప్రతిసారీ వస్తున్నట్టు రాసేవారు—" అంటూండగా బయట కారు వచ్చిన చప్పుడయింది.

అవ్వ వచ్చి "బాబుగారు వచ్చారు." అన్నది.

కాని మెట్లమీద అడుగుల చప్పుడిలేదు. అవ్వ వెళ్ళి బాబుగారు కిందిగదిలోనే దుస్తులు మార్చుకుంటున్నట్టు చెప్పింది. వకుళమాల కిదీ కొత్తే. ఆమె నీరసంగా సౌదామిని గదినుంచి తనగదికి వెళ్ళి, బయటికి చూస్తూ కిటికీదగ్గిర నిలబడింది కొంతసేపయాక ఆమె వెనక్కు తిరిగేసరికి గదిమధ్య విజయుడు నిలబడిఉన్నాడు

"ఎప్పుడు వచ్చారు?" అన్నదామె చిరునవ్వుతో.

"ఇప్పుడే. కులాసాగా ఉన్నావా? చిట్టి కులాసాగా ఉందా? ఏదీ?"

వకుళమాల చిట్టిని తీసుకరావటానికి వెళ్ళి, పదినిమిషాలపాటు చిట్టికి తల దువ్వి అలంకరించి తీసుకువచ్చేసరికి విజయుడు సోఫామీద చేరగిలబడి కళ్ళు మూసుకుని ఉన్నాడు.

చిట్టి, "నాన్నా!" అని పెట్టిన కేకకు అతను కళ్ళు తెరిచాడు. చిట్టి తల్లి చంకనుంచి జారి తండ్రి రొమ్ముమీదికి వచ్చింది వకుళ సోఫామీద తన భర్తపక్కనే




కూర్చుని చేతులు చాస్తే చిట్టి రావనేసింది. "నే నిప్పుడు నీ కేమీ కానుటే?" అని వకుళ అడిగింది.

భార్యాభర్తలు కాస్సేపు చిట్టినిగురించీ, తరవాత విజయుడి రైలు ప్రయాణం గురించీ మాట్లాడుకున్నారు సుశీలను గురించి ఇద్దరూ మాట్లాడలేదు. ఆమె విషయము ఎత్తితే భర్త ఏమనుకునిపోతాడో అని భార్యా, భార్య అపోహపడుతుందేమో నని భర్తా అనుకోవటం జరిగింది

విజయుడు భోజనం చేసి కిందిగదిలో పక్క వేయించుకుని పడుకున్నాడు. కాని అతనికి వెంటనే నిద్రపట్టలేదు. బకురాణీకి సుశీ సంగతులన్నీ తెలుసును; అయినా ఆమె సుశీని గురించి ఏమీ అడగలేదు. కారణ మేమైఉంటుందోనని అత నాలోచించాడు.

అతను చివరకు నిద్రపోయి లేచేసరికి నాలు గయింది. అతను ముఖం కడుక్కుని, గడ్డం చేసుకుని, సూటు వేసుకువి, సిగిరెట్టు వెలిగించి, పెద్దకారు తీసుకురమ్మని సుందర్‌సింగుకు కబురు పంపి, జనానాలోకి వెళ్ళేసరికి, వకుళ, "షికారు వెళుతున్నారా? లోపలికి వచ్చి కూర్చోండి; కాస్త మాట్లాడాలి," అన్నది.

విజయుడు భార్యకు సమీపంగా వచ్చి, "నేను షికారు వెళుతున్నా నని ఎవరు చెప్పారు?" అని అడిగాడు.

"మీ రేంచేసినా నాకు తెలుస్తూనే ఉంటుంది. మీరు సుశీలదగ్గిరికి వెళుతున్నారు."

"వెళితే తప్పేం?"

"తప్పేమీలేదు. నాదగ్గిర సంగతులు దాస్తా రెందుకూ?"

"ఏం దాచానూ ?"

"మీ రావిడను కలకత్తా తీసుకువచ్చి ఎక్కడ దాచారో చెప్పారా ? చెబితే నేను మీ సుశీని లాక్కుపోతానా ?"

వకుళ తన ముఖానికి చేతు లడ్డం పెట్టుకుని నిశ్శబ్దంగా ఏడవసాగింది.

"ఇదేమిటి ? ఏడుస్తా వెందుకు ? ఏం జరిగింది ? నీ కేమైనా మతి పోయిందా ఏమిటి ? ఏడవకు ! ఊరుకో !"

అత నన్న మాటలతో వకుళ దుఃఖం మరింత అయింది. ఆమె ఏడవటం మానక పోతే సౌదామినినీ, తన వదినెనూ పిలుస్తా నన్నాడు విజయుడు.

"అందరినీ పిలవండి. నాపైన మీ కున్న ఆదరం అందరికీ తెలియజెప్పండి." అన్నది వకుళ తలఎత్తి.

"ఏం జరిగిందని పసిదానిలాగా హడావుడి చేస్తున్నావు ?"

"ఆడవాళ్ళు అప్పుడప్పుడూ కన్నీరు కార్చటం మంచిది."

అతను చేతిరుమాలుతో ఆమె కన్నీళ్ళు తుడుస్తూ, "ఒక పని చెయ్యి. చీరె మార్చుకుని నాతో రా." అన్నాడు.

"ఎక్కడికి ?"

"భర్తవెంట భార్య ఎక్కడికి వెళ్ళినా భయం లేదు. సీత రాముడివెంట దండకారణ్యానికి వెళ్ళలేదా ?"

"నాకు శూర్పణఖని చూపిస్తారా ఏం ?" అంటూ వకుళ నవ్వింది. విజయుడు తిరిగివచ్చాక ఆమె నవ్వటం ఇదే మొదటిసారి

"సుశీ ఎక్కడా దిగటానికి చోటులేక గ్రేట్ ఈస్టర్న్ హోటల్లో దించాను. జోడగిర్జా సమీపంలో చౌధురీగా రున్నారట. తల్లి పోయాక సుశీ కొన్నాళ్ళు వారింటో ఉన్నది. ఇప్పు డామె వారిదగ్గిరకి వెళ్ళి తనను భర్త వదిలేశాడని తానై ఎలా చెప్పుకుంటుందీ ? నే నాపని చేసిపెట్టాలి. అయిదుగంటలకు అక్కడికి వెళ్ళి ఆమెతో మాట్లాడి చౌధురిగారి దగ్గిరకు వెళ్ళాలి. రోజుకు పన్నెండు రూపాయలు ఇచ్చుకుంటూ ఆమె ఎన్నా ళ్ళా హోటల్లో ఉంటుందీ ? పద పోదాం."

"నా నోరు బాగానే మూసేశారు. నే నా హోటలుకు రాను. అటువంటి అనాచారం నావల్ల కాదు. ఇంట్లోనే పూజ చేసుకుంటూ కూర్చుంటాను. టీకి నీళ్ళు పెట్టాను. టీ తీసుకుని వెళ్ళండి," అన్నది వకుళమాల.

"నువు నిజంగా హోటలుకు రావా ?"

"మీ కేమైనా వెర్రా ఏమిటి ? నేను చీరె మార్చి, కాలికి జోడు తొడిగి బయలు దేరితే ఇంటిల్లిపాతీ పరిగెత్తుకుంటూ వచ్చి, ఎక్కడి కని అడగరూ ? సుశీ ఊళ్ళోనే వుందిగా ? ఇంకోసారి చూస్తానులెండి. క్షణం కూర్చోండి, టీ తెస్తాను." అంటూ అవతలకి వెళ్ళిపోయింది.

విజయుడు టీ తాగి బయలుదేరి హోటలు చేరేసరికి అయిదుముప్పా వయింది, అయిదింటికి వస్తానని ఆలస్యం చేసినందుకు సుశీ కాస్త అలిగింది

"చాలా రోజులకు ఇంటికి తిరిగివచ్చారేమో. బకురాణీతో కబుర్లు చెబుతూ ఇక్కడికి రావాలన్న సంగతి మరిచిఉంటారు," అని సుశీ అతన్ని దెప్పింది.

"అవును బకు మూలానే ఆలస్య మయింది. టీ తాగందే వెళ్ళనిచ్చిందికాదు."

"టీ కూడా తాగివచ్చారా ? బాగుంది. నే నిక్కడ రెండు టీలకు ఆర్డరిచ్చాను."

"నువ్వింకా టీ తీసుకోలేదా ? అయితే పద. నేను మళ్ళీ తాగుతాను ఆ తరువాత గంగవేపు మైదానంమీదికి పోదాం"

"ఇంట్లోనూ తాగుతారు. బయటా తాగుతారు; ఆశ"

"ఆశ లేకపోతే ఈ స్థితి కెందుకు వస్తాను ?"

ఇద్దరూ డైనింగ్ సెలూన్‌కు వెళ్ళి టీ తాగారు. సుశీ బకురాణి గురించీ, చిట్టి గురించీ అడిగి, "బకురాణీదగ్గిర నా మాట వచ్చిందా ?" అన్నది.

"వచ్చింది. ఆవిడనుకూడా నా వెంట రమ్మన్నాను. అనాచార మని వాదించింది. మరోరోజు వచ్చి నిన్ను చూస్తా నన్నది"

"షికారునుంచి నన్ను మీ ఇంటికి తీసుకు వెళతారా ? బకురాణిని చూస్తాను."

"ఇవాళే? ముందు షికారు పోదాం పద. ఈమాట దారిలో ఆలోచింతాం"...

* * * *

విజయుడు ఇంటినుంచి వెళ్ళిపోయాక వకుళ చిట్టిని ముస్తాబు చేసి, తోపుడు బండిలో షికారుకు పంపి, ఒకపుస్తకం తీసుకుని మేడపైకి వెళ్ళి, డాబామీద ఉన్న బెంచీమీద కూర్చుని పుస్తకం చదవసాగింది కాని ఆమెకు చదువు సాగలేదు. వెలుతురు తగ్గిపోతున్నది. తన భర్తా, సుశీ ఆ క్షణంలో ఏం మాట్లాడుకుంటూ ఉంటారో ఊహించటాని కామె ప్రయత్నించింది.

సౌదామిని వచ్చి, బెంచిమీద వకుళ పక్కన కూర్చుని, "అన్నయ్య ఎక్కడి కెళ్ళాడు, వదినా ?" అని అడిగింది

"ఎక్కడికోక్కడికి వెళ్ళారు. నన్నుకూడా రమ్మన్నారు. నే నేం వెళ్ళలేదు."

"వెళ్ళవలిసింది! వెళ్ళి కుందనందినిని చూడివలసింది!"

"ఫో! నిన్నరాత్రి ఇలా మాట్లాడే నా మనసంతా పాడుచేశావు. ఇవాళ ఆయనతో ఏమేమో అన్నాను. తలుచుకుంటే సిగ్గేస్తున్నది. ఆయన ఏమనుకున్నారో?"

"కడుపులో పెట్టుకోవటంకన్న కక్కెయ్యటమే మంచిది."

"ఆయన కావిడమీద ప్రేమ వుందా?"

"నీ కేం వెర్రా? ఆవిడమీద అన్నయ్యకు ప్రేమ ఉండట మేమిటి?"

"ఇంత పొద్దుపోయి ఆయన ఎందుకు తిరిగిరాలేదు? ఆవిడ గురించి ఆయనకింత తాపత్రయం దేనికి?"

"దిక్కులేని ఆడదీ! చిక్కుల్లో వుందీ! కాస్త సహాయం చేస్తే తప్పా?"

అంతలోనే విజయుడు కారులో తిరిగివచ్చాడు.

"జాగ్రత్త. అన్నయ్యదగ్గిర వెర్రివేషాలెయ్యకు. సుశీ మాట వస్తే మామూలుగా పోనియ్యి." అని సౌదామిని వకుళను హెచ్చరించింది. ఇద్దరూ మేడ దిగివచ్చారు.

వకుళ భర్తను కలుసుకోగానే, "ఏమయింది?" అని అడిగింది

"పొద్దుపోయింది. జోడాగిర్జాకు వెళ్ళటం పడలేదు.

"అయితే ఇంత ఆలస్య మయిందేం?"

"తొమ్మిదేగా అయిందీ? గంగఒడ్డున కాస్త తిరిగివచ్చాను.

ఒంటరిగానా, సుశీలతోనా అని అడగాలవి నోటిదాకా వచ్చింది గాని వకుళ అడగలేదు,

"నావెంట రమ్మంటే వచ్చావుకావు. నిన్ను చూడాలని సుశీల గిజగిజలాడింది. ఇవాళే వస్తా నన్నది. కష్టంమీద ఆపాను," అన్నాడు విజయుడు.

"ఆపటం దేనికీ? తీసుకురావలిసింది."

"నీ అనుమతి లేకుండానే?"

"ఇదెప్పటినుంచి?"

"మొదటినుంచీనూ. పద, భోజనం పెట్టుదువుగాని."

## 2

ఒకవారం గడిచింది. చౌధురీగారు కలకత్తాలో లేరు, త్వరలోనే వస్తా రని తెలిసింది. సుశీగురించి ఏ ఏర్పాటూ జరగలేదు. ఆమె హోటల్లో ఒంటరిగా ఎలా ఉంటున్నదీ తెలుసుకోవటానికి విజయుడు రోజూ వెళ్ళివస్తున్నాడు. అతను రాత్రి ఇల్లు చేరుకునేసరికి రాత్రి తొమ్మి దయేది. పగలుకూడా అతను భార్యకు ఎక్కువ




కనిపించేవాడుకాడు. రాత్రిపూట వకుళ ఏమీ అడిగేదికాదు. తాను భార్యపట్ల సరిగా ప్రవర్తించటంలేదని బాధపడేవా డతను.

*　　*　　*　　*

ఆరోజు శనివారం. మిట్టమధ్యాహ్నంవేళ భవానీపూరునుంచి సౌదామినికి ఉత్తరం వచ్చింది. ఆరాత్రి కల్పతరు థియేటరులో ఊర్వశీ సమాగమం అనే నాటకం ఉన్నది. దానికి సౌదామినినీ, వకుళమాలనూ తీసుకుపోతాం; సిద్ధంగా ఉండమని, విజనకుమారి అనే బంధువు రాసింది.

నాటకానికి విజయుడి వదినగారు రానసేసింది. విజయుడు టీ తాగటానికి వచ్చినప్పు డతని ఉద్దేశం తెలుసుకుందామంటే వీలుపడలేదు. సమయానికెవరో స్నేహితులు వచ్చేసరికి, అతను టీకోసం జనానాలోకి రాక, డ్రెస్సు వేసుకుని బయటికి పోతూ, రాత్రిభోజనానికి రాననీ, తను వచ్చేసరికి చాలా పొద్దుపోతుందనీ కబురుచేశాడు.

ఉత్తరంలో రాసినప్రకారం విజనకుమారి మరి ఇద్దరు స్త్రీలను వెంటబెట్టుకుని రానేవచ్చింది. వాళ్ళవెంట సౌదామినీ, వకుళా బయలుదేరారు.

తొమ్మిదిన్నరకు నాటకం ఆరంభమయింది. మొదటి అంకం జరుగుతూండగా విజయుడు కల్పతరు థియేటరుకు టెలిఫోన్ చేసి, ఒక బాక్సు రిజర్వు చేయించుకుని, మరికొంతసేపటికి టాక్సీలో సుశీతో సహా వచ్చాడు. అతనికి బెంగాలీనాటకం చూడాలనిలేదు, కాని ఎన్నడూ బెంగాలీనాటకాన్ని చూసిఎరుగని సుశీ పట్టుబట్టి అతన్ని తీసుకొచ్చింది. సుశీ ఆడవాళ్ళు కూర్చునే జనానావిభాగంకేసి చూసింది

రెండో అంకం ప్రారంభం కానున్నది. విజయుడు సుశీకి విక్రమోర్వశీయం కథ చెప్పాడు ఊర్వశీ పురూరవులు ఒకరి నొకరు చూపులమాత్రంచేతనే ప్రేమించుకున్నారని విని, "రాజుకు రాణు లెవరూ లేరా ?" అని సుశీ అడిగింది. తన కో భార్య ఉండగా రాజు ఊర్వశీకోసం వెర్రివాడు కావటం బాగాలేదని ఆమె వ్యాఖ్యానించింది.

రెండో అంకం ముగిసి తెర పడగానే విజయుడు, "కాసేపు బయటికి పోయి చల్లగాలి పోసుకుందాం. ఇక్కడ చాలా ఉక్కగా ఉన్నది." అంటూ సుశీని చెయ్యి పట్టుకుని బయటికి తీసుకుపోయాడు. వాళ్ళలా వెళ్ళారో లేదో పరదా స్త్రీ లుండే ప్రాంతంలో కలకలం బయలుదేరింది ఎవరో స్త్రీ మూర్ఛబోయింది. విజయుడూ, సుశీ తిరిగివచ్చి తమ స్థానాలలో కూర్చునేలోపుగా ఆ కలకలం ఉపశమించింది. వాళ్ళు మరి రెండంకాలు చూశాక విజయుడు "పన్నెండయింది. నాటకం ఇంకో గంటదాకా పూర్తికాదు. పోదాం పద." అన్నాడు.

ఇద్దరూ డైనింగ్ సెలూన్‌కు వెళ్ళారు సుశీ టీ తాగుతానన్నది కాని విజయుడు వెర్మత్ తెప్పించాడు

"ఏమి టాలోచిస్తున్నావు ?" అన్నాడు విజయుడు

"ఊర్వశీ పురూరవులను గురించి." అన్నది సుశీ.

"నీ కే ఘట్టం బాగా నచ్చింది ?"

"రాజు విరహం. ఆ రాజుకు ఊర్వశిపైన ఎంత ప్రేమ ! నన్నెవరైనా అలా ప్రేమిస్తే ఏం చేస్తానో !"

గవర్నమెంటు బంగళా గడియారం ఒంటిగంట కొట్టింది.

విజయుడామెను పడకగదిదాకా దిగబెట్టి, "వెళ్ళనా ?" అన్నాడు.

సుశీ, "వెళతారా ?" అన్నది వినపడీ వినపడకుండా.

"గుడ్‌నైట్ !" విజయుడామె చెయ్యితీసుకుని ముద్దుపెట్టుకుని వెళ్ళిపోయాడు. సుశీ తన పక్కమీద పడిపోయి, ముఖం దిండులోదూర్చి వెక్కివెక్కి ఏడ్చింది

విజయు డింటికి రాగానే, "అమ్మగారి కీవాళ మూర్ఛ వచ్చింది." అని బేహరా చెప్పాడు.

"మూర్ఛ వచ్చిందా ? ఇప్పుడెలా గుంది ?"

"నింపాదిగానే ఉంది. నిద్రపోతున్నా రని ఇంతకు ముందేతెలిసింది."

వకుళకు మూర్ఛవచ్చిన దెక్కడని విజయు డడగలేదు, బేహరా చెప్పలేదు. అతను పైకి వెళ్ళటం మంచిదికా దనుకుని కిందనే పడుకుని కాస్సేపు వకుళమాలను




గురించీ, కాస్సేపు సుశీని గురించీ ఆలోచించాడు. వకుళకు ఒకప్పుడు మూర్ఛలు వచ్చేవి, కాని చిట్టి పుట్టాక నిలిచిపోయాయి. ఆమె ఆరోగ్యం చెడిపోయింది. ఒకటి రెండుమాసా లైనా తీసుకుపోవాలి.

సుశీ భవిష్యత్తు ఏమయేదీ తెలియదు. ఆమె ఎవర్నన్నా యోగ్యుణ్ణి పెళ్ళాడి సుఖ పడవచ్చు. ఇంతకూ పాల్ మొదటిపెళ్ళిసంగతి ఇంకా రూఢి కాలేదు. తాను మద్రాసు వెళ్ళిరావాలి.

ఇలా ఆలోచిస్తూ విజయుడు రెండగంట లయ్యాక నిద్రపోయాడు

మర్నా డతను లేచేసరికి చాలా పొద్దెక్కింది. అతను తొమ్మిదిగంటలకు టీకోసం పైకి వెళ్ళాడు. అతని వదినెగారు టీ ఇస్తూ. వకుళమాల కిందటిరాత్రి కల్పతరు థియేటరులో పదకొండుగంటలవేళ నాటకం చూస్తూ మూర్ఛపోయినట్టు చెప్పింది.

విజయుడి గుండెలో రాయిపడింది. వకుళ థియేటరులో తననూ, సుశీనీ చూసి ఉంటుందని అతను అనుకున్నాడు. అతను తన వదినెగారితో ఆమాటలూ ఈ మాటలూ చెప్పి వకుళ పడకగదికి వచ్చాడు

వకుళ సోఫామీద చేరగిలబడి కూర్చునిఉన్నది. ఆమెతో ఏదో మాట్లాడుతున్న సౌదామిని ఏదోవంక చెప్పి వెళ్ళిపోయింది. అతను ఆమె ముఖంకేసి చూడసాగాడు. అది కళాహీనంగా ఉన్నది.

"ఏమిటి చూస్తున్నారు?" అన్నది వకుళ.

"నా కీర్తి చూసుకుంటున్నాను. నీ అంతు ఇంకెంతలో తేలుతుందో ఆలోచిస్తు న్నాను"

"నాది మొండిప్రాణం. అంత తేలిగ్గా అంతు తేలదు." అంటూ ఆమె భర్త చెయ్యి పట్టుకున్నది.

"నిన్న నా వెంట సుశీని చూసి నన్ను ఖర్చుసద్దులో వేసినట్టున్నావే?"

"అదేమీలేదు. మిమ్మల్నామె అతిథిగా పిలిచినందుకు మీ రామెను నాటకానికి తీసుకెళ్ళా రనుకున్నాను."

"అనుకుని మూర్ఛపోయావు! బకూ, మనిద్దరికీ ఉండే సంబంధం బూటకమా?"

"ఎప్పటికీ కాదు."

"ఇప్పుడు మనం వెనకటిలాగా ఉన్నామా?"

"మీకు తెలీదా?"

"నాకూ తెలుసు, నీకూ తెలుసు. నేను వెనకటిలాగా ప్రవర్తించటం లేదు. పాపిని. సుశీ విషయంలో కాదు, నీ విషయంలో పాపం చేశాను. నువ్వయినా నాతో సరిగా ఎందుకులేవు?"

"మీరు పాపాత్ములూ, నేను పుణ్యాత్మురాలినీనూ!"

అత నామెను సిమ్లాగానీ, డార్జిలింగ్‌గానీ, మసూరీగానీ ఒకటిరెండు మాసాల పాటు తీసుకుపోతాననీ, అందువల్ల ఆమెకు బలం వస్తుందనీ అన్నాడు. తాను ముందుగా మద్రాసు వెళ్ళవలసినపనికూడా ఉందన్నాడు.

అతను రాత్రి బండికే ప్రయాణం పెట్టుకున్నాడు.

"సుశీ మీవెంట వస్తున్నదా?" అని వకుళ అడిగింది.

"లేదు."

"ఎన్నాళ్ళు ప్రయాణం."

"పోను రెండురోజులూ, రాను రెండురోజులూ. అక్కడ రెండురోజులూనూ. అష్టమినాటికి వస్తాను. దశమినాడు మనం ప్రయాణం పెట్టుకుందాం."

అతను ఆరోజు సాయంకాలం ప్రయాణం పెట్టుకున్నాడు గనక, సుశీని చూడటానికి మధ్యాహ్నం ఒంటిగంటకే హోటలుకు వెళ్ళాడు. సుశీ రూములోలేదు. ఎటో వెళ్ళిందనీ, రెండుదాకా రాదనీ అన్నారు. అతను రైల్వేఆఫీసుకు వెళ్ళి రాత్రి మద్రాసు మెయిలుకు టిక్కెట్టు కొని, బెర్తు రిజర్వు చేయించుకుని మళ్ళీ హోటలువద్దకు వచ్చేసరికి సుశీ కలుసుకున్నది.

అత నామెతో, క్రిందటిరాత్రి నాటకంలో బకురాణీ తననూ, సుశీనీ చూసిందనీ, ఆమెకూడా నాటకానికి వచ్చి పరదాస్త్రీలతో కూర్చున్నదనీ చెప్పాడు.

"బకురాణీకి కోపం రాలేదా? ఆమె ఏమన్నది?" అని సుశీ అడిగింది.




"కోపం వచ్చినదానిల్లాగా బకురాణీ నాతో ఏమీ అనలేదు." అన్నాడు విజయుడు.

సుశీ కొంచెంసేపు ఆలోచించి, "ఆమెకు కోపం రాకపోయినా ఇది మంచిపని కాదు," అన్నది.

"ఏది ?"

"మన స్నేహం. ఇద్దరమూ గంటలతరబడి ఒకేచోట ఉండటమూ, కలిసి షికార్లు వెళ్ళడమూ, భోజనాలు చెయ్యడమూ, నాటకాలకు పోవటమూ – ఇదంతా ఉచిత మేనా ? బకురాణీ చాలామంచిది కనక సరిపోయింది. నేను చౌధురీగారింటికి వెళ్ళినాక మీరు తరుచు రానవసరం ఉండదు. కాదూ ?"

"నువు వద్దంటే రేపటినుంచీ రాను."

"ఎందుకు కోప్పడతారు ? మీ మంచికోసమే చెబుతున్నా నని గ్రహించలేరా ?" ఆమె కన్నీరు రాల్చింది.

"ఒకటనబోయి ఇంకో టన్నాను. ఇవాళరాత్రి మద్రాసు వెళుతున్నాను. అది చెప్పటానికే ఈవేళప్పుడు వచ్చాను."

అతను సుసీకి మొట్టమొదటిసారిగా పాల్ మొదటిభార్య-గురించి చెప్పేశాడు.

"ఆయనకు అదివరకు ఒక పెళ్ళికాదు, పది పెళ్ళిళ్ళయినట్టు రుజువైతేమాత్రం మన కేం లాభం విజయబాబూ ?"అన్న దామె.

"పెళ్ళయినట్టు రుజువైతే నీ పెళ్ళి చెల్లదు. నువు యధేచ్ఛగా నీ యిష్టంవచ్చిన వాణ్ణి పెళ్ళాడవచ్చు."

సుశీ అక్కడ కనబడుతూన్న గవర్నరు బంగళాకేసి చూపిస్తూ, "అయితే ఆ గవర్నరును పెళ్ళాడవచ్చా ?" అన్నది

"ఆయనకు భార్య వుండదూ ?"

"ఆ భాగ్యానికి డబ్బు తగలేసి మీరు మద్రాసు పోకపోతే నేం ?"

"ఇంత మహానగరంలో గవర్నరుతప్ప నీకు ప్రేమించదగినవాడు దొరకడా ? ప్రేమించినవాణ్ణి పెళ్ళాడటానికి నీకు అవకాశం ఉంటుంది."

"నేను త్వరగా ఎవరినో ఒకరిని పెళ్ళాడెయ్యాలనేనా మీ కోరిక ?"

"ఆవును."

సుశీ ముఖం వివర్ణ మయివంది. ఆమె ముఖం పక్కకు తిప్పుకుని, "నేను మీకు భార మయానుకాదూ ! మద్రాసు వెళ్ళివచ్చి నా బరువు దించేసుకోండి," అన్నది.

తాను మద్రాసు పోవటం గురించి ఆమె అలా అనుకుంటుం దని అతను కలలో కూడా అనుకోలేదు. "మా వ్యవహారం కణుపు దాటేస్తున్నది. ఇంక వెనక్కు తిరగబోతే అగాధంలో పడిపోతాం. నే నింక ఒక్క అడుగైనా ముందుకు వెయ్యరాదు." అనుకున్నా డతను.

అతను హోటల్లో టీ తాగి ఇంటికి పోతూ, రాత్రి తొమ్మి దింటికి వచ్చి ఆమెను రైలు స్టేషనుకు తీసుకుపోతా ననీ, ఆమె అతన్ని సాగనంపి, తన కారులోనే హోటలుకు తిరిగి పోవచ్చు ననీ అన్నాడు.

ఇంటికి వెళ్లాక అతను వకుళతో మాట్లాడటం పడలేదు. అతను తన సామానును బేహరా వెంట బండిలో పంపి, బయలుదేరిపోతుండగా వకుళ వచ్చి వంగి ప్రణామం చేసి, "ఆశీర్వదించండి !" అన్నది.

అత నామె చెక్కిళ్ళు తాకి, "భర్తకు ఇష్టురాలివి కా !" అన్నాడు.

అతను హోటలుకు చేరేసరికి సుశీ సోఫామీద, తాను కిందటిసారి విడిచివెళ్ళి నప్పటిలాగే కూర్చునివున్నది. ఆమె ఇంకా భోజనం చెయ్యలేదు. బండికి ఆటే టైములేదు. వెంటనే భోంచెయ్యమంటే, అతన్ని పంపించివచ్చి చేస్తా నన్నది.

"ఆలస్యంగా తింటే జబ్బు చేస్తుందేమో ?" అన్నా డతను.

"జబ్బు చెయ్యదు; రాయి అయిపోయాను." అన్న దామె.

తాను మద్రాసు వెళ్ళుతున్న పని ఆమెకు అప్పుడే చెప్పకుండావుంటే బాగుండే దేమో ననుకుని, అతను సోఫామీద ఆమె పక్కనే కూర్చుని, "నేను మద్రాసు వెళ్ళటం నీకు బొత్తిగా ఇష్టంలేదా ? ఇష్టం లేకపోతే మానేస్తాను," అన్నాడు.

"నా మాట విని ప్రయాణం ఆపటానికి నేను మీ కెవర్ని విజయబాబూ ?'' అన్నదామె. ఆమె కళ్ళవెంట జలజలా నీరు కారింది.

విజయు డామెను తన రొమ్ముకేసి గట్టిగా అదుముకుని, "నా కెవరివా ? నా ప్రియురాలివి ! ప్రియురాలివి !" అంటూ వెర్రిగా ఆమెను ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె అతన్ని వారించా లని ప్రయత్నం చెయ్యలేదు. ఆమె తల ఎత్తి అతని ముఖంలోకి చూసి, "అయితే నన్ను వదిలించుకోవా లనుకున్నా రెందుకూ ?" అని తన తలను అతని భుజంమీద వాల్చేసింది.

ఆమె మూర్ఛ పోయిం దని తెలిసి అతను ఆయాను కేకపెట్టి, వెంటనే డాక్టరును పంపమని మేనేజరుకు చీటీ రాసి పంపాడు తరవాత సుశీని సోఫామీద పడుకోబెట్టి, ముఖాన చన్నీళ్ళు చల్లాడు.

ఒక లావుపాటి దొరసాని వచ్చి, తాను నర్సు నని చెప్పి, అతన్ని అవతలికి పంపి, అయిదు నిమిషాలలో సుశీకి స్పృహ తెప్పించింది. ఆమె వెళ్లాక విజయుడు లోపలికి వెళ్ళి, ఆమె కోరికపైన ఆమెకు సమీపంగా కుర్చీ వేయించుకుని కూర్చున్నాడు

నర్సు సుశీకోసం బీఫ్‌టీలో బ్రాందీ కలిపి పంపింది సుశీ అది తాగి తేరుకుని త్వరలోనే నిద్రపోయింది. పదిన్న రయింది.

"విన్నరాత్రి ఒకతె మూర్ఛపోయింది. మరో ఇరవై నాలుగు గంటలు తిరగక ముందే మరొకతె మూర్ఛపోయింది. ఎంత అదృష్టవంతుణ్ణి !" అనుకున్నాడు విజయుడు.

కొంత సేపటికి బేహరా హోటలుకు వచ్చి, "బండి వెళ్లిపోయింది, హుజూర్" అన్నాడు విజయు డతన్ని సామాన్లు ఇంటికి తీసుకుపొమ్మన్నాడు.

## 3

విజయుడు రాత్రి పన్నెండు గంటలదాకా సుశీ గదిలో ఉన్నాడు. ఆమె లేచి నపుడు తీసుకోవడానికి బ్రాత్, పుడింగ్ మొదలైనవి గదిలో తెప్పించి ఉంచి, తాను మర్నాడు తొమ్మిదింటికి వస్తానని ఉత్తరం రాసిపెట్టి వెళ్ళిపోయాడు.

సుశీ రెండుగంటలవేళ లేచింది. విజయుడు రాసిన మొదటి "ప్రేమ లేఖ" చదువుకున్నది. తాను మూర్ఛపోయినట్టు ఆయాద్వారా తెలుసుకున్నది. బ్రాత్ వెచ్చ బెట్టించుకుని తాగి, పుడిగ్ కొంచెం రుచిచూసి, మళ్ళీ పడుకుని నిద్రపోయింది.

మర్నా డుదయం ఆమె లేచేసరికి ఎనిమి దయింది. మరో గంటలో, విజయుడు వచ్చేలోపుగా, స్నానం చేసి సిద్ధంగా ఉండగలనా అని ఆమె భయపడు

తూండగా, విజయుడు నౌకరుద్వారా ఆమెకు చీటీ పంపాడు. అందులో అతను తన ఇంట్లో గొడవగా ఉన్నదనీ, ఈపూట రాలేననీ, సాయంకాలం తప్పక వస్తాననీ రాశాడు. ఆమె ఎలా ఉన్నదని అడిగాడు. తాను సరిగానే ఉన్నాననీ తనని గురించి విచారించ వద్దనీ, అతను రాసిన విషయం అర్థం కాలేదనీ, అతనికోసం ఎదురు చూస్తుంటాననీ ఆమె సమాధానం రాసి, "సుశీల" అని సంతకం చేసింది.

సాయంకాలందాకా ఆమె ఆరాటంతో ఏ పనీ చెయ్యలేకపోయింది. విజయుడు తమ సంగతి తన భార్యకు చెప్పి ఉంటాడనీ, అతని కే మాయా మర్మమూ తెలీదనీ, అందుకే ఇంట్లో గొడవ అయిఉంటుందనీ ఆమె ఊహించింది.

విజయుడు సాయంకాలం వచ్చాడు. అతడి ముఖం వాడిపోయి ఉన్నది. సంగతంతా బకురాణీకి చెప్పేశానని అత నన్నాడు.

"నాకు ముందే తెలుసును. నే ననుకున్నట్టే అయింది," అన్నది సుశీ.

"నీమీద నాకు ప్రేమ అని చెప్పినప్పుడు బకురాణీకూడా నీలాగే తనకు తెలుసు నన్నది," అన్నా డతను.

ఇద్దరూ కబుర్లు చెప్పుకునేటప్పుడు సుశీ, "మీకు వివాహం కాకుండా ఉంటే నేను మీదా న్నయేదాన్ని," అన్నది.

హిందూ స్త్రీలు సహించే నిర్బంధాలనుకూడా తాను సహించేదా నన్న ఆమె అన్నది.

ఇద్దరూ టీ తాగి విజయుడి కారులో మైదానంమీదికి షికారు బయలుదేరారు. ఆ రోజల్లా ఉక్కబెట్టింది. కాని మైదానం మీద కాస్త చల్లగా ఉన్నది. ఒక గంటసేపు అక్కడ కారుషికారు తిరిగి, విజయుడు కారును ఈడెన్ గార్డెన్‌దగ్గర ఆపాడు. ఇద్దరూ తోటలోకి ప్రవేశించి, నడుముకుంటూ ఒక నిర్జనప్రదేశానికి వెళ్ళి కూర్చున్నారు.

"నాకు పెళ్ళి అయిఉండకపోతే నాదానవై ఉండేదాన వన్నావే, అది మనస్ఫూర్తిగా అన్నమాటేనా?" అని విజయు డడిగాడు

"అవును," అన్న దామె.

"నాకు భార్య ఉన్నప్పటికీ నాదానివి కమ్మంటే కావా?"

"మీకు ఆత్మార్పణం చేసుకున్న మహామనిషికి బాధ కలిగించటం ధర్మమా?"

"ఆవిడకు బాధ లేదనుకో. ఆమె సమ్మతించిం దనుకో."

బకురాణీ సమ్మతిస్తుందని సుశీ ఊహించలేకపోయింది. కాని తాను సుశీని పెళ్ళాడితే బాగుంటుందన్న ఆలోచన బకురాణే చెప్పిందని విజయు డన్నాడు.



యువ



"మనస్ఫూర్తిగానే అన్నదా ?"

"అలాగే తోచింది "

"నమ్మశక్యం కాకుండా ఉంది."

హిందూస్త్రీలలో అలాటి స్వార్థరాహిత్యం ఉందని విజయుడు ఉదాహరణ లిచ్చి, "సుశీలా, బాగా ఆలోచించుకో. భార్యా, ఒకపిల్లా ఉన్నవాణ్ణి చేసుకోవటం ఏస్త్రీకూడా కోరదగినసంగతి కాదు నా బంధువులు విన్నెలా చూస్తారో తెలీదు. ఇవన్నీ ఆలోచించుకుని నా భార్యవు కావటానికి సమ్మతిస్తావేమో నిర్ణయించుకో. టైము తీసుకునే చెప్పు. నిన్ను తొందరపెట్టను," అన్నాడు.

"ఆలోచించే దేమీలేదు. బకురాణీకి అన్యాయంగాని, బాధగాని కలగదని మీరు మాట ఇస్తే, నా కేమీ అభ్యంతరంలేదు." అన్నది సుశీ.

ఇంతలో వానచినుకులు సాగాయి. వారు బయలుదేరి కారుదగ్గిరికి చేరుకునేలోపుగా వర్షం హెచ్చటంచే తడిసి ముద్దయారు. సుశీని హోటలుదగ్గిర దించి, అతను కారులో వెళ్ళిపోయాడు.

మర్నాడు మధ్యాహ్నం అతను హోటలుకు వచ్చి, సుశీ పెళ్ళికి ఒప్పుకున్నదని తాను తన భార్యకు చెప్పినట్టూ, ఆమె మంచిదే నన్నదనీ, పెళ్ళి జరగటం విషయం చర్చించిందనీ సుశీకి చెప్పాడు.

సుశీ కొంచెం ఆలోచించి, "ఆమె ప్రేమ సముద్రంలాటిది !" అన్నది. ఆమె

తమ వివాహం ఏలా జరుగుతుందని అడిగింది. "మనం ముసల్మాను మతమైనా పుచ్చుకోవాలి, ఆర్యసమాజంలోనైనా చేరాలి," అన్నాడతను. ఆర్యసమాజంలో కూడా భర్త ఒకభార్యమీద మరొక భార్యను చేసుకోవచ్చుగాని, భార్య ఒకభర్త ఉండగా మరొకభర్తను చేసుకోవటానికి వీల్లేదు. అందుచేత అతను పాల్ మొదటి వివాహంసంగతి రూఢి చేసుకోవడానికి మద్రాసు వెళ్ళాలి.

టీ తాగి, వాళ్ళిద్దరూ బజారుకు వెళ్ళి ఉంగరం ఒకటి కొన్నారు. అతను ఆమెతో తన మద్రాసు ప్రయాణం గురించి చెప్పినప్పుడు సుశీ, "పాల్ అన్న మాటలు మీరు నిజంగా నమ్ముతున్నారా?" అన్నది: పాల్ తను చేసుకున్నదే మొదటి పెళ్ళి అయిఉంటుం దని ఆమె వాదించింది.

"ఈమాట అదివర కెందుకు చెప్పలేదు," అన్నాడు విజయుడు.

"మనకు పెళ్ళవుతుందని నేను కలగన్నానా? పాల్‌కు అదివరకు పది పెళ్ళిళ్ళయితేమాత్రం నాకు ఒరిగే దేమి టనుకున్నాను."

విజయుడికి గుండెలో రాయి పడింది. అతను తాను కొన్న ఉంగరాన్ని సుశీకిస్తూ, "ఈ ఉంగరం నీదగ్గిరే ఉంచు. మద్రాసు వెళ్ళివచ్చాక, పరిస్థితి అనుకూలంగా ఉంటే అప్పుడు దీన్ని నీ వేలికి పెడతాను." అన్నాడు.

ఆరాత్రి వాళ్ళిద్దరూ హోటలులో భోజనం చేసి కబుర్లు చెప్పుతుంటూ ఉండగా బేహారా ఒక ఉత్తరం తెచ్చాడు. అది చౌధురీగారు రాసిన ఉత్తరం. ఆయన కిందటి రోజే కలకత్తా చేరాడట. బొంబాయినుంచి పాల్ వచ్చి, తాను తన భార్యకోసం ఎంత వెతికినా కనిపించ లేదుట. పాల్ తన భార్యకోసం చాలా దిగులు పడుతున్నాడు గనక సుశీ గురించిన వివరా లేమైనా తెలిస్తే చెప్పమంటూ చౌధురీ రాశాడు.

మర్నాడు ఉదయం విజయుడు చౌధురీగా రింటికి వెళ్ళి, చౌధురీగారి సమక్షంలో పాల్‌తో మాట్లాడదా మనుకున్నాడు. కాని పాల్ లేడు. విజయుడు చౌధురీగారితో సుశీ కులాసాగా ఉన్నట్టు చెప్పాడు. కాని ఆమె ఎక్కడ ఉన్నదీ చెప్పలేదు.

ఆ సాయంకాలం విజయుడు బయటికి బయలుదేరబోతుండగా పాల్ వచ్చాడు. కాస్సేపు విజయుడిపైన ఎబ్డక్షన్ కేసు చేస్తున్నా నన్నాడు; తనకు ముందొక పెళ్ళి కాలేదనీ, తాను తాగిన మైకంలో ఏమేమో వాగి ఉంటాననీ అన్నాడు; విజయుడిడిగి తెప్పించుకుని విస్కీ తాగాడు. చివరకు, ఒక వెయ్యిరూపాయి లిస్తే పొగచుట్టాల వ్యాపారం చేసుకుంటా నన్నాడు. ఒక్క పైసాకూడా ఇవ్వనని గట్టిగా చెప్పేసి, విజయుడు పాల్‌ను సాగనంపాడు.

సుశీ విజయుడిద్వారా ఈ విషయాలు విని భయపడింది. పాల్ కలకత్తా వదిలి వెళ్ళేదాకా తాను సుశీని ఒంటరిగా విడిచి మద్రాసు పోనని విజయుడు మాటఇచ్చాడు.

*       •       •

ఆ రాత్రి తొమ్మిదింటికి చౌధుగారిగారు విజయు డింటికి వచ్చి పాల్‌ను పోలీసులు వారంటు తెచ్చి ఎరెస్టు చేసి పట్టుకుపోయా రని చెప్పాడు. వారంటు బొంబాయినుంచి వచ్చింది. 409 సెక్షను కింద పాల్‌ను ఎరెస్టు చేశారు. చౌధురీగారు పాల్‌ను జామీనుమీద విడిపించమని కోరినా పోలీసులు సమ్మతించలేదుట. పాల్ బంధువులకూ, సుశీకి ఈ సంగతి తెలియటం మంచి దన్నాడు చౌధురిగారు.

"సుశీకి నేను చెబుతాను. పాల్ బంధువుల్లో ఒకరి చిరునామా నా దగ్గిర ఉన్నది," అంటూ విజయుడు సోఫీ రాసిన ఉత్తరం తీసి ఆయన కిచ్చాడు.

ఆయన ఉత్తరం చూసి, "ఈ సోఫీ ఎవరు?" అని అడిగాడు.

"పాల్ భార్య; 1907 నవంబరు 6న మద్రాసులోని బాప్టిస్టు చాపెల్‌లో వా రిద్దరికీ పెళ్ళి అయింది." అన్నాడు విజయుడు.

చౌధురీగారు ఆగ్రహావేశంలో, "బద్మాష్! సుశీని నాశనం చేశాడు. ఎంత దుర్మార్గుడు!'' అన్నాడు.

విజయు డాయనకు దాచకుండా అంతా చెప్పేశాడు: తా మిద్దరూ పెళ్ళి చేసుకోబోతున్న సంగతి మాత్రం చెప్పలేదు. ఆయన అంతా విని బయలుదేరి వెళుతూ, ''సుశీ అదృష్టవంతురాలు. అందుకే ఆమెకు మీవంటి యోగ్యుడి అండ లభించింది. రేపామెను మా యింటి కొకసారి పంపండి! పూర్ గరల్!" అన్నాడు.

మర్నాడే అతను మద్రాసుకు ప్రయాణం కట్టాడు. అతను సామానులు సర్దుకుంటూ ఉండగా వకుళమాల అతనికోసం కబురు చేసింది.

"నిన్న విజనకుమారి వచ్చింది. వాళ్ళ కుర్రాడి ఆరోగ్యం కోసం పూరీ వెళ్ళి ఒకటి రెండుమాసా లుంటారు. సముద్రపుగాలికి ఆరోగ్యం బాగుపడుతుం దన్నారుట. ఇల్లుకూడా అద్దెకు తీసుకున్నారు నన్నుకూడా తమవెంట రమ్మన్నది." అన్నది వకుళ అతనితో.

''నీ వంట్లోకూడా ఏమీ బాగాలేదు. వెళ్ళరాదూ?''

"నా కేం జబ్బు? కాని ఒక టనుకున్నాను. మీరు మద్రాసు నుంచి నాలుగు రోజుల్లో తిరిగివస్తారు. విజనకుమారి వెంట వెళ్ళి, అక్కడ రెండు మూడు రోజు

లుండి దేవుడి దర్శనం చేసుకుని, మీరు తిరిగి వచ్చేటప్పు డక్కడ దిగితే, మీ వెంట వచ్చెయ్యవచ్చు ననుకున్నాను మీ కేమైనా ఇబ్బందా?"

"నా కేం ఇబ్బంది?"

* * *

అతను రెండుగంటలకు వెళ్ళి, తాను రాత్రిబండికి మద్రాసు పోతున్నాననీ, పాల్‌ను పోలీసులు పట్టుకెళ్ళారు గనక ఆమె కేమీ భయం ఉండదనీ, తాను తిరిగి వచ్చినదాకా ఆమె చౌధురీగా రింట ఉంటే బాగుంటుందనీ సుశీతో అన్నాడు.

సుశీ అతని కొక విషయం జ్ఞాపకం చేసింది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు కిర్రోజుల క్రితం మొదటిసారి చూసుకున్నారు. అది మొదలు ప్రతిరోజూ కలుసుకుంటూనే ఉన్నారు. అతను నెక్‌లెస్‌కోసం సోహాగ్‌పూర్‌నుంచి జబల్పూరు వెళ్ళినప్పుడు నాగా పడిఉండవలసింది. కాని అదృష్టవశాన మర్నాడు రాత్రికే తిరిగివచ్చి, ఆమె మెడలో, వరమాల వేసినట్టుగా, నెక్‌లేస్ తగిలించాడు! కాని ఈసారి నిజంగా నాగా పడబోతున్నది!...

## 4

పూరీలో విజనకుమారీవాళ్ళు అద్దెకు తీసుకున్న మేడ సముద్రం ఒడ్డునే ఉన్నది. కొడుకు జబ్బువాడు కావటంచేత విజనకుమారి ఇల్లు కదిలేదికాదు వకుళ విజనకుమారి పినతల్లి వెంట ఆలయంలో ఎక్కువకాలం గడిపేది. వకుళతో వచ్చిన సౌదామినికి వరండాలో కూర్చుని సముద్రంకేసి చూడటం సరదా అందుచేత ఆమెకూడా విజనకుమారిలాగే ఎక్కువ సేపు ఇంటి నంటిపెట్టుకుని ఉండేది.

వాళ్ళిద్దరూ కూర్చుని ఒకనాడు వకుళను గురించి మాట్లాడుకున్నారు. తన భర్త మరొకతెను పెళ్ళాడటానికి ఒప్పుకోవటంలో ఆమె ఎవరినీ సంప్రతించక తొందర పడింది; మనస్సు చెడిపోయి దేవుళ్ళకు దణ్ణాలు పెట్టుకుంటున్నది! తన అన్న కిరాస్తానీదాన్ని చేసుకోవటం సౌదామినికి ఇష్టం లేదు

ఆరోజే విజనకుమారిభర్త విపినబాబు కొక టెలిగ్రాం వచ్చింది. విజయుడికి జబ్బుచేసింది; సాయంకాలం బండికి మద్రాసునుంచి వస్తున్నాడు; అతనివెంట ఒక డాక్టరుకూడా వస్తున్నారు; రైలుకు మేనా పంపాలి.

విజయుణ్ణి రైల్లోనుంచి దించి మేనాలో చేర్చేసమయంలో అతను జ్వరంతో



వళ్లు తెలియనిస్థితిలో ఉన్నాడు. అతన్ని ఇంటికి చేర్చాక విపినబాబు పూరీలో ఉండే సివిలుసర్జన్ను పిలిపించి పరీక్ష చేయించాడు. విజయుడికి తగిలిన జర్వం టైఫాయిడ్ లోకి దించవచ్చునని డాక్ట రన్నాడు.

విజయుడి జ్వరం తెల్లవారుజామున కొ స్త తగ్గింది. అతను కళ్ళు తెరిచి వకుళను చూశాడు. విజయదశిమినాటికి ఆతను తన భార్యను చూసినందుకు తృప్తిపడి. సుశీనికూడా చూడాలని ఉన్నట్టు ఆమెతో అన్నాడు. అతనికి బతకనని అధైర్యం పట్టుకున్నది.

తెల్లవారుతూనే వకుళ సుశీకి ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం ఇప్పించింది.

ఆ టెలిగ్రాం అందకపూర్వం సుశీకి మద్రాసునుంచి విజయుడు పంపిన టెలి గ్రాములు రెండు అందాయి అతను మద్రాసు చేరినట్టు ఒక టెలిగ్రాం ఇచ్చాడు; పాల్‌కు లోగడ పెళ్ళి అయినట్టు రిజిస్టరులో ఉన్నదని మరొక టెలిగ్రాం ఇచ్చాడు. తరవాత ఏ వార్తాలేదు. ఆమె ఆదుర్దా పడుతుండగా వకుళ పంపిన టెలిగ్రాం వచ్చింది.

సుశీకి ఆ రాత్రిదాకా బండీలేదు తా నా బండికి బయలుదేరుతున్నా నని వకుళకు టెలిగ్రాం ఇచ్చి, ఏం చెయ్యటానికీ తోచక ట్రా మెక్కి, కాళీఘాటుదాకా వెళ్ళి, తన కాబోయే భర్తను కాపాడమని కాళీమాతకు మనసులో. దణ్ణం పెట్టుకున్నది.

సుశీని తీసుకురావటానికి విపినబాబు స్టేషను కెళ్లాడు. వకుళ ఆమెను చెయ్యి

పట్టుకుని మేడమీద తనగదికి తీసుకుపోయింది. తరవాత ఇద్దరూ విజయుడు పడుకున్న గదికి వెళ్ళారు. సౌదామిని అతనికి కాళ్లుపట్టుతున్నది. అతను నిద్ర పోతున్నాడు. విజయుణ్ణి చూడగానే సుశీకి కంట నీరు తిరిగింది వకుళ ఆమెను చప్పున ఇవతలికి తీసుకువచ్చి, ఆమె కళ్ళు తుడుస్తూ, "ఏడవ్వద్దు. భయం దేనికి? భగవంతుతున్నాడు." అన్నది.

తాను క్రిస్టియను కావటంచేత ఆ ఇంట్లో మిగిలినవారికి ఇబ్బందిగా ఉంటుందేమో నని సుశీ భయపడింది. కాని తమకూ విజనకుమారికీ అలాటి పట్టింపులు లేవని వకుళ ఆమెతో అన్నది.

సుశీ స్నానం చేసేసరికి విజయుడు నిద్ర లేచి ఆమె వచ్చిందా అని అడిగాడు సుశీ అతని దగ్గిర కెళ్ళి కనబడింది అది మొదలు అతనికి అస్తమానమూ దగ్గిర ఉండి ఆమె అన్ని ఉపచారాలూ చేస్తూవచ్చింది.

"ఎవతో వచ్చి నీ భర్తను కాజేసుకుపోతుంటే, నువు చూస్తూ ఊరుకోవటం ఏమీ బాగాలేదు." అని విజనకుమారి వకుళను హెచ్చరించింది. వకుళ ఆమె మాటలు పట్టించుకోలేదు.

ఉన్నట్టుండి కలకత్తానుంచి విజయుడి వదిగారు దిగింది. ఆవిడ చాలా ఆచారవంతురాలు. తన వెంట పెద్ద బిందెడు గంగాజలం తెచ్చుకున్నది. ఆమె విజయుణ్ణి చూసి, "నీకు జబ్బు నయమవుతుంది. కాళీమందిరంలో పూజ చేసి వచ్చాను. తులసికోటలో నుంచి మృత్తిక తెచ్చాను," అంటూ మన్ను తీసి అతని నుదుటికీ, నెత్తికీ రాచింది.

ఆమె అక్కడ ఉండగానే సుశీ వచ్చి అతనికి ఔషధ మిచ్చింది.

"నువు ఎవ రమ్మాయ్?" అని ఆవిడ సుశీని అడిగింది

"మా స్నేహితురాలు," అని సౌదామిని చెప్పింది.

"ఎవరో కిరస్తానీ నర్సు అనుకున్నా," అన్న దావిడ.

కాని ఆమెకు సుశీ సంగతి తెలియనే తెలిసింది. ఆవిడ మండిపడి, సుశీని చీపురుతో వెళ్ళగొడతా నన్నది. గంగా జలం వెంట ఉండటం ఆవిడకు చాలా మేలయింది. సుశీ రావటంచేతనే విజయుడు కోలుకుంటున్నా డని విని ఆవిడ కొంత వరకు సమాధానపడింది

ఇరవై రెండో రోజు విజయుడికి జ్వరం రాలేదు. డాక్టరు సలహా మీద విజయుడు మరొక నెలపాటు పూరీలోనే ఉండిపోయాడు. కాని అతని వదినెగారు మాత్రం అతనికి పథ్యం పెట్టగానే కలకత్తాకు తిరిగిపోతూ, సుశీనికూడా తనతో వచ్చెయ్యమన్నది "నీ మంచి కోరే చెబుతున్నాను. నీకు ప్రపంచజ్ఞానం లేదు. తరవాత పశ్చాత్తాపపడతావు. నీ ప్రాణంతో బాటు మరిద్దరి ప్రాణాలుకూడా తీస్తావు." అన్నదామె సుశీతో. అంతతో పోనివ్వక, సుశీ తన వెంట కలకత్తాకు బయలు దేరాలని చాలా తొందరపెట్టింది.

"నే నిప్పుడు రాను. తరవాత వెళతాను," అన్నది సుశీ స్పష్టంగా.

విజయుడి వదినెగారు వెళ్ళిపోయాక కూడా సుశీ మనసు మనసులో లేదు. "అలా ఉన్నావేం?" అని వకుళ అడిగితే, ఆమె ఏమీ చెప్పలేదు.

"మా తోడికోడలు ఏమైనా అన్నదా?" అని వకుళ అడగింది.

"నన్ను తన వెంట కలకత్తా రమ్మన్నది. నేను వెళ్ళి ఉండవలిసిందేమో, అక్కా. నే నిప్పుడు ఎవరికీ తెలియకుండా వెళ్ళిపోతే ఏమిటి నష్టం?" అన్నది సుశీ దీనంగా.

"ఏమిటీ వెర్రిమాటలు? నీమీద ఆశలు పెట్టుకునిఉన్న మనిషి ఏమవతారను కున్నావు? ఆయన ని న్నేమన్నా అన్నారా ఏమిటి?"

"లేదు. నాకే అనిపిస్తున్నది"

వకుళ సుశీకి ఎంతో మంచిగా నచ్చజెప్పింది. తన భర్త సుశీని పెళ్ళాడటం చేత తన జీవితం ఏమీ భ్రష్టయిపోదన్నది. ఇద్దరు స్త్రీలు ఒక భర్తతో ఎందుకు కాపరం చెయ్యగూడదని అడిగింది.

విజయుడికీ సుశీకీ వివాహం జరపటానికి శుక్రదేవ నీలాంబర త్రివేదీ అనే ఆయన వచ్చాడు. సుశీకి ప్రాయశ్చిత్తకర్మ జరిపించి, తరవాత మూడురోజులకు వివాహం ఏర్పాటు చేశాడు. రేపు కోర్టు తెరుస్తారనగా విజయుడికీ సుశీకి వివాహ మయింది.

పెళ్ళికాగానే సుశీ వకుళ కాళ్ళకు దణ్ణం పెట్టింది. వకుళ ఆమెకు బంగారు కుంకుమ బరిణ ఇచ్చి, "ఈ కుంకం నీకు అక్షయంగా ఉండుగాక!" అన్నది.

ఇద్దరూ కౌగలించుకుని ఆనందబాష్పాలు రాల్చారు.

# మెత్తని చెప్పు దెబ్బ!

నాగేశ్వర్రావ్, 'నోట్లో నాలిక లేని వాడు!' అది వుండేచోటు భుజం కష్టుక! అదే అతగాడి ప్రత్యేకత.

'నాగులుగాడి కదో జబ్బు!...' ఆఫీసులో తన యీడువాళ్లంటూంటారు.

'అయ న్దదోరకం తత్వం!'... వయసుమీద గౌరవంకొద్దీ అతగాడికంటె కొంచెం చిన్నవాళ్ళనే ముక్కలు.

'నాగేశ్వర్రావుగారు చాలా యింటరెస్టింగ్ పెర్సన్!'... ఆఫీసులో నిన్న కాక మొన్న చేరిన కుర్రకారనుకునే మాటలు.

మొత్తంమీద నాగేశ్వర్రావంటే అందరికీ తలో అభిప్రాయవూ వున్న మాట నిజం.

నలభైకీ — నలభైఆయిదుకీ మధ్యనుంటాడు నాగేశ్వర్రావ్. పండిపోయిన తల. పీక్కుపోయిన మొహం. ఎండిపోయిన ఎముకలగూడు. చూట్టానికి పీనుగులా వుంటాడు. అయితే నేం, ఏనుగు కున్నంత శక్తీ, గాడిద కున్నంత ఓపికా వున్నాయ్, నాలిక భుజాన వేసుకుని వూరేగటానికి!

అదృష్టం బాగుండో, ఖర్మం కాలో గాని...రెండేరెండు మార్కు లెక్కువ వచ్చి నాగేశ్వర్రావ్, ఎమ్మే—థర్డ్ క్లాస్! భావాలూ, బుద్ధులూ మరేక్లాసో తెలియదు!

అతగాడు నోరు విప్పితేచాలు, 'ఒరే నాగులూ! వెథవ్వాగుడు వాక్కు పెద్దనాయనా. నీకు పుణ్యం వుంటుందీ!'... యీడువాళ్ళంతా యీసడించుకోవటవే.

వినీ విననట్లూ, అంటీ అంటనట్లూ వుంటారు మధ్యతరగతివాళ్ళు మనకెందుకులే, పోనీ, పెద్దవాడని

యిహ మిగిలినవాళ్ళల్లా మూడోరకం కుర్రకారే, మూడోతరగతి ఎమ్మేగారికి తాళం వెయ్యటానికి, తందాన పాట్టానికి.

డిస్పాచింగ్ క్లార్కు కుమారిరాజ్యం మీద గబ్బు లేపింది . నాగేశ్వర్రావ్ కాదూ?

గంపెడు సంసారాన్ని గట్టెక్కించకుండానే, తండ్రి గుటుక్కుమంటే....

---

అవసరాల నారాయణరావ్

యిద్దరు చెల్లెళ్ళు, ముగ్గురు తమ్ముళ్ళు. తనూ, తల్లీ, యింతమందికీ గడిచే విధానం లేక, యల్లయిసీ ఆఫీసులో క్లార్కుగా చేరింది. అశుభం, శుభం తెలియని అమాయకురాలు రాజ్యం.

రాజ్యం ఆఫీసులో అడుగుపెట్టి ఆర్నెల్లయిందో లేదో, ఆమెనూ, ఫీల్డాఫీసర్ భాస్కర్రావునూ కలిపి, యిద్దర్నీ తన నాలుకతో మెలిపెట్టి చుట్టి, వీధిలోకి లాక్కెళ్ళింది పీనుగులాంటి నాగేశ్వర్రావే.

ఆఫీసుల్లో పని చేసే ఏ ఆడదానికి నిజాయితీ వుండేడిసింది? నీతి నియమాలు తగలడ్డాయ్? తల అమ్ముకున్నాక శీలం ఆగిచస్తుందా? మగాళ్ళమందలో పడి మసుల్తోంటే... ఏవిటో పిచ్చిమాట కాకపోతే?...' అని లెక్చర్లు దంచి, ఆఫీసులో వున్న నూనూగు మీసాల కుర్రాళ్ళ నందర్నీ రెచ్చగొట్టి, ఆమెమీద తుసికొల్పింది యీ పీక్కుపోయిన మొహంకాదూ?

స్వింగ్ డోర్ కిర్రుమంది.

హాల్లో స్టాఫంతా ఆఫీసరు గదివైపు చూశారు.

గదిలోంచి వస్తోన్నది గంభీరమైన మూర్తి! జేవురించిన మొహం! అవమానంతో అట్టుడికిపోతోన్న అభిమానవతి రాజ్యం!

హాలు నడిమధ్యలో ఒక్కసారాగిందామె. "నాగేశ్వర్రావుగారూ! ఓసారిటొస్తారా? మీతో కొంచెం మాట్లాడవలసిన పనుంది." గంభీరంగా కన్పిస్తోన్న రాజ్యం గొంతులోంచి సౌమ్యమైన, శ్రావ్యమైన సంబోధన!

ఆశ్చర్యంతో అంతా కళ్ళప్పగించి చూస్తున్నారు ఎందుకా అని.

అక్కడంతమంది వుండగా ప్రత్యేకంగా తననే ఎందుకు పిలుస్తున్నదో అర్థం కాలేదు నాగేశ్వర్రావుకి

అయినా సీట్లోంచి లేచి, యాంత్రికంగా వచ్చి ఆమెముందు నించున్నాడు, 'ఎందుకు పిలిచా' రన్నట్టు చూస్తూ.

"చూడండి రావుగారూ! వయసులోనూ, చదువులోనూ మీరునాకంటె అధికులు! తండ్రంతటివారు. మీకూ నాఅంత కూతు రుంది. కాని నాలా నౌకరీ చేసి కుటుంబాన్ని పోషించవలసిన గతి ఆమెకు పట్టకూడదనే నా కోరిక. కాని, ఒకవేళ అటువంటి దుర్ఘటనే దురదృష్టవశాత్తూ జరిగితే – గాడ్ ఫర్బిడ్!– సహృదయం, చిత్తశుద్ధి గల భాస్కర్రావుగారిలాంటి స్నేహితులు పెద్దన్నగారిలా అవతరించి, అండగా నిల్చి, ఆపత్సమయంలో ఆదుకుంటా రని నా నమ్మకం".

రాజ్యం – అడుక్కునయినా బ్రతుకుతాను గాని, ఆఫీసుల్లోమాత్రం పని చెయ్యకూడ దనుకున్న రాజ్యం – చరచరా వెళ్ళిపోయింది, మెట్లు దిగి

కొయ్యబారిపోయిన ఎముకలగూడును చూసిన కళ్ళల్లో సానుభూతి మెదిలింది.

---

# సాగరసంగమము

ఆనందారామం

ఆనందం మూర్తీభవించినట్లుగా ఉంది కళాశాల కోలాహలం. రంగురంగుల సిల్కుచీరెలూ, నైలాను మిలమిలలూ, పంజాబీదుస్తులూ, కొన్ని బురఖాలూ, మరికొన్ని ఫ్రాకులూ హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నాయి. కొంతమంది అమ్మాయిలు తమ పైటచెంగుకు వాలంటీరుబాడ్జీ తగిలించుకొని, వచ్చినవారందర్నీ ఆహ్వానించి కూర్చోబెడుతున్నారు. "ఆదివారం మా కాలేజీ వార్షికోత్సవం; రాకపోతే చూడు" అని నిరంజని వారంరోజుల్నించీ సుధాకర్‌ని రోజూ హెచ్చరిస్తూంది. "ఆడవాళ్ళ కాలేజీకి నేనెందుకూ?" అన్నాడు విసుగ్గా. అతడికి తగని మొహమాటం. "మహా మొగధీరుడివి బయలుదేరావు లెద్దూ! కాలేజీ ఆడవాళ్ళదయినా వార్షికోత్సవానికి లెక్కలేనంతమంది వస్తారు. నువ్వు రానని తప్పించుకుంటే ఊరుకోను," అంది నిరంజని బుంగమూతితో. సుధాకర్ వస్తానని ఒప్పుకున్నాడు. నిరంజని వాలంటీర్‌గా తన పేరుకూడా ఇచ్చింది. ఆ కారణంగా ఉత్సవం ప్రారంభసమయానికంటె ముందుగా వెళ్ళవలసి వచ్చింది.

"నిన్నే పిల్లీ ఎత్తుకుపోదుగాని, తప్ప



తుందా రా. సుధన్నయ్యా!" అని మరీ మరీ చెప్పివెళ్ళింది నిరంజని

సుధాకర్‌కు ఈ అహ్వానం పెద్ద సంతోషాన్ని కలిగించలేదు. ఇంతకంటె హాయిగా క్లబ్బుకు పోయి, కాసేపు పేకాడుకుంటేనే అతని ప్రాణానికి హాయిగా ఉండేది.

రిక్షా దిగితూనే అక్కడి జనసమూ



హాన్ని చూసి కొన్ని క్షణాలు విశ్రాంతి కలిగింది సుధాకర్‌కి. అతని కళ్ళు క్షణంలో సగం కాలం నిరంజనికోసం చుట్టూ చూశాయి. నిరంజని ఎక్కడా కనిపించలేదు. అలా ఆడపిల్లలవంక తేరి చూడడం అసహ్యంగా ఉంటుందని ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు తడ బాటుతో అటూ, ఇటూ చూస్తుంటే ఎవరో విద్యార్థిని "ఇటు రండి" అంటూ దారి చూపించింది. సుధాకర్ రెండడుగులు వేసేసరికి, తన ప్రక్కగా ఒక పండు ముసలిది కర్ర చేత్తో పట్టు కుని వణుకుతూ తూలిపోతూ రావడం కనిపించింది. అడుగు తీసి అడుగు పెట్ట లేకపోతూంది ఆ ముసలమ్మ. అక్కడ వున్న పందలాది ఆడపిల్లలలో ఒక రయినా, పాపం, ఆ ముసలిదానివంక చూడటంలేదు. ముగ్గుబుట్టలాంటి తలతో ఊగుతూవచ్చే ఆ ముసలమ్మ నడవలేక కొద్దిగా తూలింది. వెంటనే సుధాకర్ ఆ ముసలమ్మ పక్కగా వచ్చి "అవ్వ గారూ! నేను తీసికెడతాను రండి," అంటూ ఆవిడ చెయ్యి పట్టుకున్నాడు. ఆ ముసలమ్మ మరింత వణుకుతూ "వద్దులే నాయనా!... నువ్వు నడు..." అంటూ చెయ్యి వదిలించుకోబోయింది.

కాని సుధాకర్ ఆమె చెయ్యి వదల కుండా "ఫరవాలేదు అవ్వగారూ! నేను కూడా మీ మనవడ్నే అనుకోండి, రండి రండి" అంటూ ఆవిడని నడిపించ సాగాడు. "నూ...రే...ళ్ళు... వర్ధిల్లు...తండ్రీ" అంది ముసలమ్మ. అతని వెనుకనే నడుస్తూ. తమ వెనకాలే జేబురుమాలు నోటి కడ్డం పెట్టుకుని, ముసిముసిగా నవ్వుకుంటున్న ఆడపిల్లల్ని చూసేసరికి, సుధాకర్‌కు అరికాలిమంట నెత్తి కొచ్చింది. వీళ్ళు సహాయం చెయ్యరు, పైగా సహాయం చేసేవాళ్ళని చూసి నవ్వుతారు' అనుకున్నాడు కసిగా.

కొద్ది దూరంలో నిరంజని కనుపిం చింది. ప్రాణం లేచివచ్చి నట్లయింది సుధాకర్‌కు. "నిరూ"... అన్నాడు. ఎవరితోనో మాట్లాడుతున్న నిరంజని సుదాకర్ వంకతిరిగి, ఒక్కసారి నిర్ఘాంత పోయి "ఇదేమిటి?" అంది.

"మానవధర్మం" అన్నాడు సుధాకర్ రొమ్ము విరుచుకొని.

నిరంజని పకాలున నవ్వింది. అక్క డున్న చాలామంది ఆడపిల్లలు కొంత మంది ముసిముసిగా నిరంజనితో శృతి కలిపారు. సుధాకర్‌కు ఉడుకుమోత్తనం, రోషం పెరిగిపోయాయి.

"ఏందు కొచ్చిన చదువులూ, సంస్కారం లేకపోయాక ........." కోపంగా అన్నాడు. సుధాకర్ కోపానికి కూడా నిరంజని దగ్గర్నుంచి పెద్ద నవ్వే సమాధాన మయింది. సుధాకర్ చిరాకు పడ్డాడు నిరంజని అంతటితో సర్దుకుని ఆ ముసలావిడ చెయ్యి తను తీసికొని "నేను ఈవిడను భద్రంగా కూర్చో




పెడతానులే ! నువ్వు వెళ్ళి కూర్చో; అదిగో అక్కడనే మొగవాళ్ళ సీట్లు ఉన్నాయి" అంది.

సుధాకర్ 'బ్రతుకు జీవుడా !' అనుకున్నాడు. ఆ ముసలావిడ మళ్ళీ వణికే గొంతుకతో "నూ...రే...ళ్లు... చల్లగా...వర్ధిల్లు ...నాయనా" అంది.

నిరంజనీ, మిగిలిన విద్యార్థినులూ నవ్వులు మళ్ళీ ఒంటిమీద తేళ్లూ, జెఱ్ఱులూ పాకుతున్నట్లుగా ఇంచు మించు పరుగు లాంటినడకతో తన సీటు చేరుకున్నాడు సుధాకర్. అతని అదృష్టం బాగుంది. అక్కడికి అతడిక్లాస్‌మేట్ ధర్మారావుకూడా వచ్చాడు. ఇద్దరూ హాయిగా కబుర్లలో పడ్డారు. కొద్దిక్షణాలలోనే తెర లేచింది. ప్రసంగాలూ, నాటికలూ, నృత్యాలూ అయి, బహుమతిప్రదానఘట్టం వచ్చింది. ఆటలలో గెలుపొందినవారికీ, పరీక్షలలో అత్యుత్తమ మయిన మార్కులు సంపాదించినవారికీ, నాటికలలో ఉత్తమ నటన ప్రదర్శించినవారికీ బహుమతు లీయబడ్డాయి 'ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటీషన్, ఫస్ట్ ప్రైజ్ — ముసలమ్మ' అని మైక్‌లో ఎనౌన్స్ చేశారు. ముసలమ్మ వేషధారిణి స్టేజీమీదకు వచ్చి బహుమతి అందుకొంది. సభలో కరతాళధ్వనులు మార్మోగుతూంటే సుధాకర్‌కు పూర్తిగా మతిపోయింది. ఇందాకటి విద్యార్థినుల నవ్వులకు కారణం తెలిసింది. నిరంజని ఎందుకు నిర్ఘాంతపోయిందో, తర్వాత ఎందుకంత నవ్విందో బోధ పడింది. సిగ్గుతో కుంచించుకుపోయాడు.

"ఆ ముసలమ్మ వేషం వేసిన మానస మా మరదలు. వేషధారణ, నటన చాల చక్కగా ఉన్నాయి కదూ ! ఇంటిదగ్గర నాతో తను ముసలమ్మలా నటిస్తున్నానని

చెప్పబట్టికాని, లేకపోతే నేనుకూడా గుర్తు పట్టలేకపోయేవాడినే!" అన్నాడు ధర్మారావు.

సుధాకర్ ఏం మట్లాడలేక అవునన్నట్లు తల ఊపాడు. అందరూ లేచారు నిరంజని వచ్చి సుధాకర్‌ను కలిసికొంది. సుధాకర్ ధర్మారావును పరిచయం చేసాడు! నిరంజని నవ్వి, నమస్కారం చేసి "ఈయనతో నాకు పరిచయం లేకపోయినా తెలుసు మా మానస బావగారు." అని తన ప్రక్కనే ఉన్న అమ్మాయిని సుధాకర్‌కు పరిచయం చేస్తూ, "ఈమె మానస, నా క్లాస్ మేట్, నా స్నేహితురాలు. ఇందాక నువ్వు విశాల హృదయంతో సహాయం చేసిన ముసలమ్మ." అంది. అందమైన మానస ముఖంలో చిరునవ్వు వెలిగింది గులాబీ మొగ్గలవంటి చేతులు జోడించింది. సుధాకర్ ముఖం ఎఱ్ఱబడింది తడబడుతూ "క్షమించండి" అన్నాడు. మానస చిరునవ్వుతో "క్షమించడానికి మీ రేం తప్పు చేశారూ? మిమ్మల్ని నా మనవడిగా భావించమన్నారుగా. అలాగే భావించాను." అంది. నిరంజని మళ్ళీ పకపక నవ్వింది విషయం తెలియని ధర్మారావు ఆశ్చర్యంగా "ఏం జరిగింది?" అన్నాడు. మానస నవ్వుతూ జరిగింది వివరించేసరికి, అతడుకూడా హాయిగా పకపకా నవ్వాడు. పాపం, అసలే సంకోచపడే స్వభావం గల సుధాకర్ పరిస్థితి మరీ దయనీయంగా తయారయింది.

"ఇంక మేం సెలవు తీసికొంటాం! రా సుధన్నయ్యా!" అంది నిరంజని.

ధర్మారావు అడ్డు తగిలి తన కారులో వా రిద్దరినీ డ్రాప్ చేస్తానని అన్నాడు. మొదట నిరంజనీ, సుధాకర్‌లు మొహమాట పడ్డారు; కాని మానసకూడా గట్టిగా బలవంత పెట్టేసరికి ఒప్పుకున్నారు.

కారు డ్రైవ్ చేస్తూ ధర్మారావు "మానసా! నీ వేషధారణ, నటనం. అద్భుతం అనడానికి ఇంతకంటే పెద్ద నిదర్శనం ఏం కావాలి?" అన్నాడు.

సుధాకర్ ఇంకా సిగ్గుపడుతూ "నాకు కొంచెం కూడా అనుమానం కలుగలేదు చాలా సహజంగా ఉంది." అన్నాడు.

"ఇప్పటికి మూడేళ్ళనుంచీ మానసదే ఫస్టు ప్రైజు, ప్రతి ఏడాదీను. లాస్ట్ ఇయర్ కూరగాయ లమ్మిగా వేషం వేసింది. బిఫోర్ లాస్ట్ ఇయర్ సోదమ్మి వేషం వేసింది. అప్పుడూ అందరూ ఇలాగే ప్రశంసించారు" అంది నిరంజని.

"జరిగిన సంఘటన, నా సామర్థ్యం కంటే మీ అన్నయ్య సంస్కారానికే ఎక్కువ నిదర్శనం" అంది మానస.

"సంస్కారం లేనిదా న్నని నన్ను తిట్టిపోశాడు." అంది నిరంజని.

"నిజంగా, నిరూ! అప్పుడు మీ అన్నయ్య చూపించిన ఆప్యాయత తలుచుకొంటే, ఇప్పటికీ చాలా గౌరవం కలుగు



"నిన్ను తప్పక పెళ్ళి చేసుకుంటాను మీనా! నీ మాదిరిగా ఇదివరకు చాలా మందిని చేసుకున్నాను. నిన్నుమాత్రం ఎందుకు నిరాశపరుస్తాను."

తుంది మీది చాలా జాలిగుండె సుధాకర్ గారూ'' అంది మానస.

ధర్మారావు అందుకుని "ఇంకా మెల్లిగా అంటావా? నవనీతం. కాలేజీలో కూడా వీడి సోషల్ సర్వీస్‌కు అంతుండదు. ఇంత మందికి ఇన్ని విధాల సహాయం చేస్తాడు కాని. మొన్న పరీక్షలలో కామేశానికి ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పమని ఎంత దీనంగా బ్రతిమాలుకున్నా వీడిగుండె కరగలేదు," అన్నాడు.

"ఎలా ధర్మా! అది నా అంతరాత్మకు విరుద్ధమయినపని. కొన్నికొన్ని సందర్భాలు జాలి చూపించకూడనివి ఉంటాయి. ఇది అట్లాంటిది. ఇక్కడ జాలి చూపటమే అన్యాయం," అన్నాడు సుధాకర్.

క్రమంగా సుధాకర్ ధర్మారావులు వాళ్ళ కాలేజీ కబుర్లలో పడిపోయారు. ఇంతలో నిరంజని ఇల్లు సమీపించింది. ధర్మారావు కారు ఆవుచేశాడు. సుధాకర్ నిరంజని దిగి ధర్మారావుకు, "థేంక్స్" చెప్పారు. దర్మారావు "నో మెన్షన్" అని తనకారును గృహోన్ముఖం చేశాడు,

## 2

మానవుని ప్రతి చిన్న అనుభవమూ మనస్సుకు సంబంధించినది. ఒక వృద్ధురాలికి సహాయపడ్తున్నట్లుగా, తాను భావించినంతకాలమూ, మానస హస్త స్పర్శ; సుధాకర్‌లో ఏ విధమయిన సంచలనమూ కలిగించలేదు కాని ఆ వ్యక్తి వృద్ధురాలు కాదు; 'మానస అని తెలిసిన తరువాత స్పర్శాకాలంలో ఏమీ అనుపించని ఆ స్పర్శాస్మృతి అతనికి గిలిగింతలు పెడుతూంది. మానసతో జరిగిన సంభాషణా, కాంతులు విరజిమ్మే ఆమె కళ్ళూ, వెన్నెలలాంటి ఆమె మందహాసమూ తప్ప అతని మనోవీధిలో మరొకటి స్థానం కల్పించుకోలేకపోతూంది. తన కొడుకు పరధ్యానము గుర్తించిన సీతమ్మ చాలా కలవరపడింది. సుధాకర్ పరధ్యానం ఆమె కలవాటయినదే అయినా, ఈసారి మరీ శృతిమించి రాగాన పడింది. చారూ అన్నం తిని పెరుగుమాట మర్చిపోయి, చెయ్యి కడిగేసుకున్నాడు సుధాకర్. వంటింట్లోంచి పెరుగుగిన్నెతో ఇవతలకు వచ్చిన సీతమ్మగారు ఆశ్చర్యపోయి "సుధా! పెరుగుపోసుకోవా?" అంది.

తను పెరుగు పోసుకోలేదన్న సంగతి అప్పటికి తెలిసింది సుధాకర్‌కు. సిగ్గుపడి "కొంచెం జలుబు చేసిందమ్మా అందుకు ఇవాళ పెరుగు మానేద్దా మనుకున్నాను," అన్నాడు. "అన్నీ అబద్ధాలు. నీకు జలుబెక్కడ చేసిందీ? పెరుగు సంగతి మర్చిపోయావు. దేన్ని గురించి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావో చెప్పు" కష్టంగా అంది సీతమ్మ.

"పరీక్షలు దగ్గరి కొస్తున్నాయమ్మా!" తప్పించుకోవా లని చూశాడు సుధ.

"అందుకే అంతగ చదువుతున్నావు," అప్పుడే అక్కడికి వచ్చిన నిరంజని అందుకొంది. వాస్తవానికి అప్పటికి పది పదిహేను రోజుల్నుంచీ అంటే నిరంజని ఆహ్వానంమీద వుమన్స్ కాలేజీ కెళ్ళి వచ్చినప్పటినుండీ, సరిగ్గా పుస్తకం తెరవలేదు సుధ.

సుధాకర్ నవ్వుతూ నిరంజని నెత్తి మీద ఒక మొట్టికాయ వేసి బయటకు వెళ్ళిపోయాడు.

"చూడు నిరూ! ఈమధ్య వీడి ధోరణి ఇలా తయారయింది," అంది దిగులుగా సీతమ్మ. నిరంజని నవ్వుతూ "పెళ్ళి చేసేసెయ్యి పిన్నీ! అన్ని రోగాలూ కుదిరిపోతాయి" అంది.

సీతమ్మగారు ఉలిక్కిపడి "ఆదేమిటి నిరూ, మొన్న మీ కాలేజీకి వచ్చినప్పుడేమైనా జరిగిందా? అప్పటినుంచే బొత్తిగా ఇలా తయారయ్యాడు," అంది. నిరంజని తెల్లబోయింది. ఆ పైమాట లామె కేవలం నవ్వుతాలకు అంది. తన పినతల్లి ఇలా మాట్లాడగానే నిరంజని మనస్సులో మానస మెదిలింది. సౌందర్యానికి నిర్వచనం మానస. ఆమె




ఎవరి హృదయాన్నైనా ఆకర్షించగలదు. కొంపదీసి సుధన్నయ్య తన హృదయంతో మానసను ప్రతిష్ఠించుకోలేదు గదా! ఇంతకంటె అవాంఛనీయమైన సంగతి మరొకటిఉండదు. ఇదే నిజమైతే ఈ భావనను మొగ్గలోనే తుంచెయ్యాలి. తన పినతల్లి ఏం మాట్లాడింది గూడా వినిపించుకోకుండా గబగబ బయటకు వచ్చింది నిరంజని. ముందు వరండాలో పడకకుర్చీలో కూర్చుని ఇలస్ట్రేటెడ్ వీక్లీ తిరగేస్తున్నాడు సుధ. నిరంజని వచ్చి ఆతని పక్కన కూర్చుంది. ఎన్నో విషయాలు అతనికి చెప్పాలని; కాని ఎలా చెప్పాలో అసలు విషయాన్నెలా కదపాలో నిరంజని కర్థం కావటంలేదు

"నిరూ!" సుధాకర్ తానే పిలిచాడు.

"ఏమి టన్నయ్యా?"

"నీ కామె బాగా దగ్గర స్నేహితురాలా?"

"ఎవరూ?"

"నీకు తెలుసులే! చెప్పవూ?"

"బాగుంది! నువ్వు చెప్పకుండా నా కెలా తెలుస్తుందీ?"

"నీకు తెలుసనడానికి నీ పెదవులమీది అల్లరినవ్వే సాక్ష్యం"

"మానస సంగతేనా?"

"ఊ! ఎప్పుడూ నీతో మనింటికి రాలేదుకదూ! నువ్వు రమ్మంటే రాదా!"

"అయ్యబాబోయ్! అప్పుడే అంత వరకూ వచ్చిందా కథ?"

"నీ తలకాయ, కథాలేదు కాకరకాయా లేదు ఊరికే అడుగుతూంటే..."

కథలేదు కాని, కాకరకాయ తప్పకుండా ఉంది. అంటే కాకరకాయ చేదులాంటి నిజం నీయెత్తు ధనం పోసినా మానస మనింటికి రాదు"

"అదేం నిరూ? అంతగర్వమా?"

"ఏకోశానా గర్వంలేదు."

"మరి."

"చెప్పమంటావా? మనం హరి జనులం, మన ఇంటి పరిసరాలకుకూడా మానస రాదు ఒకవేళ కర్మవశాత్తూ వస్తే వెంటనే ఇంటికి వెళ్ళి, తలారా స్నానం చేస్తుంది"

సుధాకర్ అత్యంతాశ్చర్యంగా నిరంజనివంక చూశాడు.

"ఏమిటి నిరూ! అంత చదువు కొన్నది. మాటలలో అంతసంస్కారం కనుపిస్తుంది. అంత సంకుచితమైన కుల తత్వాలు కలిగి ఉంటుం దంటావా?"

"అనక తప్ప దన్నయ్యా! నిజంగా మానసను ఎంత పొగిడినా తనివి తీరదు. చక్కని చుక్క, నిగర్వి, మిత భాషి, హుషారైనది, నవనీతంలాంటి మనసు, ఎంతో తెలివైనది. అయితేనేం చంద్రుడిలో మచ్చలాగ ఆ అమ్మాయిలో విపరీతమైన కులతత్వం నిండిఉంది. పళ్ళు తప్ప కాలేజీలో ఏమీ తినదు ఆ పళ్ళయినా తక్కిన బ్రాహ్మణ పిల్లలతో కలిసితప్ప తినదు నాతో తను ఇంత స్నేహంగా ఉండటానికి కారణం నా కులం తనకు తెలియకపోవటమే! నేనే తెలియనివ్వలేదు 'చాదస్తం' అని మేము వెక్కిరిస్తే 'అలాగే అనుకోండి, ఆ విషయంలో నన్ను వదిలివేయండి." అంటుంది నవ్వుతూ, ఒకరోజు ఏదో పుస్తకం కావలసివచ్చి తనతో కాలేజీ నుంచి వాళ్ళింటికి వెళ్ళాను తను లోపలకు వెళ్ళకుండా బయటే నిల్చుని వాళ్ళ అమ్మగారిని పుస్తకం అందియ్య మంది. నేను ఆశ్చర్యంతో కారణం అడిగాను.

"కాలేజీ బట్టలతో ఇంట్లోకి వెళ్ళను. ఈబట్టలు మార్చి స్నానం చేసి అప్పుడు లోపల తిరుగుతాను. మా అమ్మకు చాలా మడీ, ఆచారం. తన ఆచారం నే నెందుకు పాడుచెయ్యాలి? అదీగాక ఎవరిసంప్రదాయం వారు అనుసరించా లనే నా మతం అందులోనే అంద ముంది," అని సమాధానం చెప్పింది. విభ్రాంతితో ఇంకేమీ వాదించలేక పోయాను రోజూ తనలాగే చేస్తుం దట. ఇప్పుడు చెప్పన్నయ్యా! మాన సను మనింటికి తీసికొనిరావటం సాధ్య మవుతుందా? ఇట్లాంటి ఆలోచనలు రానియ్యకు."

సుధాకర్ కళ్ళు భారంగా మూతలు పడ్డాయి.

"నిరూ!" అన్నాడు కష్టంగా.

"నిజం అన్నయ్యా! మానస మన ఇంటికి రాదు. ఇంకోసంగతి..." నిరం జని అనింది.

"చెప్పు" కుతూహలంగా అడిగాడు సుధాకర్.

"ధర్మారావుగారు నీకూ తెలుసుగా? ఆయన మానసకు మేనత్త కొడుకు. మానస మాటలనుబట్టి వాళ్ళిద్దరిమధ్యా అనురాగం ఉందేమో ననిపిస్తుంది."



మా ప

సాంబారులో ఈగా! హుష్!! ఏదీ!
కాకి ఎత్తుకుపోయింది - ఇహ హాయిగా భోంచెయ్యగలరు.



"నిజమా?"

"నాకు తెలియదు. అలా అనిపించింది."

సుధాకర్ తన తల రెండుచేతులతో గట్టిగా పట్టుకున్నాడు. నిరంజని ఆ చేతులను తొలగించి తన చేతులలోకి తీసుకొని "ఆ ఆకాశంలో చందమామ కావాలని ఆరాటపడటం పసివాళ్ళ లక్షణం అన్నయ్యా! పిచ్చివాళ్ళుతప్ప జ్ఞానం వచ్చినవా ళ్ళెవరూ అట్లాంటి కోరికలు కలుగనియ్యరు. నీకు చెప్పేపాటి విజ్ఞానిని కాదు; ఆలోచించుకో!" అంది అనునయంగా.

"కాదు నిరూ! నేను పిచ్చివాడి ననుకున్నా నాకు బాధలేదు కాని, నాకు ఆ చందమామ కావాలి. చందమామను నా దగ్గరకు తెచ్చుకొంటాను, లేక నేనైనా చందమామదగ్గరకు వెళ్తాను. ఏమో నిరూ! నే నేం మాట్లాడుతున్నానో నాకే అర్థం కావటంలేదు. నువ్వెళ్ళు—" జీరబోయిన గొంతుకతో అన్నాడు సుధాకర్. నిరంజని గుండెల్లో రాయి పడింది. సుధ ఈ విషయంలో ఇంత లోతుకు పోయాడని ఆమె ఊహించలేదు. మానసవంటి సౌందర్యవతిని చూసి ఏదో మానవసహజంగా కలలు కంటున్నా డనుకొంది. 'మానసగురించి వివరంగా చెప్తే ఆ కలలు కరిగిపోతా యని ఆశించింది కానీ ఇంత క్షోభ పడ్తా డనుకోలేదు. ఏం చెయ్యాలో తోచక సీతమ్మతో చెప్పి, దిలుగుగా తమ ఇంటికి బయలుదేరింది. (సశేషం)





"తమసోమా జ్యోతి....

# అంతర్జ్వాల

వ్యధతో బరువెక్కిన మనస్సును సంబాళించుకోటానికి ప్రయత్నించింది. అవమానంతో ముక్కలయిన హృదయాన్ని అతకటానికి విఫలంగా ఆలోచిస్తోంది. అభిమానంతో ఆవేశపడుతున్న అంతర్యాన్ని ఊరడించలేక తల్లడిల్లిపోతోంది వత్సల. శరీరమంతా ప్రగాఢమయిన అసహ్యతతో వొణుకుతోంది. "ఎంత సంకుచిత మనస్తత్వం? చిన్న చిన్న విషయాల్లో కూడా తమ ఆధిక్యతను చూపెట్టుకోటానికి ఈ మగవాళ్లు విశ్వప్రయత్నం చేస్తారు. తనేం చేసిందని! హృదయానికి ప్రతిబింబం డైరీ! డైరీ వ్రాసుకోవటం తప్పా? ఆమాత్రం స్వాతంత్ర్యం అధికారం లేవా తనకు? ఎవరి మనస్తత్వం వారిది. బలవంతంగా హృదయాన్ని మెలిపెడితే – ఎలా అల్లాడిపోతారో తెలియని కఠిన హృదయమా తోటి మనిషిది? పురుషులది విశాల హృదయమంటారే - ఇదేనా? భగవాన్! స్త్రీని ఇంత అవమానకరంగా ఎందుకు సృష్టించావ్!" బాధగా కణతలు నొక్కుకుంది వత్సల. తన జీవితానికి పర్యాయపదమైన డైరీల వంక చూసింది. "డైరీ! డైరీ వ్రాయటమంటే తన కెందుకింత అభిలాష!! జ్ఞానం తెల్సిన దగ్గర్నుంచీ ఈ డైరీ ఎందుకిలా తన్ని ఆకర్షించింది? ఈ ఆసక్తి తనలో లోపిస్తేనే తన జీవితం సుఖప్రదమయేదేమో?" తన చిన్నతనంలో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది వత్సలకు.

తన కప్పటికి ఆరేళ్లు వుంటయ్. తెల్ల కాగితాలు ముక్కలుగా చింపి పుస్తకం ఓపిగ్గా కుట్టుకుంది. పెన్సలుతో తనకు తోచిన ముక్కలు వ్రాసి తన పుస్తకాల షల్ఫులో భద్రంగా పెట్టి ఆటలకు వెళ్ళింది. ఇంతలోనే శశి అన్నయ్య నవ్వు వినిపించింది. ఇంట్లో వున్న జనం అంతా పోగయారు. అందరి ముఖాలలోని ఆత్రం చూసి కొంచెం సిగ్గుపడ్డాడు శశి. తను అమ్మ కుచ్చెళ్లు పట్టుకుని చూస్తూ నిల్చుంది. "ఏమిటా వెఱ్ఱి నవ్వు? అమ్మ గాభరాగా అడిగింది. "చిట్టి చూడమ్మా! డైరీ వ్రాసింది." మళ్ళీ ఉప్పెనలా నవ్వు! తను చిన్నబోయిన వదనంతో అన్నయ్య వైపు చూస్తోంది. ప్రొద్దున్నే నిద్ర లేచితిని – మొహంకడిగితిని – స్నానం చేసితిని—" తెరలు–తెరలుగా నవ్వుతూ

గొల్లపూడి రాజ్యలక్ష్మి



చదవటం మొదలెట్టాడు. పట్టలేని కోపం ముంచుకొచ్చింది. అన్నయ్య చేతిలోని పుస్తకం లాక్కుని ఉక్రోషంతో ముక్కలు — ముక్కలుగా చింపింది. తను కళ్ళల్లో నీళ్ళు నాడుతూంటే అమ్మ ఒడిలో తల దాచుకుని వావురు మన్నది. అమ్మ ఆప్యాయతతో తన వీపు నిమురుతూ, "అన్నయ్యను

మందలించింది. "దీని సంగతి నీ కెందుకురా? ఇది చూడు ఎలా ఏడుస్తున్నదో?" పౌరుషంగా అన్నది తను - "నువ్వు వ్రాసుకోవటంలేదా డైరీ? నేనూ అంతే!" అన్నయ్య తన మాటలకు తిరిగి నవ్వుతూ "అలా కాదమ్మా! నేను నేర్పుతా లే!" అన్నాడు అనునయంగా. తన జీవితంతో పెనవేసుకునిపోయిన డైరీ కథ అలా ప్రారంభమయింది. ఆలోచనలతో - బాధాతప్తమయిన మనసుతో శూన్యంలోకి చూస్తూ కూర్చుంది వత్సల. పరిచితకంఠంతో వాస్తవానికి అడుగెట్టి తలుపు తీసింది. భాస్కరం వత్సల వదనం చూసి విస్మయపడ్డాడు. టేబిల్ మీద వున్న డైరీలను చూసి చిన్నగా నవ్వుతూ "ఇంకా ఆ పిచ్చిపోలేదా! రాసిన గ్రంథం చాలు! చింపి తగలెయ్!" అన్నాడు

వత్సల మనసు ఉడికిపోతోంది. నా డైరీలు చూడాల్సిన అవసరమేమిటి?" అతిప్రయత్నంమీద అడిగింది.

"ఏం? చూడకూడదా?"

"సభ్యత తెలిసిన మనిషి చేయదగిన పనికాదు!"

యింది వత్సల. "ఎమ్. ఏ. చదివాడు. విశాలభావాలు కనపర్చాడు; నిజంగా తన అదృష్టం అని మురిసిపోయింది. వాటి వెనుక నున్న ఈ భయంకర బలహీనతలు తను గుర్తించలేదు. ఇంత సంకుచితభావాలు దాగివున్నాయని తా నేనాడూ వూహించలేదు."

"కాఫీ ఇచ్చే దేమన్నా వుందా?"

ఉలిక్కిపడి లేచి ఫ్లాస్కులోంచి కప్పులోకి వంచి ఇచ్చింది.

"చూడు వత్సలా! ఈ డైరీ వ్రాయకపోతే ఏం? వ్రాయకుండా నేను బ్రతకటంలేదూ?"

"అన్నం తినటం ఎలా అలవాటు- ముఖ్యమో-అలాగే నాకు అలవాటు అయింది. మీరు కాదన్నంతమాత్రాన మానటం అసంభవమన్పిస్తోంది. నా ప్రాణంతోపాటే ఆ డైరీ కూడా..." కంఠం కంపించింది. అభిమానాన్ని కూడదీసుకుంటూ తిరిగి అన్నది. "ఐనాఅది నాపర్సనల్, ఈ విషయంలో మీరు ఇంటర్ ఫియర్ అవతగదు."

భాస్కరం రుద్రుడయ్యాడు. అవును లే! చదువుకున్న దానివి. ఉద్యోగం వెలిగిస్తివి. నా మాటంటే

భాస్కర మేనా? కాదు! కాదు!! ఇత నిలో ఏదో ఆవేసించి వుంటుంది!— అవును! స్త్రీ నిజంగా ఎప్పటికీ పురుషుడికి లోకువే! ఎన్నో సాధించా లనుకుంటారు స్త్రీలు అంతా భ్రమే!" అక్కడ నిలువ లేక తన గదిలోకి వెళ్లిపోయింది వత్సల. బాలీసు నానుకని కిటికీలోంచి చూస్తూ కూర్చుంది. భాస్కరం తలుపులు మూసి వెళ్ళిపోయిన చప్పుడయింది. భారంగా నిట్టూర్చింది. గత పదిసంవత్సరాలుగా వ్రాసుకున్న డైరీలు తీసుకున్నది, అగ్గిపెట్టె దగ్గర పెట్టుకుంది జరగబోయేది తల్చుకుంటుంటే మనసు మండిపోతోంది — హృదయం ఘోషిస్తోంది — పెదాలు వణుకుతున్నయ్ — చేతులు కంపిస్తున్నయ్ "భగవంతుడా! నా జీవితానికి ఎంత దుర్దశ కల్పించావు! నా ప్రాణం కోరినా సంతోషంగా అర్పించేదాన్నే! ఇంతకంటె శిక్ష ఏం కావాలి? ఇంతకంటె నరకం నే నేం అనుభవించాలి?—నా జీవితంలో జరిగిపోయిన మధుర క్షణాలూ — కన్న కలలూ — పొందిన అనుభూతులూ — అనుభవాలూ — నా చేతులతో నే తుదముట్టించే దుర్దశ ఎందుకు కల్పించావు?— నిజంగా ఇంతకంటె మనిషికి మృత్యువు వేరే వుంటుందా!" దుఃఖావేశంతో మనసు వశం తప్పుతోంది. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా అలాగే వుండిపోయింది. "ఎందుకింత బెంబేలు పడిపోతోంది తను! అతనికి అయిష్టమైన పని ఎన్నటికీ చేయలేదు. ఎంత దుఃఖించీ ఏం ప్రయోజనం? ఈ సంఘటనలవల్ల అతని బలహీనతలు మాత్రం బయటపడయ్ — అంతే! — ఈ డైరీలతో బాటే నా జీవితమే కాలిపోయిం దనుకుంటాను." మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది. భారంతీరేలా వెక్కి వెక్కి ఏడిచింది. తను మోసపోయింది! ఘోరంగా మోసగింపబడ్డది! ఇంత చిన్న విషయానికి తన అధికారాన్ని ప్రదర్శిస్తా డని తను ఎన్నడూ అనుకోలేదు. ఇందులో తన పొరపాటు ఏంతమాత్రం లేదు ఆ రోజున తన ఉద్దేశాలన్నీ నిరభ్యంతరంగా బయట పెట్టింది. అన్నిటికీ తను సుముఖంగా వున్నట్లు అలా నటించటం దేనికి? ఆ రోజున...ఛీ తల్చుకుంటే అంతా అసహ్యమే!"

రిజల్ట్సు వచ్చాయి ఫస్టుక్లాసులో పాసయిం దీ తను. అంతా అభినందించారు. వీణ అడిగింది. "ఎమ్. ఏ. చదువుతావా చిట్టీ?" అని. నిజమే! ఇప్పుడు తను ఏంచేయాలి? చదవటమా, విరమించటమా? ఇది ఆలోచించాల్సిన విషయమే. రాత్రి భోజనా లయిన తర్వాత డాబా పైకి వెళ్ళితే— వెన్నముద్దలాంటి వెన్నెల — గాలికి కొబ్బరి ఆకులు అందంగా కదులు

తున్నయ్. శశిఅన్నయ్య అడిగాడు. "చిట్టీ! ఏం చేయదల్చుకున్నావే?" ఏం చెప్పాలి! మనసులో చదువుదామని అంత ఉత్సాహంగాలేదు — పెళ్ళి మీద మనసు మళ్ళటంలేదు. ఎమ్. ఏ. జాయినవుతావా?"

"ఇంకేం చదవాలని అనిపించటం లేదురా!"

"పోనీ - ఉద్యోగం చేస్తావా?"

"అంత తేలిక కాదుగా!"

చిన్నగా నవ్వాడు అన్నయ్య. "ట్రై యువర్ లక్!"

"నాకు టైపు నేర్చుకోవాలని వున్నది." నెమ్మదిగా తన ఇన్‌టెన్షన్ బయటపెట్టింది.

"గుడ్ అయిడియా! అలాగే కానీ!" మనసు తేలికపడింది.

కాఫీ త్రాగుతూ నాన్నతో నెమ్మదిగా ప్రారంభించాను "టైప్ నేర్చుకుంటాను నాన్నా!" అమ్మ మండిపడింది. "నీ కెందుకే టైపులు? చదివింది చాలు! తెచ్చిన సంబంధంతో లక్షణంగా పెళ్ళి చేసుకో! పిచ్చివేషాలు వేయక!" అమ్మ వెర్రికి నవ్వొస్తోంది. "నీకు తెలియదులే అమ్మా! నే నెప్పటికయినా టైపిస్టు నవాలి!" అమ్మ వదనంలో ఆశ్చర్య ఆవేశ కావేషాలు ప్రతిఫలిస్తున్నయ్. "నన్నడిగితే ఆడదానికి చదువు అనవసరం. మితిమీరిన షోకలు పోయి, నేర్చుకున్నా - మా కంటే ఎక్కువ తెలివితేటలు ఏమీలేవు. ఇక ఉద్యోగాలు చేసి నలుగురినోళ్ళల్లో నాని..." అమ్మ గంభీరోపన్యాసం నాన్న అదలింపుతో స్టాప్ అయింది. "నీ పాతభావాలూ-నీవూ-ఇంకమాట్లాడకు! చిట్టి తప్పకుండా ఉద్యోగం చేయవల్సిందే!" నా మనసు ఆనందంతో గంతులు వేసింది. నాన్న అండవుండగా తను సాధించలేని దేమిటి? తప్పకుండా తన కోర్కె నెరవేరుతుంది.

బస్‌స్టాండ్ దగ్గర బస్‌కోసం నిరీక్షిస్తున్న తన్ని ఎవరో పేరుపెట్టి పిలుస్తున్నారు. వెనక్కి తిరిగిచూస్తే— అతను - రామమూర్తి! తనతోపాటే టైప్ నేర్చుకుంటున్నాడు. తటపటాయిస్తూ అడిగాడు "మీతో రెండు క్షణాలు మాట్లాడాలి." సందేహంగా చూశాను. "మే ఐ స్పీక్ టు యు ఫర్ ఫైవ్ మినిట్స్ ప్లీజ్!" పిచ్చవెధవ! తనకు తెలుగు తెలియదనుకుంటున్నాడా? జనం పల్చగావున్నచోట నిల్చున్నాం. రామమూర్తి చొరవకు ఆశ్చర్యం ముంచుకొస్తున్నది — "నా మాటలు శాంతంగా వినండి. కోపం తెచ్చుకోవద్దు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను." నింపాదిగా అన్నాడీ మాటలు. ఇంత సబ్లీగ్గా పారం వప్పజెప్పినట్లు అన్న అ మాటలు వినగానే నవ్వువచ్చింది. బలవంతాన అణుచుకుని వెనక్కి తిరిగివచ్చేశాను. తోటి



ఆడపిల్లను చూడగానే ఈ మగజీవులకు ప్రేమలూ - జబ్బులూ పుట్టుకొస్తాయి. వాటికి చెప్పుదెబ్బలే తగినమందు! కాని రెచ్చిపోతే ఫలితం - అల్లరంతా ఆడదే అనుభవించాల్సివస్తుంది నిజమే, ఈ అల్పుచూసే వీళ్ళిట్లా పెట్రేగిపోవటం.

టైప్‌మిషన్ ముందు కూర్చుంటూంటే రామ్మూర్తి ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. వళ్ళు మండిపోయింది. కాలి కున్న చెప్పుని చేత్తో చూపించేసరికి, అతను వంచిన తల ఎత్తలేదు.

* * *

హిణ పెళ్ళయింది. అత్తగారింటి కెళ్ళేముందు వచ్చింది. ఇద్దరం డాబా పైకి వెళ్ళాం. "నీ పెళ్ళి ఎప్పుడు ?" అడిగింది.

"ఇంకా ఆ అవసరం నా కన్పించటము లేదు !"

"అవసర మేమిటి చిట్టీ! ఎప్పటి కయినా చేసుకోవాల్సిందేగా !"

"అదేమన్నమాట ! చేసుకోవా లన్న నియమం ఏమిటి ?"

పూర్వులు పెట్టిన నియమం వెర్రిగా వుందా ?"

"కాక ?"

"ఓహ్! ఇలా అన్నవాళ్ళే ఏడాదికి ఇద్దర్ని కంటున్నారు."

"ఛ! మరీ అంత మోటుగా మాట్లాడకు!"

"సరే! నాజూగ్గా చెప్పనా?" నవ్వింది.

"ఆ టాపిక్ వదిలేద్దాం!" అయిష్టత వ్యక్తపరిచాను.

"షైప్ పూర్తయిం తర్వాత ఏం చేస్తావ్?"

"ఉద్యోగం!"

"తర్వాత?"

"సంపాదించటం!"

"తర్వాత?"

కోపంగా చూశాను. పగలబడి నవ్వుతోంది.

"వెర్రి ఆశయాలకు పోయి జీవితాన్ని నరకం చేసుకోక! పిచ్చిదానా! నీపాటి తెలివితేటలు లేకనా–పూర్వులు పెళ్ళిళ్ళూ – పేరంటాలూ పెట్టింది? వారెప్పుడూ తప్పటడుగు వేయరు! ఎందులోనూ పొరపాటు పడరు. ఆడపిల్లకి నీడ ముఖ్యం! అది లేకపోతే ఆ పాట్లు అనుభవైకవేద్యం!"

"వాళ్ళ తరుపున వకాల్తా పుచ్చుకున్నావా?

"నిజం చిట్టీ! ఆలోచిస్తే–ఈనాటి స్త్రీలు ఏదో సాధించా లనుకుంటారు కాని కూర్చున్నచోటునుంచి అవగింజంతయినా జరగలేదు!"

విసుగ్గా లేచాను "నీకు రుచించటము లేదుకదూ! అప్పుడు కాదంలే! నీకు తర్వాత తెలుస్తుంది!" వీణ వెళ్ళిపోయింది. ఆమె మాటలు ప్రతిధ్వనిస్తున్నాయ్. ఎంతమటుకు నిజం?

షైప్ పరీక్షలు పూర్తయ్యాయి. అన్నయ్యే అన్నాడు – షార్ట్‌హాండ్ నేర్చుకోమని. ఈసారి అమ్మ మారు పలుకలేదు.

ఏమీ తోచటం లేదు. తోటలో కెళ్ళాను. సన్నజాజులు కొద్ది కొద్దిగా విచ్చుకుంటున్నయ్. మాలతీ – మాధవీ గాలికి వూగుతున్నయ్. చంపకం విరబూసింది. లిల్లీసుగంధం అంతటా వ్యాపిస్తోంది. విరజాజులన్నీ కోసి కూర్చుతూ కూర్చున్నాను. అన్నయ్య కంఠం వినిపించింది. అన్నయ్య ప్రక్క అతను! పరిచయం చేశాడు. నమస్కరించాను. విశాలనయనాలూ, చక్కని నుదురూ–చిన్న నోరూ–ఆకర్షవంతంగానే వున్నాడు. సరదాగానే మాట్లాడాడు. రాత్రి డైనింగ్ టేబిల్ దగ్గిర అన్నయ్య అన్నాడు. "భాస్కరానికి చిట్టి నచ్చిందిటమ్మా!" ఆశ్చర్యంతో చూశాను. నవ్వుతున్నాడు. "చేసప్పుడే పెళ్ళి చేసుకోను." ఖచ్చితంగా చెప్పాను. అమ్మ కోప్పడింది. "ఇంకెప్పుడు? ముందు కాళ్ళ ముసలమ్మ




వయిన తర్వాతనా?" నాన్నవైపు చూశాను. నిర్లిప్తతగా వున్నారు. అంటే? నాన్నకి ఇష్టమే? అన్నం సయించలేదు. కంచంలో చెయ్యి కడుక్కుని వచ్చేశాను. అమ్మ అంటోంది. "పెళ్ళయిన తర్వాత కానీ ఈ వేషాలన్నీ తగ్గవు?" ఛీ! అంతా తనకు శత్రువులే! కన్నతల్లి కూడా కూతురి మనస్థితిని అర్థం చేసుకోలేదు. అమ్మ పెళ్ళి చేసుకుని ఏం సాధించింది? తనేం సాధించాలి? ఇలా వుండిపోతే నష్టమేమిటి? — తల నెప్పితో పగిలిపోతోంది.

మెలుకువ వచ్చేసరికి చాలా పొద్దెక్కింది. వళ్లంతా నెప్పులుగా వున్నయ్. లేవబుద్ధి పుట్టడంలేదు. డ్రాయింగ్ రూంలో నాన్నెవరితోనో మాట్లాడుతున్నాడు? అన్నయ్య కంఠంకూడా విన్పిస్తోంది. కళ్లు మూసుకు పడుకున్నాను. "వత్సలా దేవి!" గాభరాగా కళ్ళు విప్పాను. అతను! భాస్కరం!! ఏమిటీ చొరవ? ఎంత సాహసం!!

"అలా వున్నారేం?"

"కొద్ది ఒళ్లునెప్పులుగావున్నయ్!" ఆశ్చర్యం వేస్తోంది. నేనేనా ఇంత సౌమ్యంగా మాట్లాడింది? కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. వారించలేకపోయాను.

"మీ ఫామిలీ డాక్టరెవరు?"

"నరేంద్రఘోష్!"

"ఫోన్ చేయనా ?''

''నో ప్లీజ్."

అన్నయ్య వచ్చాడు. ''చిట్టీ అలా వున్నావేం ?" మాట్లాడబుద్ధి పుట్ట లేదు. ఇదంతా అన్నయ్య పన్నాగమే! వా ళ్ళిద్దర్నీ గదిలో వదిలేసి ఎలాగో బయటపడ్డాను. ఏమిటి వీళ్ళ ఉద్దేశం?

అన్నయ్య చెప్తున్నాడు. "భాస్కరం ఎమ్. ఏ పాసయి లెక్చరర్ చేస్తున్నాడు. అందంగా వుంటాడు. సహృదయుడు–చిట్టి నిజంగా సుఖ పడుతుంది!'' దుఃఖం కట్టలు త్రెంచు కోటానికి ప్రయత్నిస్తున్నది. ఏమిటి వీళ్ళ ప్రవర్తన ? తన కిప్పుడు పెళ్ళి వద్దంటుంటే ఏమి టీ ధోరణి ? డాబా మీద అన్నయ్యతో అదే అన్నాను దృఢంగా. ''నేను చేసుకోను !''

''అతడు నచ్చలేదా ?"

కళ్ళల్లో భాస్కరం మెదిలాడు. నూతనకళతో మెరిసే ఆ నయనాలూ, చిరునవ్వును చిందించే ఆ పెదాలూ–

"ఏం మాట్లాడవేం ?''

''అసలు నాకు పెళ్లే వద్దంటుంటే నచ్చటం ప్రసక్తి ఎందుకు?" నవ్వాడు. "చిట్టీ ! నన్ను తప్పించుకోలేవు ! నీ ఆశయం నాకు తెలుసు. ఉద్యోగం చేయా లనే కదా ? నీ భావాలకు అతని భావాలు చక్కగా మేచ్ అవు తాయి. అతని ఉద్దేశంకూడా తన కాబోయే భార్య ఉద్యోగం చేయా లనే !'' ఆలోచనలు ఈగల్లా ముసురు తున్నయ్. నిజంగా అంత విశాల భావాలు కలవాడా ? స్త్రీ బానిస కాదనీ – ఆమెకూ ఒక వ్యక్తిత్వ మున్నదనీ గ్రహించగలడా ! తనకు తగినంత స్వేచ్ఛ ఇస్తాడా ?

"ఆలోచించు చిట్టీ ! ఇలాంటి విష యాల్లో హేస్టీనెస్ పనికిరాదు." అన్నయ్య క్రింద కెళ్ళిపోయాడు. వెన్నెలా – నేనూ – కొబ్బరిచెట్లూ – మిగిలాం. భాస్కరం తనకు నచ్చిన మాట వాస్తవమే కావచ్చు ! అంత మాత్రంచేత అతన్ని చేసుకోవాలా ? అసలు తన ఆశయాల్ని అతడు గౌర విస్తాడని నమ్మకం ఏమిటి ? ఈ పెళ్ళి చేసుకోక తప్పదా ? తప్పించుకొని ఏం చేయాలి ? వీణ అన్నట్లు ఉద్యో గము చేసి సంపాదించుకున్న తర్వాత తన గమ్యం ఏమిటి ?

శశిఅన్నయ్య అడిగాడు. "నిర్ణ యానికి వచ్చావా ?"

"నాన్నగార్కి ఇష్టమేనా ?"

"నీవు తప్ప అందరూ అంగీక రించారు."

"నాన్నగార్కి ఇష్టమే ! – అమ్మకి ఇష్టమే!!–నీకూ ఆమోదయోగ్యమయి నప్పుడు నా అయిష్టతకు ప్రాధాన్యత ఏదీ? మీ ఇష్టప్రకారమే కానివ్వండి !"

అన్నయ్య బాధగా చూశాడు. "చిట్టీ! నువ్వు పొరబడుతున్నావమ్మా!




నీ శ్రేయస్సుకన్నా మేం వాంఛించేదేముంది? నువ్వు అన్ని విధాలా సుఖపడటమే - మేము కోరుకునేది. భాస్కరం నా ఫ్రెండ్ అవటం మూలాన నిన్నింత బాధపెట్టవలసి వచ్చింది. క్షమించు!"

మనసు కలుక్కుమంది. నా వల్ల అందరూ కష్టపడుతున్నారు! అంతా తన క్షేమాన్నే కాంక్షించినప్పుడు సందేహించటం దేనికి?

తన ముఖ్యమైన ఆశయం జాబ్ చేయటం! దాని కతడు ఇష్టపడ్డప్పుడు తనకు అభ్యంతరం దేనికి?

అన్నయ్య టెన్నిస్ ఆటకు క్లబ్‌కు పోతున్నాడు. "మేడమీదికి వస్తావా!"

డాబా పైకి నడిచాం. సిగ్గుదొంతరలు ముంచుకొస్తున్నా స్పష్టంగా చెప్పాను:

"భాస్కరం నాకు నచ్చిన మాట వాస్తవమే! కాని నేనతనితో కొన్ని విషయాలు మాట్లాడాలి."

"అలాగే; రేపు సాయంత్రం బీచ్‌కి రమ్మని చెబుతాను."

"నిజం, చెప్పు అన్నయ్యా! ఈవూరు నువ్వే అతన్ని పిలిపించావా!"

"లేదు! శలవులకు అతని ఫ్రెండ్ ఇంటికి వచ్చాడు."

అన్నయ్య పెదవుల మీద స్నిగ్ధ మందహాసం!

సాయంత్రం ఒంటిరిగా బీచికెళ్లాను. భాస్కరం కన్పించలేదు. మనసు ఆందోళిత మయింది, 'తను ఇలా కోరటంలో తప్పు లేదుకదా! అవును అతని దృష్టిలో స్త్రీకి ఎంత విలువ వున్నదో తెలుసుకోవటం ముఖ్యం. అంత్య నిష్ఠురంకన్నా - ఆది నిష్ఠురమే

మేలు! అతనూ అందమైనవాడే. చక్కటి ఉద్యోగం తనూ సంపాదించ వచ్చు! పొరపొచ్చాలు లేమీ అంట కుండా—అన్యోన్యంగానే గడిచి పోతాయేమో రోజులు!—అలా అని ఎందు కనుకోవాలి? పైకి ఎంతో సౌమ్యంగా కన్పించినా, లోపల పాషాణహృదయులు ఎంతమంది లేరు? రూపం చూసి మోసపోకూడదు! భవిష్యత్ సుఖమయం చేసుకోవా లను కుంటే ముఖాముఖీ మాట్లాడు కోవటమే శ్రేయస్కరమేమో?' ఆలోచనల్లోంచి తేరుకుంటూ అతని కోసం నలుమూలలా కలయజూశాను. దూరాన మెల్లగా నడిచి వస్తున్న భాస్కరం నా దృష్టి నాకర్షించాడు. మల్లెపువ్వులాంటి తెల్లటి లాల్చీ — పైజమాలో, నిండుగా వున్నాడు.

"నాకోసం చాలాసేపు వెయిట్ చేస్తున్నారా?"

"లేదు! ఇప్పుడే నేను వచ్చింది!"

అతనుసముద్రంకేసిచూస్తూకూర్చు న్నాడు. నా దృష్టిని సముద్రంకేసి మరల్చాను. ఉవ్వెత్తున అలలు లేస్తూ అందంగా ఊగుతోంది కడలి. ఆ నీలి రంగు నీళ్ళల్లో అతిగాంభీర్యం గోచ రిస్తున్నది. అందుకే మానవుని మన స్సుతో పోల్చివుంటారు!—నా ఆలోచ నలు పూర్తి గాకమునుపే అన్నా డతడు—"మీ సందేహ మేమిటి?" చిరు నవ్వు నవ్వుతున్నాడు. ఏమని అడగాలో తోచక కొన్ని క్షణాలు సందిగ్ధంలో పడ్డాను.

"స్త్రీలపట్ల మీ అభిప్రాయం ఏమిటి?"

"ఏ విషయంలో?"

"పురుషులతో సమాన హక్కులు సంపాదించటం——"

"హక్కు లయితే సాధించగలరేమో! కాని పురుషులతో సమానం స్త్రీ ఎన్నటికీ కాజాలదు! అఫ్‌కోర్స్— అలాంటి విజయం సాధించాలని కోరు కునేవాళ్ళలో నేనూ ఒకడిననుకోండి! వత్సలాదేవి! మీ అభివృద్ధిని నే నెప్పుడూ కాంక్షిస్తూనే వుంటాను!"

అంటే అతని దృష్టిలో నేను స్త్రీని కానా? కోపంతో వళ్ళు దహించుకు పోయింది. సంబాళించుకుని "గృహస్థ విషయాల్లో కొన్నిట్లో స్త్రీకి స్వతంత్రత వుండటం ఔచిత్యమేనా?"— శాంతస్వరంతో అడిగాను.

"కొన్నిట్లోనే కాదు—అన్నిట్లోనూ వుండటం ఔచిత్య మంటాను."

"పురుషుల విమర్శలు ఏభావంతో గ్రహించాలి?"

"మంచీ—చెడూ వివక్షతా— ఎదుటిమనిషి ఎలాంటి మనస్తత్వం కలవాడో తెలుసుకుని దాన్నిబట్టి గ్రహించాలి." నవ్వు వచ్చింది. అతని యుక్తి మెచ్చుకోతగ్గదే. చీకట్లు

హృదయానికి అద్దంలాంటి డైరీ వ్రాసుకోవటంకూడా అపరాధమే!'' నైరాశ్యం - విరక్తి శరీర మంతటా వ్యాపించింది. అతను వీల్లేదు అన్నాడు. తనేం అనగల్గింది? ఎందుకని అనలేక పోయింది? అతనికి విధేయతగా వుండాలనా? ఈ మనస్తత్వం స్త్రీజాతి కంతటికీ వున్నదా? ఈ అలుసే తీసుకుని అలా రెచ్చిపోతున్నారేమో! స్త్రీ అబల కాదు సబలే! అని నిరూపించుకుంటున్నారే! ఇంకా ఈ వైషమ్యాలు సమసిపోవే! అసలు నిజంగా స్త్రీ పురోభివృద్ధిసాధించిందా? ఏ విధంగా? పురుషులతో సమానంగా ఉద్యోగాలు చేస్తున్నారు, సంపాదిస్తున్నారు, ఇతర కార్యకలాపాల్లో మెలగుతున్నారు. కాని అసలైన పురుషుల మనస్తత్వాల్లో మార్పు తేగలిగారా? వాళ్ల దృష్టిలో వైవిధ్యం కల్గిందా? లేదు వెనుకటిలా తమ అధికారాన్ని ప్రదర్శిస్తూనే వున్నారు తమ అహంభావాలను వెళ్ళగ్రక్కుతూనే వున్నారు. ''స్త్రీల అభివృద్ధిని కాంక్షిస్తున్నాం'' అంటూనే వేరొకప్రక్క హేళనగా మాట్లాడుతున్నారు. ''గృహావసరాలకు స్త్రీ సంపాదించటం ఎంతో అవసరం'' అని ఉపన్యాసా లిస్తూనే - వేదిక దిగిన వెంటనే ''ఎందుకండీ! వీళ్ళకు ఉద్యోగాలూ-వంటఇంట్లో పడి వుండక!'' అనే ప్రబుద్ధులు ఎంతమందో! ముఖ్యమైన పురుషుల దృక్పథంలో మార్పు తేలేని స్త్రీ నిజంగా ఏం సాధించినట్లు?'' ఆఫీసులో ... నుండి మాటలు విసిరే గుమాస్తాలు గుర్తుకువచ్చారు. ఆలోచనలతో తల పగిలిపోతోంది. నా ఆలోచనలు ఏ ధోరణిలో సాగుతున్నా యేమిటి చెంపలమీద ముత్యాల్లా కన్నీళ్ళు రాలుతున్నాయ్. ఉన్నత పథాలు ఊహించుకోవడం, ఎన్నో ఆశయాలు సాధించాలని అనుకోవటం. అన్నీ వమ్మైనప్పుడు కొడిగట్టిన దీపంలా జీవితాంతం నిరాశ, నిస్పృహాలతో క్రుంగిపోవటం - నిజంగా మానవుని మస్తిష్కం ఎంత విచిత్రమైంది!'' వికలమైన మనస్సుతో అలాగే కూర్చుండిపోయాను.

## 3

డైరీ మూసింది. మనస్సు చిక్కబట్టుకుంది. కళ్ళల్లో నీళ్ళు నిలవటంలేదు. మొన్న జరిగిన సంఘటన గుర్తొచ్చింది. మధ్యాహ్నం 6 గంటలకే వచ్చాడు ఇంటికి భాస్కరం తలుపు తెరిచింది వత్సల

''అలా వున్నారేం?''మామూలుగా పలకరించింది వత్సల.

''తల నెప్పిగావుంటే శలవు పెట్టి వచ్చాను'' ముభావంగా అన్నాడు. సంభాషణ పెంచకుండా తన పనిలో లీనమయింది వత్సల. రాత్రి అలవాటు

ప్రకారం డైరీ వ్రాయబోయింది. ఏ అనుమానమో వచ్చి డ్రాయర్ సొరుగు లోకి తొంగి చూసింది. అన్నీ కెలికి వున్నయ్. భాస్కరం చదువలేదుకదా! ఛ! అత నెందుకు చదువుతాడు? తన భ్రమ! మనసును సరిబుచ్చుకుంది. మరునాడు భాస్కర్ ప్రవర్తనతో తన అనుమానం నిర్ధారణ చేసుకుంది.

"నా మాటంటే నీకు లక్ష్యం లేదా?" విసురుగా అన్నాడు. తెల్లబోయింది.

"డైరీ వ్రాయవద్దంటే వినవేం?"

విపరీతమైన అసహ్యం జుగుప్సతో మొహం ఎఱ్ఱనైంది. సమాధానం చెప్పబోయింది.

"వెధవ వ్రాతలూ నీవూ!" మాట వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు. కట్టెగా అయిపోయింది వత్సల. భాస్కరమేనా ఇతను? తనతో అనురాగ సంభాషణలు చేసే అతనివేనా ఈ చీదరింపులు! ఆమె ఆశ్చర్యం లోంచి తేరుకోక ముందే దుఃఖం ముంచుకొచ్చింది. హృదయభారం తీరేలా వెక్కి వెక్కి ఏడ్చింది. ఇది జరిగింది క్రిందటిరోజు!.

"ఇంతమటుకు అతని ప్రవర్తనలో మార్పేం లేదు." గత స్మృతులతో అల్లకల్లోల మయింది మనసు. డైరీ చదవటమే తప్పు! పైగా నాకు ఆ హక్కు లేదా అంటాడేం? వ్రాసుకోవటానికి తనకుమాత్రం హక్కు లేదా? భాస్కరం ప్రవర్తన ఒక సమస్యలాగావుంది. తనలోకి ఒక్కసారి చూసుకుంటే తన లోపాలూ-తప్పులూ స్పష్టంగా కన్పిస్తాయి. అలా చేయకపోతే పోనీ — ఇతరులనైనా వివేచనా దృష్టితో పరిశీలించ డేం!

తనకు సిగరెట్ వాసన గిట్టదు. మానుకుంటానని ప్రామిస్ చేశాడు. కాని ఆలవాటును మానుకోగలిగాడా? తనలోని లోపాలు వెలికి రాకూడదు. ఇతరులను చిత్రవధ చెయ్యాలి. ఏం మనిషి?

'అతన్నని ప్రయోజనం ఏమిటి? తన దురదృష్టం' తన జాతకఫలం! అంతే! ఉద్యోగం! డైరీ!! పెటిలో ఉద్యోగం ఏనాడో వదులుకుంది అలాగే ఈ డైరీ! జరిగిన సంఘటనలు ఆత్మవిమర్శ చేసుకుని బాధపడటము దేనికి? ఇంత మనస్తాపానికి కారణం ఈ డైరీ! దీనికోసం సంసారం అల్లకల్లోలితం కావటం అనవసరం. ఈ సంఘటనలవల్ల అతని బలహీనతలు బయటపెట్టుకున్నాడు. తన ఆధిక్యత ప్రదర్శించుకున్నాడు. పేటిని తగలబెడితేనే అతనికి శాంతి — అంతేగా! ఆవేశంతో పిచ్చెక్కినదానిలా అన్నీ కుప్పగా పెట్టి నిప్పంటించింది అవి ఎఱ్ఱ వర్ణం మంటలు భగభగ మంటున్నయ్ ఆ జ్వాలల్లో అంతర్జ్వాలను చల్లార్చే శాంతి కోసం వెతుక్కుంటూ కూర్చుండిపోయింది వత్సల.

# ఎతికిరె సేసేలా

సత్యం శంకరమంచి



గ్రామం ఉత్తరం చూసి తుళ్ళిపడ్డాడు.

గబగబా చదివేశాడు. నమ్మకంకోసం మళ్ళి పైనుంచి కిందిదాకా చదివాడు. కింద సంతకంగా మూడక్షరాలు. ఒక నాడు ఆ మూడక్షరాలే తనకి లోక మని, ఈ జగత్తులోని సంగీతమంతా ఆ మూడు అక్షరాల్లోనే ఒదిగిపోయి వుందని భావించాడు ఆశలూ. వూహలూ అన్నీ ఆమె చుట్టూ అల్లుకుని కాలం గడిపాడు. ఆమెని గురించిన ఆలోచనలే వూపిరిగా భవిష్యద్వసంతాలు భావించుకున్నాడు. రాబోయే మల్లెపూల కాలం తనూ ఆమే కలసి అనుభవిస్తా మనుకున్నాడు. ఆ ఆశల్నీ, ఊహల్నీ అన్నింటినీ తెంపుకుని ఆమె నొదిలేసి ఇక్కడికి పరిగెత్తుకొచ్చి సంవత్సరం అవుతోంది. చల్లటి సాయంత్రాల ఆ పాతజ్ఞాపకాల తెరలు కెలకవేసినప్పుడు ఒక్కొక్క ముల్లే తీసేసుకుంటూ కాలం గడుపుతున్నాడు రామం.

శారద సోమవారం వస్తానని ఉత్తరం రాసింది,

ఎందు కొస్తోందో తెలియదు. వివరంగా రాయలేదు. ఆదివారం ఉదయాన బయలుదేరుతున్నాను. నువ్వు ఆ రోజు కొండలూ, సెలయేళ్లూ పట్టి తిరక్కుండా బస్ దగ్గిరికి రా. చాలా అవసరం. నామీద కోపంతో నువ్వుగాని బస్ దగ్గరకు రాకపోతే, నేను నిన్ను కలవకుండా తిరి గొచ్చేస్తే— అలా కాకూడదు. నువ్వు బస్ దగ్గరికి తప్పక వస్తావు. చిరునవ్వుతో పలకరిస్తావు. అన్నీ అప్పుడు ... శారద.

రామం లేచి వొళ్ళు విరుచుకున్నాడు. ఆదివారం సాయంత్రానికి శారద వొస్తోంది.... అంటే ఇవ్వాళే. నరాల్లోకి కొత్త సత్తువ వొచ్చినట్లనిపించింది. గబగబా లేచి సిగరెట్ ముట్టించి గదంతా తిరిగాడు. బయట వాన జోరున కురుస్తోంది. జయపూర్ వానకి ఓ ప్రత్యేకత ఉంది. ఆస్థాన విద్వాంసుడిలా ఎప్పుడూ ఈ సంస్థానాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. ఆపకుండా విలదొక్కుకుని రోజుల తరబడి వీళ్ళు పారబోయగల ధీమా ఈ వూరి వాన కొక్కదానికే

ఉంది. రాత్రెప్పుడో మొదలయింది; ఉదయం పదవుతున్నా తెరిపివ్వలేదు. రామం కోటు గుండెలమీదికి లాక్కుంటూ, బయటికి కెళ్ళి చూశాడు. ఆకాశం కని పించలేదు కనుచూపు దూరాన మేఘాలు కప్పుకున్న కొండలు — రామానికి ఆక లేస్తోంది. రోజూ ఈపాటికి మస్తుగా టిఫెన్ కొట్టేశేవాడు. సర్వెంట్ బాయ్ ఇంకా రాలేదు. పొద్దున్న తెచ్చిన కాఫీ ఫ్లాస్కులో ఇంకా ఉంటే పోసుకు, తాగాడు. టైం చూస్తే పదింబావు. ఈ పాటికి పట్నాయక్ రావలసిందే. నాలుగు రోజుల క్రితం వేసుకున్న ప్లాన్ ప్రకారం తనూ పట్నాయక్ కలిసి ఇవాళ మల్కానగిరి అడవుల్లో విహరిం చాల్సి ఉంది. పట్నాయక్ వాళ్ళ ఇంట్లో అన్నీ తయారు చేయించి కారియర్‌లో సర్దుకు రావాలి. రామం ముందుగానే చెప్పాడు. వంటకాలు ఆవమావెతో చేయించొద్దని. రాత్రి మొదలయిన వాన చూసి మల్కానగిరి ప్రోగ్రాం కాన్సిల్ చేశాడేమో! అయినా జీప్‌లో వెళ్ళటం బంగళాలో మకాం చేయటం పెద్ద కష్టమేం కాదు. ఇలాంటి 'తిరుగుళ్ళలో' వాన రామాని కెప్పుడూ పెద్ద అడ్డంకి కాదు. వాన తోడుచేసుకుని అంబగూడా చిట్టడ వులు తిరగటం.. అక్కడి ఆదివాసీ జనంతో రగ్గులు కప్పుకుని చలిమంటలు వేసుకుంటూ వాళ్ళ పల్లెపాటలు వింటూ కాలం గడపటం అతనికి కొత్తేం కాదు. తోడుగా పట్నాయక్ ఉంటే వానకాదు కదా పిడుగులు పడ్డా చింతలేదు. ఇవాళ మల్కానగిరి ప్రోగ్రాం లేదని వాళ్ళింటి కెళ్ళి చెప్పొస్తే బావుండు - అస లీపాటికి సరంజామా వేసుకుని పట్నాయక్ ఇక్కడికి రావల్సిందే, బాయ్‌కూడా ఇంకా రాలేదు.

రామం వరండాలో నుంచుని వాన చూస్తున్నాడు. ఆకాశం కరిగిపోయి ఘల్లుఘల్లున భూమ్మీద. పడుతోంది. కొండ కొనన తెల్లటి మేఘం జెండాలా. నుంచుంది.

సాహూ తడిసి వణుక్కుంటూ వచ్చాడు.

'ఏం, గొడుగు లేదా?'

'లేదు బాబూ'

'ఎందుకు లేదు.....హాఁయ్.'

'ఇహిహి...' నవ్వేస్తాడు సాహూ, తెల్లటి పళ్ళన్నీ బయటపెడ్తూ.

సాహూది నల్లటి ముఖం. ఒత్తుగా వెనక్కి హైరోడ్ క్రాపింగ్, మెరుస్తున్న చిన్నకళ్ళు. వొదిగి వొదిగి దూర దూరంగా నడుస్తాడు ఒకసారి రామం కేక వేశాడు. 'ఎందు కంత గోడలు గుద్దుకుంటూ నడిచిపోతావ్? నా పక్క నడిస్తే నీ కేం షాక్ కొట్టదు. నే నేం అంటరానివాణ్ణి కాదు.

'బాప్పారు బాబూ...' సాహూ భయం భయంగా కళ్ళు పెట్టాడు.

రామం నవ్వుతూ సాహూ భుజం

అంత వానలోనూ పట్నాయకి జీప దూసుకొచ్చింది. పట్నాయక్, అతని వెనకాల రెండు కారియర్లు. ఓ పేంబుట్ట పట్టుకుని డ్రైవరు పరుగెత్తుకొచ్చారు. పట్నాయక్ వచ్చేప్పటికి రామం మంచం మీద దుప్పటి కప్పుకుని, రోజూ రోడ్డుమీద కన్పించే పల్చటి, కోలకళ్ల చెవులరింగుల అమ్మాయిగురించి ఆలోచిస్తున్నాడు. ఆ అమ్మాయికీ శారదకీ ఎక్కడో పోలికుంది.

'ఏం రాంబాబూ! మన మల్కానగిరి ఎక్కడుంది,' తల తుడుచుకుంటూ అడిగాడు పట్నాయక్.

రామం మంచం దిగొచ్చి వాళ్ళ

యిం..

కుంటున్నాడు. పట్నానాయకిం తెలియక్కపోలేదు. ఆకాశాన్నీ చీకటి ఆప్త బంధువులుగా చేసుకుని పడివున రామాన్ని ఈవూరు తీసుకొచ్చి పూ పోసి ఈ మాత్రం మనిషిగా చేసి అతనే. ఉత్తరం చదివి పట్నాయ మాట్లాడలేదు. సాహూ ఇచ్చిన తాగుతూ అన్నాడు. 'ఎందు కొస్తున్నట్ల

రామం టీ చప్పరించి బుజా లెగ చెయ్యి వెల్లకిలా తిప్పాడు. తెలి దన్నట్టు.

కాని ఒకటిమాత్రం నిజం. శా

...ంటలలో నేను ఎంత
...ష్టమయినా భరించగలను కానీ నన్ను
...సి ఇంకొకళ్ళు జాలిపడే స్థితిలో
...దటాన్ని మాత్రం సహించలేను;
బతుకు నే బతగ్గలను. ఏ జాలి నాకేం
...ర్లే' దన్నాను. శారద కన్నీళ్ళు
...కుంది. నేను కన్నీళ్ళు చూడలేను;
...ం అందమైన శారద కళ్ళనుంచి.
...ళ్ళ నొకళ్ళం సాముకయి పచ్చు
...ం. గాయాలకు కట్లు కట్టుకున్నాం.
...హాసంగా చిరునవ్వులు నవ్వుకున్నాం.
...రోయాం.
...మీం విడిపోయిన పద్ధతి. మనసు

పట్నాయక్ వింటూ కూర్చున్నాడు. రామాన్ని నిశితంగా చూస్తున్నాడు. పట్నాయక్‌కి శారద ఆరోజు రాదని అనిపిస్తోంది. అతని లెక్కల ప్రకారం ఒక్కసారి అదృష్టం కాదని వెళ్ళి పోయాక, తిరగొచ్చి కౌగలించుకోవటం అసంభవం. రామం జీవితంలో కొత్త ప్రకరణం మొదలెట్టాలి. పాత ప్రకరణాన్ని పొడిగించటం పట్నాయక్‌కి ఇష్టం లేదు. శారద ఇవ్వాళ రాదని పట్నాయక్ ఆశ. రామం విరుచుకుపడ్తాడు. చూద్దాం సాయంత్రం దాకా అనుకున్నాడు పట్నాయక్.

యువ

'జీప్‌ని తిప్పి పంపేస్తాను' అన్నాడు పట్నాయక్.

'ఊ' అన్నాడు రామం పేకముక్కలు కలుపుతూ.

మధ్యాహ్నందాకా పేకాడారు. సాహూచేత మరినాలుగు సిగరెట్ పెట్టెలు తెప్పించుకున్నారు. రామం ప్రతిఆటా ఓడిపోతున్నాడు. ఓడిపోతున్న కొద్దీ రామం ఇంకా సంతోషంగా ఆడుతున్నాడు. అతనికి ఓటమిని గుర్తించే స్థిమితంలేదు. రామం ఓడిపోయినప్పుడల్లా పట్నాయక్ అనుకునేవాడు-ఇవ్వాళ శారద రాదని

కేరియర్లు విప్పుకు తిని విశ్రాంతి తీసుకున్నారిద్దరూ పట్నాయక్ నిద్రపోయాడు. రామం ఇంటికప్పుకేసి చూస్తూ పడుకున్నాడు. నిద్రపట్టలేదు. వరండాలో కుర్చీ వేసుకుని వాన చూస్తున్నాడు. నల్లటి కన్నెపడుచు తెల్ల పైట వేసుకున్నట్లు కొండమీద మేఘం మబ్బులు ఎక్కణ్ణించో పరుగెత్తుకొచ్చి, చిరకాలపు కోరికగా, తీరవి తమితో కొండకన్నెని గాఢంగా కౌగలించుకుని పొగలు పొగలుగా మారి కన్నీళ్లుగా కరిగిపోతున్నాయి.

నాలుగు కాకమునుపే రామం పట్నాయక్‌ని కేకేశాడు 'పొట్నాయిక్'అంటూ. ఒరియాలో అకారాన్ని ఒకారంగా పలుకుతారు. అలా పిలస్తే పట్నాయిక్‌కి













కోపం. కళ్ళు తెరచి చూసి అటు పడుకున్నాడు.

'నాలుగవుతోంది లేవ్వయ్యా.'

'ఆరు గంటలకి బస్. ఇప్పు తొందర.'

రామానికి కాలు నిలవటంలేదు. ఒక
ట స్థిమితంగా కూర్చో బుద్ధి కావటం
య. అటూ ఇటూ పచార్లు చేయటం
ందలెట్టాడు.

* * *

ఆ రోజు తిరిగి తిరిగి ఇంటికి రాగానే
రో చెప్పారు-వీధి చివర సీతాయమ్మ
కి ప్రమాదంగా ఉందని. రామం చూద్దా
బయలుదేరి వెళ్లాడు. శారద తల్లి
చందగ్గర కూర్చుని విసనకర్రతో
ర్తోంది. శారద తల్లి ఆయాస
తోంది. ఆమెకు స్పృహ పోతోంది.
ద కళ్ళు ఎర్రగా వాచిఉన్నాయి.
రాన్ని చూసి శారద కూర్చున్న
బనుంచి లేచింది.

'డాక్టరుని పిలువలేదాండి?'

లేదు...' అంది కొంగుతో కళ్లు
చుకొంటూ.

ామం బయటకు పరుగెత్తాడు
త్రి డాక్టరుతోపాటు శారద తల్లిదగ్గ
ాడు. నుదుటిమీద తడిగుడ్డలు
స్తూ, టెంపరేచర్ చూస్తూ గంట
కి మందలిస్తున్నాడు. శారద తల్లి
ం వారగా కళ్ళల్లో వొత్తుల్లా వేసు
అలా తల్లివైపు చూస్తూనే ఉంది.
ట్లా కాస్సేపు పడుకోండి. మేం
ా ఉంటాం' అన్నాడు రామం.
ాలేదు; మీరు...' మాటలు తెగి
ాయి. ఆ కళ్ళలో కృతజ్ఞత. తెల్ల
ాముకి స్పృహ వచ్చింది, ముగ్గుర్ని
ముఖాలు తృప్తిగా వెలిగాయి. శారద
తల్లికి గ్లూకోజు కలిపి ఇచ్చింది. తెల
తెలవారుతూండగా శారద కాఫీ చేసి
తెచ్చింది రామానికీ, డాక్టరుకీ. వాళ్ళు
కాఫీ తాగుతూంటే అంది 'మీరు సమ
యానికి రాకపోతే...' చెంగుతో
కళ్ళొత్తుకుంది 'మరేం పర్వాలేదు.
మీ రట్లా అనుకోగూడదు' రామం
అట్లాంటి మాటలు భరించలేడు. రామం
డాక్టరూ మెట్లుదిగి వచ్చేస్తుంటే శారద
గుమ్మం పట్టుకుని అలాగే చూస్తూ
నుంచుంది. వెనకనుంచి ఆప్యాయంగా
తనని కౌగలించుకున్న ఆ చూపులు
రామాని కింకా జ్ఞాపకం

* * *

వాన తెరిపిచ్చింది. చలికి తన చుట్టూ
తెల్లకంబళీ కప్పుకున్నట్లు కొండచుట్టూ
మబ్బులు. పైన తల నల్లగా మొన తేలి
కన్పిస్తోంది. పట్నాయక్ లేచి మొహం
కడుక్కున్నాడు. టీ తాగుతూ సాహూని
వెళ్ళి రిక్షా తీసుకురమ్మన్నాడు. రామం
వద్దన్నాడు. పట్నాయక్, రామం
రెయిన్‌కోట్లు గంబూట్లు తగిలించుకొని
బైటపడ్డారు. రోడ్డుమీద రామం, నిల్చిన
నీళ్ళలోంచి నడుస్తూండటం, నీళ్ళు చింద
గొట్టటం లాంటివి చేస్తున్నాడు. 'కాసిని
కాగితం పడవలు తెచ్చుకోకపోయావ్'
అన్నాడు పట్నాయక్. రామం నుంచుని
వెనక్కు విరగబడి నవ్వాడు. ఆకాశంలో
ఓ తెల్లమేఘం గాలికి ఎగిరిపోతోంది.

ఇద్దరూ బస్‌స్టాండ్ జేరేసరికి మళ్ళీ వాన మొదలయింది. వానని తిట్టుకుంటూ హోటల్ వరండాలోకి చేరుకున్నా రిద్దరూ. వాన ఫెళఫెళ కురుస్తోంది. గంటముందుగానే చీకటిపడింది. మబ్బులు బీటలు వారి.పగిలిపోతున్నాయి. శత్రువు వెన్నాడుతోన్నట్లు మబ్బులు, వెనకాల ఉరుములు. బస్‌స్టాండ్ రోడ్డు మీద నీళ్లు పారుతున్నాయి. ఆకాశం భూమ్మీద పగబట్టినట్టు కసిగా నీళ్ళు కుమ్మరిస్తోంది.

'సంభవతో యహూరుడో హేయ్‌పారే.' కిల్లీకొట్టు దగ్గర ఒకడు.

'అంటే?' రామం.

'ఇది తుపానులా ఉంది' పట్నాయక్.

రామం ముఖం చిన్నబోయింది ఇవ్వాళ శారద వసుంది. ఈ తుపానులూ గాడిదుమూరాలూ మమ్మల్ని విడదీయలేవు. ఎక్కణ్ణించో పరుగెత్తుకుంటూ వెంకట్రావ్ వచ్చాడు. తల నీళ్లు విదిలించుకుంటూ రామాన్నీ, పట్నాయిక్‌నీ చూసి 'ఓరి మీ రిక్కడా! ఏళ్లి టిట్లా వొచ్చారు?' అన్నాడు.

'విజయనగరం బస్‌కోసం' అన్నాడు పట్నాయక్.

'ఎవ రొస్తున్నారు; అత్తగారా?'

'కాదు' అన్నడు పట్నాయక్.

'మ రింకెవరు?'

పట్నాయిక్ జవాబు చెప్పలేదు. 'ఓ ఫ్రెండ్' అన్నాడు రామం.

'నేనూ విజయనగం బస్ కోసమే. మా అత్తగా రొస్తోంది. మామూలుగా అయితే నేను బస్ దగ్గరికి రాను. ఓ వాన, అందులో ఆవిడ ఆవకాయ జాడీ తెస్తోంది. సాయంత్రం లేపోతే ఆ ఆవకాయా గంగపాలే.'



'ఎక్కడ పెట్టించుకొన్తోం దేమిటి?' పట్నాయక్.

'నూజివీడు...' వెంకట్రావ్, పట్నాయక్ నూజివీడు మామిడికాయలు, ఆవకాయరకాలు, అందులో ఉల్లి ఆవకాయ రుచి, క్రికెట్ — ఇంజనీర్ ఫాస్టెస్ట్ సెంచరీ, వోరెల్ నైట్‌హుడ్, రాజకీయాలు, మున్సిపాలిటీ మురికికాలవలు, గోరీలు, స్మశానాలు ... ఇత్యాదుల గురించి మాట్లాడుకుంటున్నారు. రామం వరండా చివరకు వచ్చి నుంచున్నాడు. మేఘాలు నీళ్ళు చిమ్ముతునే ఉన్నాయి. ల్చటి కోలకళ్ళ అమ్మాయి రిక్షాలో ాగం తడుస్తూ వెళ్తోంది. శారద చెవుల ంకా రింగు లున్నాయో లేదో చూడాలి.

* * *

శారద ఓరోజు వాళ్ళ స్నేహితురాలి ంగులు పెట్టుకొచ్చింది. కోలముఖానికి కొత్త అందం. ఉల్లాసంగా కబుర్లు న్తోంది శారద. జడలో జాజిపూలు ఎలో పొంగుతున్నాయి. పెదవుల ంచి నవ్వు ఆపుకుంటున్న శారద ఖానికి ఆ రింగుల తళతళ గొప్ప గసిచ్చింది.

'ఇందాకట్నుంచి చూస్తున్నాను, రింగులు ఎన్నాయో లేదో చెప్పవేం?' అంది ద.

రామం నవ్వి వూరుకున్నాడు.

'గొప్ప! బావుందో లేదో చెప్పమంటే చేస్తావేం?'

శారదకి కోప మొస్తే కిందిపెదవి చిగురుటాకులా అదురుతుంది. కళ్ళలో పాప కొన కొస్తుంది. మామూలుగా అయితే రామం మళ్ళీ నవ్వి ఇంకాస్సేపు ఉడికించేవాడు. ఆరోజు శారదకి ఆ రింగులు గొప్పగా నప్పినై.

'బావున్నాయి" అన్నాడు.

'నిజం, శారద కళ్ళలో మెరుపు.

'నిజం, చాలా బావున్నాయి, నీవేనా?

'ఊ' తనకు బావున్నాయని మళ్ళీ మళ్ళీ అనిపించుకోవాలి.

'ఐతే నేను ఉంచేసుకుంటాను.'

'ఊ!'

'ఎప్పుడూ పెట్టుకుంటానేం?'

'ఊ'

జీవితాన్ని కలిసి అనుభవిస్తున్న వాళ్ళుతప్ప అలా మాట్లాడుకోగలరా? అవును. అందుకే శారద వచ్చేస్తోంది. తన్నించి ఇహ విడిచిపోదు.

* * *

వర్షం తగ్గలేదు. రామం చూపు లన్నీ విజయనగరం రోడ్డుపైన ఉన్నాయి. ఇంతలో వాననీ చీకటినీ చీల్చుకుంటూ బస్ వచ్చింది. వర్షంలో తడుస్తూ ముగురూ బస్ దగ్గిరికి పరుగెత్తారు. అది మూడుగంటలకి రావాల్సిన బస్, నాలుగ్గంటలు ఆలస్యంగా వచ్చింది. గజపతినగరందగ్గర వాగు రోడ్డుమీదికి పొంగిందిట. ఆ తర్వాతకూడా దోవలో రెండు కొండవాగులు పూటుగా పారు

తున్నాయిట. ఈబస్సు ఎట్లాగైతేనేం ఈడ్చుకొచ్చింది. రామం కంగారుపడి పోయాడు.

'అయితే ఇక్కడకు అరుగంటల కొచ్చే బస్ బయలుదేరిందా ?' అడిగాడు రామం.

'ఏమో తెలియదు' సమాధానం.

'అయితేనా అవకాయజాడీ లేంగాను?' వెంకట్రావ్.

'వాగులు పొంగినా అంతలో తీసి పోతాయి బస్సు లొచ్చేస్తాయి; మరేం పర్వాలేదు' వార్త.

రామానికి ఊరట కల్గింది. బస్ తప్ప కుండా వస్తుంది. శారద తప్పకుండా వస్తుంది.

మళ్ళీ హోటల్ వరండాలో కొచ్చి నుంచున్నారందరూ. వాన తగ్గలేదు. వచ్చే పోయే లారీలు నీళ్ళు చిందగొడ్తున్నాయి. విజయనగరం పోయే లారీల్లో ఎక్కి వెళ్దామా అనిపించింది రామానికి. పట్నాయక్‌కి చెప్తే వేళాకోళం చేస్తాడని ఊరుకున్నాడు. ఎనిమి దవుతోంది.

'ఏం రాంబాబూ! మన భోజనం....'

'శారద రాకుండానే......'

పట్నాయక్ ఏం మాట్లాడలేదు శారద రాదనే నమ్మకం అతనిలో గట్టిపడ్తోంది. 'అయితే నే వింటి కెళ్ళి చెప్పొస్తాను. ముగ్గురికీ ఏర్పాటు చెయ్యమని.'

'అక్కర్లేదులే; ఏదో హోటల్లో తిందాం.'

'మరిప్పుడు కాస్త కాఫీ అన్నా...'

'పద.'

ముగ్గురూ హోటల్లోకి నడిచారు. వెంకట్రావ్, పట్నాయక్ వూరగాయల సంగతి వొదిలేసి, ఇప్పుడు వొరుగులు, వాటి ప్రాశస్త్యం, కొత్తిమెరకారం, పులిహోర తిరగమోత, దోసకాయ పచ్చడి బద్దలు, వాళ్ళ బొంద మాట్లాడ కుంటున్నారు. వాన ఉధృతం తగ్గింది. దూరంగా ఎవరో విలువైంది పోగొట్టు కుని ఏడుస్తున్నట్లు వాన హోరు సన్నగా వినిపిస్తోంది. వాన తగ్గినకొద్దీ రామంలో ఆశ హెచ్చుతోంది. కాలం గడుస్తున్న కొద్దీ పట్నాయక్ శారద రాదని ఖాయం పర్చుకుంటున్నాడు ......

*　　*　　*

ఇట్లాంటి వానలోనే శారద ఒకరోజు తనకోసం పరుగెత్తుకొచ్చింది. ఆనాడు రామం పుట్టింరోజు. అతను అంతక్రితం జ్వరం పడ్డాడు. పథ్యం పెట్టి వా రోజు లయింది. ఇంకా బయ[illegible] వెళ్ళటంలేదు వుట్టింరోజని శా[illegible] చెప్పేదాకా రామానికి జ్ఞాపకం లేదు సాయంత్రం తప్పక వస్తానంది.



ఫ్రెండ్‌ని రైలెక్కించి రావాలి. వర్షం పట్టుకుంది. వాన విరుచుకుపడుతోంది. గాలి ఎడాపెడా కొడ్తోంది. ఏడయింది, ఎనిమి దయింది ఇంక శారద రాదను ...న్నాడు. రామం. తను భోంచేద్దామని లేస్తుండగా శారద వచ్చింది. సాంతం తడిసిపోయి. రామం అట్లాగే కళ్ళప్ప ...ంచి చూస్తూ ఉండిపోయాడు. జుట్టునుంచి ...ళ్ళు మొహంమీదికి కారిపోతున్నాయి.

'పాడువాన... ఆలస్య మైపో యింది... నాకోసం ఎదురు చూస్తున్నావు దూ...... వెధవ్వాన... రిక్షా దొర ...ందే... నడిచొచ్చాశాను... మాటల ...ధ్య నవ్వులు పొదుగుతూ చెప్పింది.

రామానికి నోట మాట రాలేదు. ...గే చూస్తూ నుంచున్నాడు. బట్టలు ...ర్చుకుని వొదినచీర కట్టుకుని, తల ...బెట్టుకుంటూ వచ్చింది. తనకి దగ్గ ...డి భోజనం పెట్టించింది. మాటలమధ్య ...ద నవ్వితే నీలిమేఘంలో మెరుపు ...సిన ట్లుంటుంది రాత్రి పొద్దుపోయే ... కబుర్లు చెప్పింది. రాత్రి కక్కడ ...మని వొదిన ఎంతచెప్పినా విన ... ఇంటికి బయలుదేరింది. నేను ...స్తా నన్నాడు రామం. 'వద్దు చలి ... అంది. రామం గుమ్మంలో ...న్నాడు.

...క నే వెళ్తాన్లే,' అంది శారద.

... ఇంటిదాకా వస్తా.'

...మ్మో వద్దు... నా కేం భయం లేదు. నీ ఆరోగ్యం సరికానీ. ఆతర్వాత నాకు తోడు నువ్వే...' వెళ్ళిపోయింది శారద చీకట్లో శారద నవ్వు దూసుకు పోయింది

* * *

పదవుతోంది, మళ్ళీ వర్షం హెచ్చు తోంది. రామం, పట్నాయిక్ కళ్ళన్నీ విజయనగరం రోడ్డుమీదే. వెంకట్రావ్ బస్ వస్తే లేపమని హోటల్లో ఓ మూల కుర్చీలో జోగుతున్నాడు. పట్నాయిక్ ఆశ వొదులుకున్నాడు. ఆమాట సూచనగా నైనా బయటికి అనలేకపోతున్నాడు. ఇంకో పావుగంట, ఇరవై నిముషాలు.. ఇరవై అయిదో...ఇంతలో రోడ్ మీద హెడ్‌లైట్‌లు వెలిగాయి. అదిగో... పరుగెత్తా రిద్దరూ... అది బస్ కాదు; లారీ. ఇక్కడకు రావలసిన ఆరుగంటల బస్‌గురించి వాకబుచేశారు. లారీడ్రైవర్ ఒరియాలో చెప్తున్నాడు. 'అంటే' అన్నాడు రామం ఆత్రంగా.

వాగులు పొంగాయన్న సంగతి తెలిసి, ఈ తుఫాను చూసి ఆ బస్ విజయనగరం నుంచి అసలు బయలుదేరలేదని తెలిసింది.

రామం తూలిపడబోయాడు. తనలో తను గొణుక్కుంటున్నాడు — అంతే... అంతే...

పదిన్నరకు హోటల్ రేడియోలో 'ఎతికిరె సేసేలా'

'అంటే...'

'ఇంతటితో సమాప్తం.'




సాొవిట్లోకి అడుగుబెడుతూ చుట్టూ చూసింది సరస్వతమ్మగారు ఇరుకుకి అలవాటు పడిన ఆమె కళ్ళకు అదొక పెద్ద భవనంలా అగబడింది. అంత విశాలమయిన హాలులో మధ్యగా ఒక టేబుల్, దాని చుట్టూ నాలుగు కుర్చీలు తప్ప సామాన్లే లేవు ఆవిడ లెక్కన అటువంటి గదిలో రెండు కుటుంబాలు అవలీలగా సర్దుకు పోవచ్చును

నవ్వుకుంది ఆవిడ 'ఉన్నవాళ్ళకీ, లేనివాళ్ళకీ వ్యత్యాసం ఇదే' అనుకుంటూ కూతురుకోసం చూసింది

ఆ పిల్ల అప్పుడే ఒక వారపత్రిక చేతికి తీసుకుని. కిటికీలో కూర్చుని చదివేస్తోంది.

'పిచ్చిపిల్ల, పుస్తకాలంటే మరేమీ అక్కర్లేదు. దీని జీవితం అయినా సుఖంగా వెళ్ళమారితే...' అంతలో ఆమె దృష్టి గోడమీద నున్న ఫొటోమీద పడింది. మరుక్షణంలో ఆమె హృదయము కృతజ్ఞతతో నిండిపోయింది

నావ నడిపేవాడు పోతే నడిసము ద్రాన నావలో కూర్చున్నదానిలాగా అయింది తన బ్రతుకు నెల గడిచే సరికి 'హమ్మయ్య, ఈనెల గడిపేశాం' అని ఆనందపడే జీవితం తమది: ఆ మహారాజు ఎలా ఈదేవారో ఆ భగవం తుడికే తెలియాలి! అటువంటిది ఆయ నకి రోగం ముంచుకు రావడం, సంపా దన లేకపోగా ఆయనకోసం ఖర్చు చేయ వలసిరావడంతో పూర్తిగా తలక్రిందు లయిపోయింది జీవితం. ఆయన అంతలా కష్టపడుతూ కూడా కూతురు పెళ్ళికోసమని ఇన్సూరెన్స్ కడుతుండే వారు. అది తలుచుకుని కొండంత ధైర్యం పుంజుకునేవారు. అటువంటిది ఆయనకాస్తా మంచం ఎక్కడంతో దానిమీద అప్పు, ఆఫీసులో రావలసిన దానిమీది అప్పు – ఎలాగయినా ఆయన్ని బ్రతికించుకోవాలన్నదే తన తాపత్రయం.

'నాకోసం ఖర్చుపెట్టకు సరసూ, నేను బ్రతికుండేకన్న పోయాకనే మీరు సుఖపడతారు' అనేవా రాయన.

'ఊరుకోండి, అ వేం మాటలు? ఈ డబ్బంతా నన్ను ఉద్ధరిస్తుందా? కంటి ముందు చల్లగా మీ రుంటే చాలు' అనేది తను.

'నా మాటలు అబద్ధం అనుకుంటు న్నావ. చూస్తూండు, నాతోనే మీకు పట్టిన శని పోతుంది' అని నవ్వేవాడు.

ఆయన కన్ను మూయడంతో లోకమే అంధకారమయ మయిపోయింది తనకి. చేతిలో డబ్బులేదు – వెంటనే జరుపవలసిన పనులకి తరువాత రెండు పొట్టలు నిండాలి – తను, వరలక్ష్మి. పైగా అది ఈడేరిన పిల్ల!

ఏడ్చేందుకు కన్నీళ్ళు కూడా కరు వయి పోయాయి తనకి. అటువంటి పరి స్థితిలో దేముడిలాగా ఆదుకున్నాడు ఆయనగారు – ఇతని తండ్రి స్నేహితు లట! పైగా దూరపు బంధుత్వంకూడా ఉంది.

'నే నున్నాను, దిగులు పడకండి' అన్నాడు వచ్చి రావడంతోనే! 'నా కే లల్లాడదు...' అని హామీ ఇచ్చిన శ్రీకృష్ణ భగవానుడు గుర్తుకొచ్చాడు.

అతని అండ దండలతోనే ఏ లోపం లేకుండా జరగవలసిన పనులన్నీ జరిగి పోయాయి!

'మీ కేం అభ్యంతరం లేకపోతే మా ఇంట్లోనే వచ్చి ఉండండి. లంకంత కొంప – ఆడదిక్కు లేక సందడి లేదు' అన్నాడు

అతని మాటలోని ఆత్మీయత వలన కానీ, తన నిస్సహాయత వలన కానీ – కాదనలేకపోయింది.

అతనికి చేయెత్తి నమస్కరించ బుద్ధేసింది సరస్వతమ్మగారికి.

'దాన్ని తీసెయ్యవయ్యా, జనం రుడుసుకుంటా' రంటే మా ఆత్మయ్య ఊరుకోడు. 'చినబాబుగారి పటం

ఉండాలిసిం దంటా' డని అంటూ లోప
లికి వచ్చి కుర్చీలో కూర్చుని బూటు

విప్పుకుంటూ, "ఎంతసేపయింది మీరు
వచ్చి? స్నానాలు చేశారా? లక్ష్మయ్యకి



చెప్పివెళ్ళానే మీరు వస్తానని!" అనడిగాడు విశ్వేశ్వరరావు.

"ఇప్పుడే వచ్చాము నాయనా. మీ లక్ష్మయ్య మాకోసం గది బాగుచేయి స్తుంటే ఇక్కడ..." మాట మధ్యలోనే ఆపుచేసి కూతురివైపు చూసింది ఆవిడ.

పరిచయంలేని వ్యక్తి ఇంట్లో అతని ముందు ఏం చేయాలో తెలియక తిక మకపడి పుస్తకంలో తల దాచేయడమే మంచిపని అని అప్పనే చేస్తోంది వరలక్ష్మి. ఈ ఖంగారులో తల్లి అక్కడినుంచి వెళ్ళిపోవడమే గమనించ లేదు ఆ అమ్మాయి.

కొంచెంసే పయాత "మీ పేరు వరలక్ష్మి కదూ?" అనడిగాడు విశ్వే శ్వరరావు.

ఉలిక్కిపడి పుస్తకం కిందికి దించి, అవు నన్నట్లు తల ఊపింది వరలక్ష్మి.

"చదువుకున్నారా?"

"కొద్దిగా!" అంది తల వంచుకుని.

"అంటే ఎంతవరకు?"

"స్కూల్ ఫైనల్ పోయింది."

ఆశ్చర్యపోయాడు విశ్వం.

ఇంకా ఏమయినా అడుగుతాడేమో నన్నట్లుగా కాసేపు కూర్చుని తరవాత లోపలికి వెళ్ళిపోయింది వరలక్ష్మి.

విశ్వేశ్వరరావు ఆలోచనల్లో పడి పోయాడు.

"మనిషి మనస్సుకి ముఖం ప్రతి బింబం అంటారుగాని ఈయనపట్ల అదే నిజమయితే మన మిక్కడ ఉండేవాళ్ళమే కాము," అంది వరలక్ష్మి లోపల తల్లితో.

విశ్వేశ్వరరావుకి లోగడ ఇంటికి రావడమంటే భయంగా ఉండేది. పెద్ద భవనంలాంటి కొంపలో తనకోసం లక్ష్మయ్య ఒక్కడూ బిక్కు బిక్కుమంటూ కూర్చుంటా డని వస్తుండేవాడు తప్ప, ఆ ప్రశాంత వాతావరణం అతనికి నచ్చేదికాదు. అందుకే ఎక్కువగా క్లబ్బుల్లోనే గడిపేవాడు. రెండుమూడు తరాల వరకు సరిపడే డబ్బుకి అతను ఏకైక వారసుడు. దగ్గరలో 'నా' అనే వాళ్ళు లేరు. పెద్దదిక్కుగాని, చిన్న దిక్కుగాని అతనికి అతనే!... అందుకే కొందరు అతన్ని "క్లబ్బుపక్షి" అని పిలుస్తూంటారు.

'తనకోసం ఎదురుచూసే మనుష్యులు పెరిగారు.' అనుకుంటూంటాడు. అత నిప్పుడు క్లబ్బునుంచి బయలుదేరుతూ. అది అతనికి ఎంతో మధురమయిన ఆనందాన్ని కలిగిస్తుంటూంది కూడా!

తను అనుకుంటున్న మాటని బయట పెట్టేధైర్యం కలగటానికి కొన్నిరోజులు పట్టిం దతనికి. తనని వీళ్ళెక్కడ అపార్థం చేసుకుంటారో నని అతని భయం. ఒక రోజు భోజనం చేస్తూ అన్నాడు: "ఈ వారంనుంచీ వారపత్రికలు మనింట్లో పడేయమని చెప్పానండీ!" అని —

"ఎందుకు నాయనా, మ వ్వెటూ



క్లబ్బుల్లోనే చదివివస్తావాయె! మాకోసం ఆ దండగకూడా ఎందుకు?"

నవ్వేశాడు విశ్వేశ్వరరావు. "భలే వారే, అందువలన అయే దెంత? నేను మాత్రం ఇంటిదగ్గర చదువుకో కూడదూ?" అని కాసేపాగి, "మీరు కృష్ణా రామా అనుకుంటే కాలం గడిచి పోతుంది. కాని మీ అమ్మాయికి పొద్దు పోనక్కరలా?"

పరస్వతమ్మగారు మాట్లాడకపోవడం చూసి ధైర్యం తెచ్చుకుని అన్నాడు: "అసలు మీ వరలక్ష్మి స్కూల్ ఫైనల్ తప్పిందన్నారు కదా; అ దెందుకు పూర్తి చేయకూడదూ?" అని.

"ఆఁ, ఇప్పు డిదొకటి తక్కువ దానికి! అయినా..." మాటమధ్యలో తలుపు చాటుగా నిలబడిన కూతురివంక చూసి ఆపేసింది.

"తక్కువేమండీ! అసలు చదవక పోతే దిగులేలేదు. చదివిందికదా –"

"పాపం, వాళ్ళ నాన్నగారు పోవడం– ఆ హడావుడిలో పరీక్ష పోయింది. లేకపోతే తెలివిగలదే!"

"మరింకేమండీ, అమ్మాయి నిటు పిలవండి. నేనే అడుగుతాను" అన్నాడు ఉత్సాహంగా.

"అబ్బాయి పిలుస్తున్నాడు రావే."

మెల్లగా వచ్చి నిలబడింది వరలక్ష్మి విశ్వేశ్వరరావుకి ఆ అమ్మాయితో ఎలా మాట్లాడాలో తెలియలేదు.

"పరీక్షకి కట్టరాదూ?"

"మీ ఇష్టం!"

"అదే ఒద్దు; నే నేది చెప్పినా 'మీ ఇష్టం' అంటే నాకూ భయంగా ఉంటుంది చెప్పేందుకు। చదువుదా మని ఉత్సాహం ఉందా లేదా ?"

"ఉంది "

"పరీక్షకి డబ్బు కడదామా అయితే?"

"మీ ఇష్టం" అని కాసే పాగి నవ్వే సింది. అతనుకూడా గలగల నవ్వేయ డంతో కొరబోయి దగ్గడం మొద లెట్టాడు

"ఎవరో తలుచుకుంటున్నారు" అంది వరలక్ష్మి.

దగ్గు తగ్గాక "ఇంకెవ రున్నారు? మీ ఇద్దరిలో ఎవరయినా తలుచుకోవల సిందే" అన్నాడు విశ్వేశ్వరరావు.

"నేనుమాత్రం కాదుబాబూ" అంటూ వరలక్ష్మి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

అతనితో ఆ అమ్మాయి బాగా మాట్లా డడం అదే మొదలు. అంతక్రితం అతనే రెండు మూడుసార్లు పలుకరించినా అడిగి నంతమట్టుకే సమాధానం వచ్చిం దతనికి.

ఈనాటి ఆమెతోడి సంభాషణ అతని కెంతో ఆనందాన్ని కలిగించింది. అతని ఉద్దేశ్యంలో వరలక్ష్మి చాలా అంద మయిన పిల్లా, చదువుకున్నదీ, సంస్కా రం కలదీ, అణకువ కలదీ. ఇవన్నీకాక ఇప్పుడు అతను తెలుసుకున్న విషయం ఆ అమ్మాయి సరదాగా మాట్లాడకలదని।

"ఈ రోజునుంచీ చదువు మొదలె ట్టించండి. కావలసిన పుస్తకాలు పట్టు కొస్తాను. అంతగా ఎందులోనయినా వెనకబడిఉంటే నేను చెబుతాను."

"నీ కెందుకు నాయనా అంత శ్రమ? చదువుకుంటుందిలే" అంది సరస్వతమ్మ గారు.

ఒక్కసారి ఆమెవంక చూసి గబ గబా చేయి కడుక్కున్నాడు విశ్వం.

తను ఎంతోఉత్సాహంతో అన్నమాట కావిడ 'ఎందుకులే నాయనా' అనేయ డము అతనికి ఎంతో ఆశాభంగాన్ని కలి గించింది.

కొన్ని రోజులుగా తనలో వస్తున్న మార్పుల్ని అతను గమనించుతున్నాడు. ఇదివరలో అతనికి లోకం కవులు వర్ణించే అమిత అందంగా కనిపించక పోగా, జీవితం యాంత్రికంగా సాగు తున్నట్లు అనిపిస్తుండేది. ఎప్పుడు చేసినా ఒకటే పనులు. నిన్నటికీ ఈ రోజుకీ తేడా లేకపోవడం. రేపు ఇది మారుతుం దన్న ఆశ లేకపోవడం – వీటితో అతను విసిగిపోయాడు.

కాని ఈ మధ్య అతనికి పరిసరాల్లో కూడా మార్పు అగపడుతోంది. బజారు నుంచి వస్తుంటే పళ్లూ, పూలూ అవి కంటికి అగపడి, కొని ఇంటికి తీసుకు వెళుదామన్న కోరిక కలుగుతుండడం అతనికే ఆశ్చర్యం కలిగించింది.

దీని కంతటికీ కారణం ఏమిటో కూడా అతనికి తెలుసు – వరలక్ష్మి!

ఇంట్లో లక్ష్మిలాగా ఆ అమ్మాయి




తిరుగుతూంటే అతనికి ఎంతో నిండుగా ఉంటుంది. ఇది అలాగే శాశ్వతంగా ఉండేట్లు చేసుకోవాలని ......

కాని అంతలోనే తన జీవితంలోని ఒక అపశ్రుతి వినపడుతూంటుంది. గతంలో కూడా ఒకసారి, ఒకే ఒక్కసారి అతని జీవితంలోకి వెన్నెల ప్రవేశించింది. అది శారదారాణి రూపంలో.

ఇప్పటికీ ఆమెను తలచుకుంటే భయం కలుగుతూంటుంది అతనికి అది ఆమె రూపం వలన ఏర్పడినదికాదు. ఆమె అన్న మాటలు మనస్సులో మెదలడంవలన.

శారదారాణి అతనికి దూరపు బంధువు. అతనికున్న ఆస్థిని చూసి ఆమెను అతనికి దగ్గిర చేర్చాలని వాళ్ళ పెద్దవాళ్ళు ప్రయత్నించారు. అది అతనికి తెలిసి కూడా ఉండబోడు. కారణం - ఆ అమ్మాయి సరదాగా మాట్లాడుతూ, కంటికి నిండుగా, అందంగా ఉండేది. కాలేజీలో అతనికి జూనియర్ ...... ఆ అమ్మాయి తన దయితే చాలునని కలలు కన్నాడు. దానికి తగ్గట్టుగానే అతన్ని ప్రోత్సహిస్తున్నట్లుగానే ఉండేది ఆ అమ్మాయి ప్రవర్తన.

తనచేతి అడగబడడమే ఆ లక్ష్యం అన్నట్లుగా మాట్లాడుతుండడంతో ధైర్యం చేసుకుని అడిగాడు 'నువ్వు నా దానివయి నా జీవితానికి అర్థాన్నియ్యి శారదా !' అని.

అంతే, పగలబడి నవ్వింది. అతను తెల్లబోయాడు.

'మైడియర్ పూర్ సోల్, ఒక్కసారి నీ ముఖం అద్దంలో చూసుకోవయ్యా... నీతో చనువుగా తిరుగుతున్నానంటే దాని క్కారణం నీ డబ్బు నాకోసం విచ్చలవిడిగా ఖర్చు పెడుతున్నావు. నాలాంటి అందమయిన పిల్ల

నీకు స్నేహితురాలుగా ఉండటానికి మాత్రమే అది ఖరీదు. పెళ్ళి చేసుకునేందుకు నాకు కావలసినది మగవాడిలో డబ్బుతోపాటు అవతలివాళ్ళ ఋడుసుకోకుండా ఉండేపాటి రూపం!

'ఒక్క సలహా. నిన్ను ఏ ఆడది చేసుకునేందుకు తయారయినా, అది నీ డబ్బు చూసే అని గుర్తుంచుకో! కావాలంటే ఇంకా నీ స్నేహితురాలినే నేను' అంది.

ఊచిపుచ్చుకుని కొడదామన్నంత కోరికని అణచుకుని ఇంటికొచ్చి వెక్కి వెక్కి ఏడ్చేశాడు. తనకి జీవితంలో ఆడదాని సాంగత్యం వద్దు. కావాలంటే డబ్బుకి ఆ అనుభవం కొనుక్కోగలను అనుకున్నాడు ఆరోజునే. తనకి ముప్ఫయి ఏళ్ళు దాటినా ఆ ప్రసక్తి ఎవరినీ తేనీయడు.

మళ్ళీ ఇన్నాళ్ళకి – ఇన్ని ఏళ్ళకి తన హృదయం స్పందిస్తోంది – కాని చరిత్ర చర్విత చర్వణం కాకూడదు. తను జీవితంలో రెండోసారి ఓడిపోలేదు. తన అదృష్టం బావుంది. వరలక్ష్మిగాని సరస్వతమ్మగారుగాని అటువంటి ప్రసక్తి తెస్తే తను ఆనందంతో ఎగిరి గంతేస్తాడు. తనకై తను అడిగితే ఆనందలో ఆదుకున్నాడన్న కృతజ్ఞతతో ఒప్పుకుంటే తనకి సంతృప్తి ఉండదు.

తన మనస్సు తప్పుఅర్థం చేసుకునే శుభసమయంకోసం ఎదురుచూస్తూ ఉంటాడు తను. ఆది వాళ్ళకి తెలిసే విధంగా ప్రవర్తిస్తాడు కూడా!

"నే నేం తెచ్చానో చెప్పుకోచూద్దాం!" అన్నాడు చదువుకుంటున్న వరలక్ష్మితో.

తలెత్తి అతన్ని చూసి లేచి నుంచుని, "తెలియదు". అంది వరలక్ష్మి.

"ఊహించలేవూ?"

"ముందు ఆ వస్తువు లక్షణాలు చెబు[illegible]..."

"ఆల్‌రైట్! నీకోసం – మరి చెప్పు?"

సిగ్గుపడింది వరలక్ష్మి.

"పుస్తకాలు."

"ఉహుఁ."

"స్త్రీల వ్రతకథలు!"

ఇద్దరూ ఫక్కున నవ్వేశారు.

తను తెచ్చిన ప్యాకెట్టు బల్లమీద పెట్టాడు విశ్వేశ్వరరావు. అందులోంచి చీర, చెప్పులు, టాయిలెట్ బాక్స బయటికి తీశాడు.

ఆశ్చర్యపోతూ నిలబడిన వరలక్ష్మితో "ఇవ్వాళ కొత్తసంవత్సరం. వరలక్ష్మీ! ఈసారి కాలేజీలు తెరవగానే నువ్వు చేరబోతున్నావు. అందుకనే నీ వేషంలో మార్పుకి ఈరోజు నాంది పలకాలి!" అని జేబులోంచి డైరీ తీసి ఇస్తూ "ఇది రోజూ వ్రాయడం అలవాటు చేసుకోవాలి." అన్నాడు.

"నా డైరీ పేపర్లలో పడేటంత గొప్పదాన్ని కాబోనులెండి!" అంది,




చాలమంది ఉన్నారు ఆడపిల్లలు. "నీ కోసం కాదులెద్దూ; మన వరలక్ష్మికి స్థానిక యజమాని."

కొంపదీసి వరలక్ష్మికి కాబోయే ... కాదు కదా?" గొల్లున నవ్వింం దొక అమ్మాయి.

"యజమాని అంటే దీని ఉద్దేశ్యం గార్డియన్ కాబోలే!"

గబుక్కున నవ్వేశారు కొందరు.

తెల్లబోయాడు విశ్వేశ్వరరావు.

అంతలో "వినబడుతుంది" అన్న మందలింపు వినబడింది మెల్లగా.

'బహుశః వరలక్ష్మి అయ్యుంటుంది,' అనుకుని వెనక్కు తిరిగాడు.

వరలక్ష్మి గబగబా అతని దగ్గరకు వచ్చి. "ఎప్పుడు వచ్చారు ఊరు నుంచి?" అనడిగింది.

"ఇప్పుడే" అన్నాడు నవ్వు ముఖాన పులుముకు. టూ.

"ఏమయినా పనుండి వచ్చారా ఇటు?"

"అబ్బే ఏం లేదు. వెళ్ళి నెలయిందిగా— మీ కాలేజీలో జీతం వగయిరాలు కట్టాలేమో నని... వస్తా పనుంది. అదయాక నేరుగా ఇంటికే వచ్చేస్తాను." అని మోటారు సైకిల్ ఎక్కాడు.

'వినపడుతుంది!' అని మాత్రమే అందిగాని వాళ్ళని మందలించ లేక పోయింది. అయినా తన పిచ్చిగాని ఆ అమ్మాయికి మాత్రం తనంటే ఇష్టం ఎలా ఉంటుంది? 'చదువుకున్నది. అందమయినది! శారద అన్నట్టు... అంతే. అతని ఆలోచనలు ఆగిపోయాయి.

శారదారాణి అన్న మాటలు గుర్తు చేసుకునేందుకు అతనికి ధైర్యం చాలదు ఎన్నడూకూడా! ...

"ఇంత బరువు మోస్తున్నవాడికి నీ నెత్తిన మరో భారం వేయాలి నాయనా" అంది సరస్వతమ్మగారు విశ్వేశ్వర రావుతో — అతను ఇంటికి రాగేనే.

"ఏమిటండీ అది?" అడిగాడు.

"వరలక్ష్మిని గురించి."

"వరలక్ష్మిని గురించా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవు న్నాయనా. ఈ ఏడు దాన్ని ఒక్కింటిదాన్ని చేసెయ్యాలి. వారి ఉద్యోగంమీద వచ్చిందీ అవీ కలిపి ఒక రెండువేలదాకా ఉన్నాయికదా!"

"డబ్బు దేముంది లెండి..."

"అదేం మాటా? ... అదలా ఉందా, దీని అదృష్టవశాత్తు వాళ్ళ కాలేజీ లెక్చెరరట — వీళ్ళ నాన్నగారు ఎరుగున్నాయన్ని ఒకాయన్ని వెంటబెట్టుకుని వచ్చాడు. అతనికి కట్నం వద్దుట, వరాన్ని చేసుకోవాల నుండిట. అతని మీద ఆధారపడినవా రెవరూ లేరుట. మనిషి మంచి రూపసి...ఏమంటావు?" అని అతనివంక చూసింది.

విశ్వేశ్వరరావు ఆమెకు సమాధానం చెప్పే స్థితిలో లేడు. అతని ఆలోచనలు స్తంభించిపోయాయి.

మళ్ళి ఆవిడే అన్నది. "నేను మాత్రం నీ పేరు చెప్పి. అతన్ని కలుసుకోండి. అతను ఊఁ అంటే నాకే అభ్యంతరం లేదు" అని చెప్పాను.

"వరలక్ష్మి ఏమంటుంది?" అనడిగాడు కొంతసే పాగి.

"ఇంక అడగలే దనుకో! అయినా నామాట కాదనదు. పైగా నిక్షేపంలాంటి సంబంధం వస్తే చేదా ఏం?"

అతను లేచి నిలబడి "బావుందండీ — అదృష్టవంతురాలు." అన్నాడు.

ఇంతలోకే వరలక్ష్మి రావడం చూసి "నీ పెళ్లి విషయమే మాట్లాడుతున్నాం వరలక్ష్మీ: ఆతన్ని గురించి అమ్మగారు చెప్పారు. 'అదృష్టవంతురాలు' అన్నాను. నీ ఉద్దేశ్యం ఏమిటి?" అనడిగాడు ఆమెవంక చూస్తూ.

ఒక్కసారి తలెత్తి అతని ముఖంలోకి చూసి "మీ ఇష్టం" అని లోపలికి వెళ్లిపోయింది.

విశ్వేశ్వరరావు పూర్తిగా ఓడిపోయాననుకున్నాడు. 'తన్నెవరు చేసుకున్నా ఆస్తికోసమే! దానిమీద అట్టి మమకారం లేనివాళ్ళకి తను అనవసరం. వరలక్ష్మి తనతో చాలా చనువుగా మాట్లాడుతుంది — బహుశా జాలివల్లనేమో. ఆమె దృష్టిలో తను ఒక అంద విహీనమైన అన్నగా రేమో! ... తన జీవితం ఇంతే — ఎవరో ఒకరు ప్రవేశిస్తారు. కాసేపు మురిపిస్తారు, తరువాత మరొకవర్ని కట్టుకుని వెళ్లిపోతారు. తనల్లా ఒక ప్లాట్‌ఫారం లాంటివాడు.' అతనికి




ఏడుపొచ్చేసింది. సిగిరెట్టు పారేసి గబ గబా మేడమీదికి వెళ్ళిపోయాడు.

* * *

వరలక్ష్మి లేని ఇంట్లో ఉండేందుకు అతనికి మనస్కరించలేదు. ఏదో వెలితిగా కనబడసాగింది. రోజూ కాలేజి నుంచి ఆమె రాకకై తను ఎదురు చూడడం, కాసేపు కబుర్లు చెప్పుకోవటం, రాత్రిపూట ఒకటో రెండో ప్రాబ్లమ్స్ చేసిపెట్టడం – ఇవన్నీ గుర్తుకు రాసాగాయి.

అందుకనే అతను కొన్నాళ్ళపాటు తిరిగిరాదల్చుకున్నాడు. 'శారదారాణి తనమీద తీసిన దెబ్బకి ఆరునెలలపాటు తిరిగిన ప్రదేశం తిరక్కుండా తిరగవలసి వచ్చింది.' బాధగా నవ్వుకున్నాడు.

"నేనుకూడా అమ్మాయిదగ్గిరకు వెళ్ళి ఉంటాను నాయనా" అంది సరస్వతమ్మగారు అతని మాట విని –

"అదేమిటండీ, అందరూ నన్ను వదిలిపోతే నే నేంకాను?" అన్నాడు.

ఆ కంఠం విని ఆవిడ తెల్లబోయింది. అతను ముఖం తిప్పేసుకుని "వద్దండీ, మీరుండిపొండి" అని వెళ్ళిపోయాడు.

ఒక రెండునెలలపాటు తన కున్న స్నేహితుల నందరినీ పలకరించేశాడు. అయినా అతను కళ్ళకీ, చెవులకీ పనయితే చెప్పగలిగాడు గాని మనస్సుని మాత్రం ఏమార్చలేకపోయాడు. ఆమెను చూడక పోయినా ఆమెను గురించి మాటయినా వినడంకోసం అతని మనస్సు తహ తహ లాడిపోయింది.

"వరలక్ష్మి బాగుందాండీ?" అని అడిగాడు వచ్చీరావడంతోనే.

"ఏమో నాయినా, నాకు దాని పరిస్థితి ఏమీ బాగుండలేదు. అతను ఈ ఉద్యోగం మానేసి పట్నంలో ఉద్యోగం చేస్తున్నాడు" అని కాసేపాగి "దాన్ని సరిగా చూడడంలేదు." అంది కళ్ళనీళ్లు పెట్టుకుంటూ.

విశ్వేశ్వరరావుకి తలమీద పిడుగు పడినట్లయింది. "ఎందుకుట."

"ఏమని చెప్పను-అనుమానాలు!... దేవుడిలాంటి నీ మీద అనుమానంతో దాన్ని నానా ఏడుపులూ ఏడిపిస్తున్నాడు. రోజూ అది రాసుకునే పుస్తకం 'డైరీ'ట- అది చదివేడట! అందులో ఈ మొద్దు ఏం అఘోరించిందో ఏమో; అప్పటి నుంచీ..."

ఇహ, వినవలసి కోలేదు అతను. తనామెకు ఇచ్చిన డైరీ ఆమె పుస్తకాల్లో గుర్తుంది అతనికి. గబగబ వెళ్లి అపన్నీ వెతికాడు. అది అగపడగానే ఒక్క-క్షణం తటపటాయించాడు 'చదవడం సభ్యత కాదని'.

తన మనస్సు తొందర చేయసాగింది. "తనామె రహస్యాలను వెదకబోవడం తన క్కావలసింది. తనపట్ల ఆమె మనస్సును తెలుసుకోవడం. తనికి ఆనం దాన్ని కలిగించే మాటలు అందులో ఉన్నాయేమో నని!"

పుస్తకం తీశాడు. చదవసాగాడు. మొదటి పేజీలో-

"నన్ను డైరీ వ్రాయమని ఇచ్చారు. ఇం కెవరిని గురించి మొదలెట్టను? నా మనస్సంతా ఆక్రమించుకున్న ఆయన తోనే ప్రారంభం. ఆయన్ని అంతా 'కురూపి' అంటారు. కాని నా కాయన లోని అందమే అగపడుతుంది. వెన్న లాంటి ఆయన మనస్సుని చూడలేక అలా మాట్లాడుతున్నా రంతా! ఆయ నిచ్చిన బట్టలు కట్టుకున్నాను. ఒళ్ళంతా ఆయన ఆక్రమించుకున్నట్లుగా..."

విశ్వేశ్వరరావుకి ఆమె సిగ్గుపడుతూ నిలబడినట్లు అగుపించింది... ఒకరోజు.

"అమ్మకి భయం ఎక్కువ. నాకూ అదే నూగిపోస్తోంది. 'డబ్బున్న పిచ్చికని పట్టారు తల్లీ, కూతురూ - హా దెలా ఉండే నేం? కోటలో పాగా వేశారు - అని సూటీపోటీ మాట లంటున్నారే వరం. అతన్ని చూస్తుంటే మా త్రం నువ్వంటే ఇష్టంగా అగపడలేదు. కాని మనకై మనం ఆ విషయం కదిపితిమా అతని కిష్టం లేకపోతే అల్లరి పడిపో తాము. బ్రహ్మ ఎలా రాసిపెడితే అలా అవుతుంది. నీ అదృష్టం బావుంటే అతనే అడుగుతాడు' అంటూంటుంది. నాకు అమ్మమాట నిజ మనిపిస్తుంది. ఈ విషయాల్లో ఎప్పుడూ మగవాడే చొరవ తీసుకోవాలి..."

..."ఒకసారి ఆయనకి కోర బోయింది. 'మీ రిద్దరిలో ఎవరో తెలుసుకోవలసిందే కాని నా కిం కెవ రున్నారు?' అన్నారు - నా మనస్సుని చదివినట్లు. అప్పుడు నేను సరిగా అదే పని చేస్తున్నాను. అందుకే సిగ్గేసింది. 'నేను కాదు బాబూ' అన్నాను. కాని 'నేనే' అని ఆయనకి తెలిసే దెలా?..."

... "అమ్మ ఈ రోజు పెళ్ళి సంభా

క్షణ కదిపింది. 'గంతకు తగ్గ బొంత ఒకడ్ని దానికి కడితివంటే...' అంటూ. ఆయన బయట పడతారేమో నని ఎదురు చూశాను కాని నా ముఖంలోకి చూసి లోపలికి వెళ్ళిపోయాడు. కొంచెంసేపు కావాలని అడిగించా ననుకున్నారేమో? అసలు నే నాయన్ని పొరపాటుగా ఊహించుకుంటున్నానేమో. ఆయనకి నామీద అటువంటి అభిప్రాయం లేదేమో !''...

విశ్వేశ్వరరావుకి ఒళ్ళు తిరిగిపోయింది. చేజేతులా వదులుకున్నాడు. చేతి కందబోయిన పెన్నిధిని.

గబగబ అనాడు కాలేజీలో జరిగిన సంఘటనకోసం వెతికాడు —

...''నెల్లాళ్ళతర్వాత ఆయన రాగానే కాలేజీకి వచ్చారు. ఆయనని చూడగానే సర్మిల, సుశీల వాళ్ళంతా నవ్వుకోటం మొదలెట్టారు. ఆయన నెక్కడ ఏమంటారోనని నా ప్రాణం చచ్చిపోయింది ఆయన వెళ్ళిపోయాక వాళ్ళని ముఖం వాచేట్టు చివాట్లు వేశాను.

'అంత గౌరవం ఉంటే ఆ ఆకారాన్ని పెండ్లి చేసుకోరాదూ?' అంది మేరీ. 'తప్పకుండాను! పైగా ఆ అవకాశం వస్తే నా అదృష్టానికి పొంగి పోతాను. నన్ను చూసి మీరు ఈర్ష్యపడే రోజుకూడా రాకపోదు' అనివచ్చేశా... నేను ఆయన మాటకోసం వేచిఉన్నానని ఆయనకి తెలిసేదెలా? అసలు ఆయన మనసులో నేనంటే ఎటువంటి అభిప్రాయం ఉందో?

''ఇన్ని ఆలోచనలతో ఇంటికి వచ్చిన నా ఆశలన్నీ కూలిపోయాయి. అమ్మా, ఆయనా కలిసి నాకోసం పెళ్ళిసంబంధం వెతుకుతున్నారు

''అయినా నేను పెర్రిదాన్ని కాకపోతే ఆయన మీద నాకు మనసేమిటి? ఆయన నా కెక్కడ అందుతారు? ... 'వినువీధి నేగే రాజుపై, నిరుపేద చెలి పై మనసౌనా...' అంతే. ఇది నాకోసం రాసిన పాటే?''

వెంటనే వేసి బాదుకోవా లనిపించింది విశ్వేశ్వరరావుకి. మళ్ళీ చదవడం మొదలుపెట్టాడు.

...''పెళ్ళి నిశ్చయమయిపోయింది. నన్ను నేను వంచించుకునేందుకు ప్రయత్నిస్తున్నాను తప్పదుగా మరి. చేసుకున్నవాడే ఆడదానికి దేముడు. నామనసులోని దేముడిని చెరిపేసుకోవాలి, నా తరమా?''

ఇక సరిగా చదవలేకపోయాడు ప్రతి పేజీ ఆమె మనస్సు విప్పి చెప్తూంటే తను పోగొట్టుకొన్న పెన్నిధి యొక్క విలువ అతన్ని విభ్రాంతుణ్ణి చేసేసింది.

'ఇద్దరూ ఒకరికోసరం ఒకరు తంపించిపోయారు. వరలక్ష్మి అంతస్తుకి భయపడింది తనని మనస్సే భయపెట్టింది ఇద్దరూ ఒ

మాటకోసరం ఒకరు ఎదురు చూసి నాశనం అయిపోయారు !'

అంతలోనే ఒక నిర్ణయానికి వచ్చేశాడు విశ్వేశ్వరరావు : 'తన వరలక్ష్మిని తను వదులుకోలేదు. వచ్చిన అనుమానాలు ఎటూ వచ్చాయి. వాటిని నిజం చేసి తను ఆమెను దక్కించుకుంటాడు. జీవితం అంతా ఆమె సహచర్యంతో కమ్మటి కథగా గడిపేస్తాడు. వరలక్ష్మి తనది. దానికి తిరుగులేదు.' లేచి నిలబడ్డాడు.

* * *

గుమ్మంలో నిలబడిన విశ్వేశ్వరరావుని చూసి ఆశ్చర్యపోయింది వరలక్ష్మి. ఆమె ముఖం ఒక్కక్షణం ఆనందంతో వెలిగిపోవడం గమనించాడతను.

"రండి రండి – ఉత్తరం ముక్కయినా వ్రాయకుండా వచ్చేశారు. పోనీ లెండి, ఈమాత్రం దయన్నా ఉంచారు," అంది వరలక్ష్మి నవ్వుతూ.

"అతను లేడూ ?" అడిగాడు బెరుగ్గా విశ్వేశ్వరరావు.

ఆమె కాసేపు మాటాడకుండా ఉండి, 'లేరు" అంది.

వెంటనే తను వచ్చినవిషయం చెప్పేద్దా మని అతనికి నోటిదాకా వచ్చింది గాని అది సమయం కాదని ఆగిపోయాడు.

ఆమె వంట చేస్తుంటే అతను వంటింట్లో కూర్చుని తను ఏయే ఊళ్ళు చూసిందీ, అక్కడి విశేషాలూ చెప్ప సాగాడు. ఆమె వింతగా అవన్నీ వింటూంటే అతనికి తనో పెద్ద ప్రయోజకుడయిపోయినట్లు అనిపించింది.

"నావెంట వచ్చావంటే అన్నీ చూపిస్తాను," అన్నాడు ఉత్సాహంగా.

"మీరు తీసుకెళ్ళాలేగాని దాని కేం, తప్పకుండా వస్తాను," అంది వరలక్ష్మి వడ్డించిన కంచం అతనిముందు పెట్టి.

"సాయంత్రం మనం సినిమాకి వెళ్లాలి !" అన్నాడు విశ్వేశ్వరరావు మద్యాహ్నం కాఫీలుకూడా అయ్యాక.

"ఇవ్వాళా ?"

"ఏం, నాతో రాకూడదా ?... అవును లే పరాయి వాడి నయానుగా !" బాధగా అన్నాడు.

"ఛ ! ఛ ! అవేం మాటలండీ ?" అంటూనే ఏడ్చేసింది వరలక్ష్మి.

అతని కండ్లలో కూడా నీళ్లు నిండాయి.

కొంతసేపటికి ఆమె సర్దుకొని "చిన్నపిల్లల మయిపోయాం !" అంది పేలవంగా నవ్వుతూ.

కాదు వరలక్ష్మి, మనకన్న వాళ్ళే తెలివిగా ప్రవర్తిస్తారు. వాళ్ళకి కావలసిందాన్ని నోరు తెరచి అడగడం వాళ్ళకి తెలుసు. పీకలదాకా అభిమానాలు పెట్టుకుని వ్యక్తం చేసుకోక దూరం అయిపోయాం ఒకరికొకరం. నా విషయం తెలిసిందే. నువ్వుకూడా సుఖపడ్డం



లేదని చెప్పింది అమ్మ. మనకు మనం విధించుకున్న దీ శిక్ష.... అయితే ఇది ఎక్కువకాలం సాగటానికి వీల్లేదు అందుకే ఇప్పుడు నేను వచ్చినది. నా వెంట రా వరలక్ష్మి !" అన్నాడు ఆవేశంగా.

వరలక్ష్మి దిగులుగా నవ్వింది.

"ఈమాత్రం చొరవ వీడికి ఇది వరకే ఉంటే బాగుండిపోయేది అనుకుంటున్నావు కదూ వరలక్ష్మి ? నిజమే. కాని నా గతం నేర్పిన పాఠం నన్ను పాడుచేసింది. నీ మనస్సు తెలియకుండా తొందరపడడం కూడదని నష్టపోయాను. అందుకే— మన జీవితాలు మనమే బాగు చేసుకోవాలి. వీళ్ళందరికీ దూరంగా వెళ్ళిపోదాం రావూ ?"

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. తరువాత —

"మా అమ్మ బాగుందా ?" అడిగింది వరలక్ష్మి.

"నిన్ను గురించి దిగులు పడుతోంది..."

సినిమా చూస్తున్నట్లే లేదు విశ్వేశ్వర రావుకు. ఎన్నాళ్ళకి తను కోరుకున్న అదృష్టం తనని వరించింది ! వరలక్ష్మి

తన పక్కన ఉంటే ఈ లోకానికే తను అధిపతి నన్నంత ఉత్సాహంగా ఉంది అతనికి.

తాము గడపబోయే జీవితం. ఏయే ప్రాంతాలు ముందు చూడాలో, అన్నీ అనర్గళంగా ఏకరువు పెడుతున్నాడు. వరలక్ష్మి మాట్లాడకుండా వింటోంది.

సినిమా అయాక హోటల్లో భోజనం చేసి ఇంటికి చేరుకున్నారు.

విశ్వేశ్వరరావుకి ఆకాశంలో తేలిపోతున్నట్లుంది. "ఏం వరం. రేపు తెల్లవారగానే బయలుదేరాలి."

"అలాగే!"

ఒక్కసారి ఆమెను చేతుల్లోకి తీసుకున్నాడు. ఆమె అభ్యంతర పెట్టలేదు. ఆమెను ఇంకా దగ్గరగా లాక్కొని "అదృష్టవంతుడ్నే. నేనుకూడా-ఇన్నాళ్లూ కాదేమో నని భయపడ్డాను" అన్నాడు.

అతని చేతుల్ని వదిలించుకుని గదిలోకి వెళ్ళిపోయి తలుపు వేసుకుంది వరలక్ష్మి.

ఆనందంతో, నిద్ర పట్టని విశ్వేశ్వరరావు, వరలక్ష్మి గదిలో వెలుగుతున్న లైటుని చూస్తూ పడుకున్నాడు. ఆ లైట్లకింద వరలక్ష్మిని ఊహించుకుంటూ నిద్రపోయాడు.

నిద్ర లేచిన అతని కంటికి తన పక్కనే 'ట్రే' లో ఒక ఉత్తరం కనబడింది. అది వింతగా తోచి తీసిచూశాడు. తనకే! గబగబా చదవసాగాడు.

"శ్రీ మీకు,

మనసులోని మాటని బయటకు చెప్పుకోలేక మనం దూరమయిపోయాం. నే నిప్పుడు వివాహితను. మన సంప్రదాయం ప్రకారం వివాహ మయిన ఆడదాని మనసులో సయితం పరపురుషుడికి తావులేదు. మీరు పరపురుషుడన్న విషయం గుర్తు చేస్తున్నాను.

మనసుని జయించి అదుపులో పెట్టుకునేటంత శక్తి కలదాన్ని కాను. నామీద మీకు నిజంగా ప్రేమ ఉంటే, మళ్ళీ నా కంటికి అగపడకుండా వెళ్ళిపోండి. ఈ జన్మకి మనకి మిగిలినది ఇంతే!

ఎప్పటికీ మీ—

వరలక్ష్మి"

తెల్లబోయాడు విశ్వేశ్వరరావు. రాత్రి ఆనందంగా మాట్లాడిన వరలక్ష్మిలోని మార్పు అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"పాపం ఆడది!" అనుకున్నాడు బాధగా.

తన పక్కనే సిద్ధంగా తన సంచీ ఉండడం గమనించాడు. కొంత సేపటికి ఒకనిర్ణయానికివచ్చి, లేచి నిలబడి, బట్టలు వేసుకుని, సంచీ పుచ్చుకుని, భారంగా అడుగు లేసుకుంటూ బయటికి నడిచాడు.

రోడ్డుమీద నుంచుని ఆఖరుసారి ఆ ఇంటివంక చూశాడు. కాని గదిలో మూసిన కిటికీ తలుపుల వెనక నిశ్శబ్దంగా ఏడుస్తున్న వరలక్ష్మి అతనికి కనబడలేదు.

# కళ్యాణమందిర్

## కోడూరి కౌసల్యాదేవి

జరిగినకథ

(కళ్యాణి గర్భవిచ్ఛిత్తికి ప్రయత్నం జరిపాడు రహస్యంగా లేడీ డాక్టరు ద్వారా ప్రకాష్. డాక్టరుతో కలిసి సంప్రదించడం కనిపెట్టిన కళ్యాణి ప్రకాష్‌కు ఎదురు తిరిగింది; కాని ప్రకాష్ బలవంతంమీద లొంగిపోవలసి వచ్చింది. ప్రకాష్ అకస్మాత్తుగా ప్రయాణమై పోయిన తరవాత, తను ఒక విధమైన నిర్బంధంలో వున్నట్లు తెలుసుకుంది. ఇంకా విచారించగా ప్రకాష్‌కు మైత్రేయితో వివాహమైయిందనీ, మైత్రేయికి ప్రమాదంగా జబ్బుచేస్తే చూడ్డానికి వెళ్ళాడనీ తెలిసింది.

మైత్రేయికి గర్భవిచ్ఛిత్తి, అయి పిల్లలు కలుగడానికి వీలులేని ఆపరేషన్ జరిగి, బతికి బయటపడింది. ప్రకాష్ తిరిగి వచ్చిన తరవాత కళ్యాణీ ప్రకాష్‌ల మధ్య ఘర్షణ మొదలైంది. మైత్రేయితో అతని పెళ్ళి, తన గర్భవిచ్ఛిత్తికి డాక్టరుతో మాట్లాడడం వగైరా అన్ని విషయాలూ కళ్యాణికి తెలిసిపోయినయి అని విదితమయింది. అందుమీద తలి దండ్రులు బలవంతం చేసినట్లు కథ చెప్పాడు కళ్యాణిని అనునయించటానికి.)

— ఇక చదవండి.

"మైత్రేయిని వదలించుకోవడ మనేది నిజానికి ఒక సమస్యేకాదు. నా విషయం కళ్యాణి విషయం మైత్రేయికి బాగా తెల్సు. ఆమె నన్ను వివాహ మాడదు. అటు సూర్యు డిటు పొడిచినా; నా కా భయ మక్కరలేదు కాకుంటే మైత్రేయిని కాస్తముందుగా ప్రతిమాలుకుంటే కళ్యాణివిషయం ప్రస్తుతం బయటపడిపోయే ప్రమాదం తప్పుతుంది."

వివాహ ముహూర్తం నిర్ణయించుకోవచ్చిన ప్రకాష్‌నూ, తలిదండ్రులనూ చూచి మైత్రేయి తలిదండ్రు లమితంగా సంతోషించారు. మైత్రేయి తనను కన్నెత్తికూడా

చూడ్డదనుకున్న ప్రకాష్, మనఃపూర్వకంగా పలుకరించి, ఆదరంగా మాట్లాడ్తూన్న మైత్రేయి తీరును చూచి నిజంగా ఆశ్చర్యపోయాడు. 'ఎలాగైనా మైత్రేయిది చాలా మంచిస్వభావం,' అనుకున్నాడు.

*           *           *           *           *

"నన్ను మోసగాడనుకున్నావేమో మైత్రీ. ఇందులో నా ప్రమేయ మేమీలేదు. నాన్నగా రసలు నామాట వినడంలేదు. సరే, నువ్వే ఆపనికాస్తా చేస్తావుకదా అని వచ్చా నంతే." అన్నాడు ఆ సాయంత్రం మైత్రేయిని ఏకాంతంగా కల్సుకుని.

మైత్రేయి మౌనం దాల్చింది.

"అయితే కళ్యాణివిషయం మాత్రం పైకి రానీకు, ఆమెసంగతి యింకా రహస్యంగానే వున్నది."

"కళ్యాణివంటివారు లోకంలో వేనకువేలు ఆమె ప్రసక్తిని ఎత్తాల్సిన అవసరం నా కేమీ లేదు," అంటూనే మైత్రేయి అతడిదగ్గిరనుండి వెళ్ళిపోయింది. ప్రకాష్ తృప్తిగా నిట్టూర్చాడు.

కాని అతడి తృప్తిఆయుఃపరిమాణం చాలా తక్కువైపోయింది. ఆ మర్నాడు బావామఱదు లిద్దరూ, వదినా మఱదళ్ళిద్దరూ ఒకచో కూర్చుని పౌరోహితుణ్ణి రావించి ముహూర్తనిర్ణయాలు చేయిస్తూంటే, ప్రకాష్‌కు మతిపోయింది. ఒంటరిగా తన గదిలో కూర్చునివున్న మైత్రేయి దగ్గఱకు పరుగెట్టాడు.

"ఏమిటి మైత్రీ యిది ?" ఆత్రతావేశాలతో అడిగాడు.

"ఏమిటి ?" తాపీగా, నిర్మలంగా ప్రశ్నించింది మైత్రేయి.

"వాళ్ళు వివాహముహూర్తాలు నిర్ణయించేస్తున్నారు."

"అవును."

"మరి వద్దని చెప్పలేదా నువ్వు ? మాట్లాడవేమిటి ?" అతడి కంఠంలో అసహనం.

నిట్టూర్చింది మైత్రేయి. "నే నేమీ చెప్పలేదు. నా కనవసరం."

"మైత్రీ!" నిశ్చేష్టుడయ్యాడు ప్రకాష్. "నిన్న సాయంత్రం ఒప్పుకున్నావుకదా?"

"ఏమని ?" నిశితంగా చూచింది మైత్రేయి. "కళ్యాణిసంగతి ఎత్తవద్దన్నావు. అంతే."

అయోమయంగా చూశాడు ప్రకాష్.

"చూడు బావా!" మైత్రేయి కంఠం ప్రశాంతంగా వున్నప్పటికీ మాటలు పదునుగా ధ్వనించాయి. "నువ్వు నన్ను వద్దనుకున్నావు కానీ, నేను నిన్ను వద్దనుకోలేదు.



చిన్ననాటినుండీ తలిదండ్రులు, బంధుమిత్రులు – అందరూ 'ప్రకాష్ నా భర్త' అన్నారు. ఆ భావంతోనే పెరిగాను; ఆ భావమే నాలో పాతకుపోయి నా మనస్సును మనస్సుతో పెనవేసింది. ఇందుకు నా ప్రమేయమూ బాధ్యతా లేవు. ఈనాడు నేను కాదంటే లోకులూ, తలిదండ్రులూ అందరూ నన్నే అపార్థం చేసుకోరూ? నువ్వు యుక్తిగా తప్పించుకొని భారం నాపై వేద్దామనుకొన్నావా?"

"అది కాదు........."

"ఏదైనా నా కనవసరం. నాకు నా సుఖంకంటె తలిదండ్రుల ఆశలు ముఖ్యం ఇరవైయేళ్ళ ప్రాయపు నా మిడిమిడి జ్ఞానంకంటె అనుభవజ్ఞులైన తలిదండ్రుల అభిప్రాయంపై నాకు గౌరవం, నమ్మకం. ఏ విధంగానూ నా స్వార్థం గురించి ఎవర్నీ అసంతృప్తిపఱచలేను. అలాగని మరొకరి సంతృప్తికోసం నా అంతస్థు నుండి నేను దిగజారనూలేను. వ్యక్తికి స్వార్థరాహిత్యంతోబాటు ఆత్మగౌరవం కూడా అవసరమే."

"అయితే నాతో వివాహం పండగ కాదే? నేను నిన్ను భార్యగా చూడలేకపోతే?"

"నా అదృష్టం, దైవనిర్ణయం ఊహాగానాలు నా కనవసరం. దయుంచి యిక నాతో తర్కించకు."


LIFEBUOY
for health
ఇప్పుడు,
సొగసైన
కొత్త రూపులో!

